# దళిత గీతాలు

ప్రధాన సంపాదకుడు

**జయధీర్ తిరుమలరావు**

సంపాదకుడు

**కె.పి. అశోక్ కుమార్**


సాహితీ సర్కిల్

హైదరాబాద్ - 500 020.

దళిత గీతాలు (గేయ సంకలనం)

డిసెంబర్, 1993

ప్రతులు : 500

వెల : రూ. 25

ప్రచురణ : సాహితీ సర్కి

ముఖచిత్రం : గంగాధర్

సూచనలకు :
**కె. పి. అశోక్ కుమార్**
4-77, మచ్చబొల్లారం,
సికింద్రాబాద్-500 010.

ప్రతులకు :
**సాహితీ సర్కిల్**
1-8-1/117, సూర్యనగర్,
చిక్కడపల్లి, హైదరాబాద్-500 020.

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
1-1-517/బి/1 న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్-500 380.
ఫోన్లు : 611413, 600347.

# ఒకమాట

ఇతర భాషా సాహిత్యాలతో పోల్చిచూస్తే, తెలుగులో వచ్చిన దళిత సాహిత్యం చాలా తక్కువ.

ఎవరో అజ్ఞాతకవి 1910 లో వ్రాసిన 'మాలవాంద్ర పాట' నుండి 1993 చివర్లో వెలువడిన 'కరీంనగర్ దళిత పాటల' వరకు వందలాది గేయాలు మాత్రం కనిపిస్తాయి.

ఈ 83 సంవత్సరాల వ్యవధిలో దళిత గేయాలలో కనిపించే వస్తు, రూప పరిణామం గురించి వివరంగా పరిశీలించాల్సిన అవసరముంది. దళిత సాహిత్యం ఒక ఉద్యమంగా కొనసాగుతున్నప్పుడు, ఈ ఉద్యమ దశలను సాహిత్యంలో గుర్తించగలుగుతామా అన్నది ప్రశ్నే! గేయ సాహిత్యాన్ని విశ్లేషించాలంటే వీటిని ఎలా విభజించాలన్నది కూడా ఒక సమస్యే. ఈ విభజన కూడా ఎంత వరకు సమంజసమన్నది మరో సమస్య.

ఈ నేపథ్యంలో అక్కడ ఢిల్లీలో ఉంటున్న మిత్రులు టంకశాల అశోక్, ఇక్కడి మిత్రుడు మాష్టార్జీ సమగ్ర దళిత గేయాల సంకలనం వెలువడితే ఎలాగుంటుంది అనే ఆలోచన కలిగించారు.

తెలుగులో చెల్లాచెదురుగా వున్న దళిత గేయాలను ఒక దగ్గర ప్రోది చేయాలని, దీనివలన దళితోద్యమ దశలను - చైతన్యాన్ని అంచనా వేయడానికి వీలుండడంతోబాటు ఇవి భావితరాలకు, పరిశోధకులకు ఉపయోగపడుతుందనే ఆలోచన వచ్చింది. ఈ సమయంలోనే తెలుగులో దళిత సాహిత్యమే లేదనే విమర్శ బయలుదేరింది. ఒకసారి మాటల సందర్భంలో గురుమిత్రులు జయధీర్ తిరుమలరావుగారితో సంప్రదించాను. వారికి ఇదివరకే ఇలాంటి ఆలోచన వచ్చినా కార్యభారం వల్లా, ఇతర కార్యక్రమాల్లో బిజీగా ఉండటం

వలన ఈ పనికి నీవే పూనుకోవాలని చెప్పి, తమ వద్ద సేకరించి ఉన్న విలువైన గేయాలు ఇచ్చారు. ఎక్కడెక్కడ ఎలా సేకరించాలో కూడా తగు సలహాలివ్వడమే కాకుండా, బహువ్యాపకుడినైన నన్ను ఈ పుస్తకం పూర్తయ్యే వరకు ఎప్పటికప్పుడు వెంట తరుముతూ నాతో ఈ పని పూర్తి చేయించారు.

ఇక దళితగేయాలను సేకరిస్తూ పోతూవుంటే మా అంచనాల్ని మించి అసంఖ్యాక గేయాలు దొరికాయి. ఇక్కడే సమస్య ఎదురయింది. దొరికిన వాటిని ఎలా విభజించాలో, వేటిని ప్రచురించాలో, వేటిని వదిలేయాలో తెలియని పరిస్థితి ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో ప్రధాన సంపాదకులు జయధీర్ తిరుమలరావు, పరిశోధక మిత్రులు డా. ఎ. కె. ప్రభాకర్‌లతో కలిసి చర్చించి ఒక నిర్ణయానికి రావలసి వచ్చింది.

ఈ గీతాల ప్రాముఖ్యాన్ని తెలుసుకోవాలంటే వాటి చారిత్రక నేపథ్యాన్ని కూడా దృష్టిలో తీసుకోవాల్సి వుంటుంది. దానికనుగుణంగానే గీతాలను విభజించడం జరిగింది. ఈ గీతాలను మూడు విభాగాలుగా వర్గీకరించి విషయ ప్రాధాన్యతను, ప్రజాదరణని బట్టి, అందుబాటులోలేని గీతాలను ఎంపిక చేయడం జరిగింది. ఇందులోని మొదటివిభాగం హరిజన గేయాలు. ఈ 'హరిజన' పదం, దానికి సంబంధించిన గేయాలు జాతీయోద్యమ కాలానికి గుర్తు. ఇప్పటి తరం వారికి తెలియని ఎన్నో విలువైన గీతాలు జాతీయోద్యమకాలంలోనే వెలువడినాయి. వాటికున్న చారిత్రిక ప్రాధాన్యతనుబట్టి వాటన్నింటిని యధాతథంగా ప్రచురించాలనే నిర్ణయించాం. పుస్తకం పూర్తయిన దశలో కుసుమ ధర్మన్న కవి "నల్లజాతీయతనము" అనే అరుదైన గేయం దొరకడంతో అప్పటికప్పుడు పుస్తకం పనులు ఆపి దాన్ని కూడా పుస్తకం ముందుభాగంలో చేర్చటం జరిగింది.

దళిత గీతాలను రెండవ విభాగంలోనూ, విప్లవ-దళిత గీతాలను మూడవ విభాగంలోకి చేర్చడం జరిగింది. ఇందులో పైపైన రాసిన గీతాలు, స్తోత్రాలు లాంటివే కాకుండా పునరుక్తి అయిన గీతాలను వదిలివేశాం. కొన్ని పరిమితుల

దృష్ట్యా పుస్తకాన్ని కుదించాల్సి వచ్చింది. దాంతో వేయాలనుకున్న కొన్ని గేయాలు వేయలేకపోయాం. అందుకని ఈ సంకలనం సమగ్రమని, సంపూర్ణ మని ఏవిధంగానూ భావించడం లేదు. ఈ దశగా వెలువడిన సంకలనాల్లో ఇది సమగ్రత కోసం ప్రయత్నించిన ప్రథమ సంకలనంగా తలుస్తున్నాం.

'దళితగీతాలు' పుస్తకం ఎక్కువమందికి అందుబాటులో ఉండాలనే ఉద్దేశంతో, ఈనాటి పాఠకుల అభిరుచుల మేరకు మూడు విభాగాలను ఒక పుస్త కంగా - కేవలం దళితోద్యమానికే పరిమితమైన రెండు విభాగాలు కలిపి ఒక పుస్త కంగా విడిగా అచ్చువేయడం జరిగింది

తమ వద్దనున్న గేయాలను ఇచ్చి సహకరించిన మిత్రులు మాస్టార్జీ, ఎస్వీ సత్యనారాయణ, ఉ. సాంబశివరావు, టి మునివెంకట సుబ్బయ్య గార్లకు కృతజ్ఞతలు. ముఖ్యంగా కవిగాయక మిత్రుడు మాస్టార్జీ ఈ పుస్తకం వెలువడ డానికి ఎంతగానో సహకరించారు. గీతాల విభజనలోనూ, పాఠ్య పరిష్కారం లోను ఎంతగానో సహకరించిన పరిశోధక మిత్రులు ఎ. కె. ప్రభాకర్‌గారికి, ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత పి. శ్రీనివాస్ గారికి, వారి సిబ్బందికీ, నవ్య ప్రింటర్స్ వారికీ, ఆర్థిక సహకారం అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికీ మా కృతజ్ఞతలు.

కె.పి. అశోక్ కుమార్

# దళితసాహిత్య లక్ష్యాలకోసం

దేశంలో పాతుకుపోయిన సమస్త విలువల్నీ, వ్యవస్థనీ, మొత్తంగా మానవ విజ్ఞానాన్నీ కుదిపివేస్తూ దళిత సమస్య రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక రంగాలలోకి దూసుకు వచ్చింది.

ప్రళయగర్జన చేస్తూ సాగే విప్లవ మహారథ చక్రాలూ, చల్లగా సాగే దోపిడీపీడనల కుటిల రాజకీయ చక్రాలూ హఠాత్తుగా స్తంభించిపోయాయి. కేవలం గత చరిత్రను మననం చేసుకోవడం ముఖ్యమే కాకుండా వర్తమాన ఆచరణనీ, భవిష్యత్ లక్ష్యాలనీ దృష్టిలో పెట్టుకుని దళితులు ఏంచేయాలో చర్చించడానికి వాతావరణం విస్తృతంగా సానుకూలమైంది.

గతాన్ని విశ్లేషించుకోవడం అంటే వర్తమాన అవసరాల్ని గుర్తించడం. వర్తమానంకోసమే, వర్తమానంనుంచే గతాన్ని చూడడం. సాహిత్య సాంస్కృతిక రంగాల్లో దళితుల నేటి, రేపటి పాత్ర ఏమిటో తెలుసుకోవడానికి దళిత సాహిత్య చరిత్రావలోకనం తోడ్పడుతుంది.

## 2

కులవ్యవస్థ భారతదేశానికి ప్రత్యేకమైన సామాజిక విభాగ రూపం. అంబేద్కర్ చెప్పినట్టు అది శ్రమవిభజన మాత్రమే కాదు. శ్రామికుల విభజన. మనుషుల శక్తి సామర్థ్యాల ఆధారంగా కాకుండా పుట్టుక ఆధారంగా వృత్తులను నిర్ణయించింది. అధిక సంఖ్యాకులను చదువుకు విజ్ఞానానికీ దూరం చేసింది. ఎక్కడా కులవ్యవస్థ ఉల్లంఘన జరగకుండా, సంకరం కాకుండా క్రూరమైన చట్టాలను చేశారు. బ్రాహ్మణవాదం ఈ దేశంలోని అత్యధిక సంఖ్యాకుల మానవ శక్తిని ఎందుకూ కొరగాకుండా చేసి, కొద్దిమంది అధికారాన్ని, వైభవాన్ని పెంచి పోషించింది. ఈ అంతరాల సామాజిక వ్యవస్థలో అట్టడుగున ఉన్న "అస్పృశ్యుడు" ఇవాళ అధికారం కావాలని గర్జిస్తున్నాడు.

ఈ పరిణామం ఒక్క రోజులో జరిగింది కాదు. వేలయేళ్ళ కిందటి నుంచి ప్రారంభమై, ఇటీవలి శతాబ్దాలలో పదునెక్కి, మొన్న మొన్న అంబేద్కర్‌తో పరాకాష్ఠకు చెందింది - బ్రాహ్మణవాద వ్యతిరేక, బహుజన సమాజవాదం. ఎన్నో రాజకీయ పరిణామాలు, ఎన్నో ఆర్థిక మార్పులు, ఎన్నో సామాజిక కారణాలు నేపథ్యంగా, దళితుడు తన 'ఉనికి'ని గురించి తర్కించుకుని, అందులోని దుర్మార్గాన్ని ప్రశ్నించుకుని, ప్రశ్నించి,ఆవేదన నుంచి ఆత్మాభిమాన ప్రకటనకు ఎదిగి, ఇవాళ రాజ్యాధికారం కావాలంటున్నాడు.

బ్రాహ్మణవాదానికి శంకరాచార్యుడో, ఒక గ్రంథమో, ఒక కులమో ప్రతినిధి కానక్కరలేదు. దాన్నొక చీడగా పీడగా గుర్తించి ప్రతిఘటించలేక పోయిన వారంతా ఆ వాదం ప్రభావంలో ఉన్నవారే. అందుకే సమాజాన్ని సమూలంగా మార్చివేసి గొప్ప విలువలున్న మానవీయ సమాజాన్ని నిర్మిస్తామని ప్రకటించి, పోరాడుతూ బలిదానం చేస్తున్న మిలిటెంట్ శక్తులలో కూడా పురాతన విలువలు స్త్రీల విషయంలోనో, దళితుల విషయంలోనో కొనసాగు తున్నాయి. ఆయా రాజకీయ బృందాల నిర్మాణ స్వరూపంలో నైతేనేమి, నాయక శ్రేణులలో నైతేనేమి బ్రాహ్మణీయ పురుషాధిక్య భావజాలం బలంగా పాతుకునిపోయి వుంది. ఆ కారణం వల్లనే దళితశక్తులు ఇవాళ విప్లవకారుల నుంచి కూడా విడిగా తమఅస్తిత్వాన్ని పెంచుకుంటున్నారు.

సమాజంలోని ఒకప్రధానవైరుధ్యాన్ని గుర్తించకపోవడం, దాన్ని పరిగణన లోకి తీసుకుని పోరాడకపోవడం యాదృచ్ఛికంగా జరిగేది కాదు. అలాగే, దళిత సమస్యను గుర్తించి సాహిత్యం ద్వారా వ్యక్తం చేసిన కవులకు,సాహిత్యకారులకు 'గుర్తింపు' రాకపోవడం కూడా యాదృచ్ఛికం కాదు. ఇప్పటిదాకా జరిగిన సాహిత్య చరిత్ర సాహిత్యకారులపై అంచనాలు అన్నీ ఇప్పుడు పరీక్షకు నిలబడుతున్నాయి. 'ప్రగతిశీల శక్తుల'లోని బ్రాహ్మణవాదాన్ని అన్వేషించడం కోసం మాత్రమేకాదు. దళితశక్తుల మూలాల అన్వేషణకు కూడ గతాన్ని మళ్ళీ అన్వేషించవలసి వస్తుంది. గురజాడ అప్పారావు కానీయండి,గాంధీ కానీయండి, జాషువా శ్రీశ్రీలు కానీయండి, పూలే, పెరియార్‌లు కానీయండి - అందరినీ కొత్తగా చూడవలసి వస్తున్నది. ఇవ్వాళ్టి ఉద్రేకాలలో అందరిపై 'ఖచ్చితమైన' అంచనాలు లభిస్తాయని గ్యారంటీ లేదు. కానీ, ఈ ప్రశ్నలతో చర్చలతో వర్త మానం బలపడుతున్నది.

*  *

# 3

బ్రాహ్మణవాదాన్ని. కులవ్యవస్థను ప్రశ్నించి, బలహీనపరిచిన ఉద్యమాలు, వ్యక్తులు వేల ఏళ్ళ నుంచి ఉన్నాయి, ఉన్నారు. ఆ ఉద్యమాలకీ, వ్యక్తులకూ దళితస్పృహను ఆపాదించడం కానీ, నూటికి నూరుపాళ్ళ బ్రాహ్మణవాద వ్యతిరేకతను అంటగట్టడం కానీ, సరిఅయినది కాదు. వర్గ మొక్కటే సత్యం, తక్కినవన్నీ మిధ్య అని నమ్మిన కమ్యూనిస్టులతో పోలిస్తే, అగ్రకుల సంస్కరణవాదులే అధికంగా కులవ్యవస్థను పట్టించుకున్నారనిపిస్తుంది. "ఉదార" సర్వకుల సమానత్వాన్నో, కులరాహిత్యాన్నో స్థూలంగానైనా వారు ప్రతిపాదించారు. "హరిజనోద్ధరణ" పేరిటో, మూఢాచారాల వ్యతిరేకత పేరిటో సాగిన ఆ హైందవ సంస్కరణ వాదంలో బ్రాహ్మణాధిపత్యాన్ని ప్రశ్నించిన తీరుకు, దళితుడు స్వయంగా నాలుగుపడగల హైందవనాగరాజును నిలదీసినతీరుకు చాలా భేదంవుంది. అంటరానితనం తనకుతగిలిన శాపంగా, దౌర్భాగ్యంగా భావించికరుణ రసపూరితంగా "అస్పృశ్యుల" దైన్యాన్ని చెప్పిన దళితకవి కంటె, కుల వ్యవస్థ వెనుక, అంటరానితనం వెనుక ఉన్న బ్రాహ్మణవాద వ్యవస్థను, దాని క్రూరత్వాన్ని గుర్తించి దాని పరిష్కారం బహుజన సామాజిక వ్యవస్థలో ఉందని చెప్పే దళితకవి ఆధునికుడు. అంబేద్కర్ చెప్పిన "వర్గ - కుల సమాజం" భావనను అంగీకరిస్తూ, మార్క్సిజాన్ని, అంబేద్కరిజాన్ని సృజనాత్మకంగా అన్వయిస్తూ ఇతర విప్లవశక్తులలో దళితశక్తులు కలిసినడవాలని చెప్పే దళితవాది మరింత ఆధునికుడు కావచ్చును.

కాబట్టి, దళిత సమస్యపై కవిత్వం కట్టిన వారందరి నైతిక స్థాయి ఒక్కటిగా వుండదు. చారిత్రకంగా ఆయా సందర్భాల నేపథ్యంలో దానిని అంచనా వేయవలసి వుంటుంది. గాంధీ రాజకీయ నినాదంలో భాగంగా జరిగిన "హరిజనోద్ధరణ" ఉద్యమం దళితులపై కరుణ పూరితమైన దృష్టిని, పితృస్వామిక వాత్సల్యాన్ని చూపిస్తుంది. అనేక సాధారణ తర్కాలద్వారా అగ్రవర్ణాల వారిని ప్రబోధిస్తుంది.

గరిమెళ్ళ సత్యనారాయణ ప్రభృతుల గేయాల్లో ఆ ధోరణిని చూడవచ్చు. అలానే, జాతీయోద్యమం కాలం నాడు పాటలు రాసిన దళిత కవుల ధోరణి

కూడా నేటి కవులవలె స్పష్టతతో, లక్ష్యశుద్ధితో వుండదు. వామపక్ష విప్లవ శిబిరాలలో ఉన్న దళిత కవులు, ఇతర కవులు దళిత సమస్యపై రాసిన పాటల్లో వ్యక్తీకరణ ఆయా రాజకీయ ఎత్తుగడలపై ఉన్నంతగా సమస్యపై వుండదు. ఈ అన్ని ధోరణులు ఇందులో ఈ సంకలనంలో ప్రతిఫలించినాయనే చెప్పవచ్చు.

## 4

ఈ సంకలనంలో చోటు చేసుకొన్న గేయాల్ని పరిశీలిస్తే దళిత సాహిత్యంలో ప్రముఖంగా కనిపించే అంశాలు ఇవి-

- దళిత అస్తిత్వ అన్వేషణ
- అసమాన సామాజిక జీవన వ్యతిరేకత
- సాహిత్య సాంస్కృతిక రంగాల్లోని గుత్తాధిపత్యంపై ధిక్కారం
- నవ్య విలువల ఆవిష్కరణ
- పోరాటంద్వారా దళిత సమస్యల పరిష్కారం
- విప్లవమార్గంలో దళితుల ఐక్యత

తెలుగులో ఈ అంశాలు కేవలం కవిత్వంలో (గేయం, వచనకవిత) కనిపిస్తున్నాయే గానీ వచనంలో (కథ, నవల, నాటకం) కనిపించవు.

ఈ గీతాల విశ్లేషణ ద్వారా దళిత సాహిత్యాన్ని ఈ కింది విధంగా నిర్వచించుకోవచ్చు:

కులం ప్రత్యేక లక్షణాల్ని విశ్లేషిస్తూ, కుల నిర్మూలన ధ్యేయంతో రాసింది—

దళితులపై జరిగే అణచివేతకి వ్యతిరేకంగా, అన్ని వివక్షలకు వ్యతిరేకంగా రాసింది—

"ప్రజాస్వామిక మానవ సంబంధాల అనుబంధాన్ని ఆశించి చేసిన రచన దళిత సాహిత్యం'' అని ఒక నిర్వచనం.

మరో నిర్వచనం—

"సాంఘికంగా దోపిడీకి గురవుతూ, అస్పృశ్యులుగా పరిగణింపబడుతూ, నీచవృత్తులుగా భావించే వృత్తి పని చేసుకుంటున్నవారు, శారీరక శ్రమపై ఆధారపడేవారు దళితులు ఈ దళితుల చైతన్యంకోసం రాసేదే దళితసాహిత్యం.

ఇందుకు పొడిగింపుగా—

"పై పేర్కొన్న దళితులే తమ సమస్యలపై తాము రాసుకొనే సాహిత్యం దళిత సాహిత్యం!''

"సాహిత్యంలో అగ్రకుల స్వభావం లేకుండా అడుగు వర్గాలవారి ఆలోచనలను ప్రతిబింబింపేదే దళిత సాహిత్యం!''

జానపద సాహిత్యంలో కూడా ఈ లక్షణాలు చోటు చేసుకుంటే దళిత సాహిత్యం అనవచ్చును.

పండితభాష, అలంకారశాస్త్రం, ఛందస్సు, కవిత్వ వ్యక్తీకరణ విధానం అగ్రకులాల వారికి ప్రత్యేకంగా ఉంటాయి. ఇందుకు భిన్నంగానూ దాన్ని ఖండిస్తూ వెలువడితే అది దళిత సాహిత్యం అవుతుంది.

దళిత సమస్య, దళిత సాహిత్యం సామాజిక, సాంస్కృతిక అణచివేతకు వ్యతిరేకంగానే వచ్చింది. తదితరమైన అంశాలతో కొద్దో గొప్పో సాహిత్యం వచ్చినప్పటికి ఎక్కువగా అటువంటి సాహిత్యం పునాదిని వదిలేసి ఉపరితలం మాత్రం స్పృశించినదైన కారణంగా చరిత్రలో నిలబడలేకపోవడం గమనించవచ్చు. ఆ సాహిత్యానికి కొద్దో గొప్పో ప్రచారం లభించినా అది తాత్కాలికమే అన్నది చరిత్ర చెబుతోన్న సత్యం.

ఈ సంకలనంలో - ఉద్దేశపూర్వకంగానే కావచ్చు - అణచివేతకు వ్యతిరేకంగా వచ్చిన గీతాలే ఎక్కువ చోటుచేసుకున్నాయి. అందునా వామపక్ష భావాలలో వెలువడ్డ దళితగీతాలకి కూడా ప్రముఖస్థానం లభించింది. దళిత సాహిత్యాన్ని లోతుగా విశ్లేషించడానికి ఈ గీతాలు బాగా ఉపయోగపడతాయి.

అయితే తెలుగులో దళిత సాహిత్యం పాటకూ, వచన కవితకూ మాత్రమే పరిమితమవడం చూస్తే చాలా బాధ కలుగుతుంది. నవల, కథ, నాటకంలాంటి

ప్రక్రియల్లోకి దళిత స్పృహ చొచ్చుకుపోకపోవడాన్ని కూడా మనం ఆలోచిం చాల్సి వుంది. దళిత గీతాలవలె దళిత నాటకం, నవల, కథలాంటి ప్రదర్శన రూపాలు, వచన రచనా ప్రక్రియలూ రాకపోడానికి ముఖ్యంగా రెండు కారణాలు పేర్కొవచ్చు. 1. పాటకి - దళితులకి ఉన్న తరతరాల అనుబంధం పనికీ - పాటకీ-ఉన్నంత ప్రాచీనమైంది. దళితుని భావవ్యక్తీకరణ సాధనం పాటే. అందుకే ఆధునిక వచనంవైపు దళిత రచయిత ఇంకా మొగ్గలేదు. 2. పాటకి ఉన్న ప్రచారం గుణం కూడా కవిని పాటవైపే చూసేలా చేసింది.

వచన కవితలో దళితకవి వ్యక్తిగత అనుభవాల్ని విశ్వజనీనం చేయ డానికి ప్రయత్నిస్తే, గీతాల్లో స్పష్టంగా నిర్మాణాత్మక వైఖరితో పోరాట మార్గాన్ని నిర్దేశించాడనికూడా ఈ సంకలనంలోని గీతాలద్వారా తెలుసుకోవచ్చు. అయినప్పటికీ దళిత సమస్యకి చెందిన కవిత్వ ప్రాధాన్యం ఇంకా పెరగాలి. జీవిత వాస్తవికత మరింత విస్తృతంగా చోటుచేసుకోవాలి. దళిత సమస్యపై పని చేస్తున్న అన్ని వర్గాలవారూ విభిన్న కోణాల్లోంచి ఇందుకు స్పష్టమైన అవ గాహనతో కార్యాచరణకు పూనుకోవాలి.

కానీ, దళిత మేధావులు- తాత్త్విక చర్చలమీద పెట్టినంత దృష్టిని సృజ నాత్మక సాహిత్యం మీద పెట్టడం లేదు. తాత్త్విక చర్చలుకూడా వాసికన్నా రాసి ఎక్కువైంది. అందుకనే దళిత సాహిత్యోద్యమం తెలుగులో సాహిత్య విలువల్ని మార్చలేకపోయింది. దీన్ని దళిత రచయితలు, కళాకారులు, మేధావులూ కలసి ఆలోచించాల్సి వుంది.

భవిష్యత్తులో ఎలాంటి రాజకీయ ఎత్తుగడలు అవలంబించినప్పటికీ, ఎన్నికల జూదంలో గెలుపోటములు చవిచూసినప్పటికీ వాస్తవ దళిత సమస్యని వాటితో ముడిపెట్టుకొని సంతోషానికో విచారానికో లోనుకాకూడదు. దళిత సాహిత్య లక్ష్యాల్ని సాధించడానికి కొనదాకా పోరాడడానికి రచయితలూ, కవులూ, కళాకారులూ, మేధావులూ ఒక స్పష్టమైన అవగాహనతో ఐక్యంగా కృషి చేయాల్సి వుంటుంది. ఆ అవసరాన్ని గుర్తించకపోతే వివిధ ఉద్యమాలకు అనుబంధంగా ఏర్పడ్డ సాహిత్య సంస్థలు చేసిన పొరపాటే పునరావృతం అవుతుంది.

—జయధీర్ తిరుమలరావు

# విషయసూచిక

## హరిజన గీతాలు - మొదటి భాగం :

## హరిజన గీతాలు - రెండవ భాగం :



## దళిత గీతాలు :

## విప్లవ - దళిత గీతాలు :

## మాలవాండ్ర పాట

అందారు పుట్టిరి హిందమ్మ తల్లికి
అందారు ఒక్కాపై ఉందారి సక్కాంగ॥
కష్టమ్ము లొచ్చిన నిష్టూర మొచ్చిన
ఇష్టమ్ము గానుండి కట్టూగ నుందాము॥ ॥అందా॥

ఎట్టాగూ యెక్కూవ బ్యామ్మర్లు మాకంటె
ఎట్టాగూ యెక్కూవ యేరైన మాకంటె॥ ॥అందా॥

వర్ణాల యెక్కూవ పుట్టంగ లేదయ్య
మమ్మేల క్రిందికి కుమ్మేరు మానోరు॥ ॥అందా॥

వేదాలు మాన్యారు ఇంగ్లీషు చదివారు
ఎగబడు చున్నారు ఎట్టి వృత్తులకైన॥ ॥అందా॥

మతముచ్చు కుంటేను మావోద వంటారు
మతముచ్చు కోకుంటే మాలోద వంటారు॥ ॥అందా॥

సోపెట్టి కడిగితే శుబ్రమౌ నంటారు
సోపెట్టి కడుగూకొ శుబ్రంగ నుంటాము॥ ॥అందా॥

సారాయి తాగాము సక్కాంగ నుంటాము
వేదాలు సక్కాంగ ఇనిపించుతామయ్యా॥ ॥అందా॥

హిందూల మౌమమ్ము మందూల మానవద్దు
హిందూల మౌయిప్డు ముందూకు వస్తాము॥ ॥అందా॥

తమ్మూలంమనిమీరు మమ్మూల జూడండి
అమ్మోరు దీవించి అయిశ్వర్య మిచ్చును॥ ॥అందా॥

1910

# మాలలు

మలిన వృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియు రొక; దే
శమున కొందరి వెలికి దోసిరి
మలినమే మాల?

కులము లేదట వొక్క వేటున
పసరముల హింసించు వారికి;
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూరకర్ములకున్॥

మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణ ధర్మమ
ధర్మ ధర్మంబే?

అనెడు నిశ్చయ మాతృదోపగ
"వినుము కన్నియ!" యంటి యెదురై
"జనులు తెలియక పలుకు మాటకు
జనదు వగ వంగన్."

మంచి చెడ్డలు మనుజులందున్న,
యెంచిచూడగ, రెండె కులములు
మంచియన్నది, మాలయైతే,
మాలనే, అగుదున్!

మాల యను వారున్న, వారల
మంద బుద్ధికి వగవ వలె; తన
యందు లేని కొరంత కలదని
వగవగా నేలా?

మాలిన వృత్తులు మాన్పి, మాలల
వలస తెచ్చితి యీ వనాంతము;
పల్లె కలదట; ప్రాజ్ఞ లందలి
ప్రజలు మావారల్!

పాడి పంటలు గలవు, తామర
దంపరలు మా పశుల మందలు;
జంతు హింసను చేయ నొల్లము
భూతదయ మతము!

మాలనైనను మలిన వృత్తులు
మానుకొంటిని గురువు దయచే;
పొలములోపల పశుల మేపుచు
పొట్ట పోషింతున్.

కాని, మనుజుని బుద్ధిలోపల
కలవు తన మే లొరుల కీడును
తలచు వృత్తులు కానబోయిన
కలచు నెవ్వారిన్!

మాన్పగలిగితి కొత్తకోతలు;
మాన్పవశమే, మాటకోతలు
దత్తిచంపును మాట వాతలు
మాన వే నాడున్!

గురజాడ అప్పారావు
"లవణరాజు కల"
ఆంధ్రభారతి, మే, 1911

## పంచములు

అన్నలారా వినుడి మన - యఘ మొక్కటి గనుగొనుడి మన
చిన్నితమ్ములను జేరపిసి దయ - చేసి మహాదర మిడుడి ॥అన్న॥
పంచమహాపాతకముల సమమురా - పంచము లగుచు వచించి
పంచభాగముల నొక టగు హైందవ - ప్రజలను దూషణ సేత ॥అన్న॥
వేదశాస్త్రములు ధర్మశాస్త్రములు - వేయి విధంబులఁ జెప్పు
ఉన్మాదత వీడి యెల్లరును వొక్కటను - మాన్యసూత్రమును
నెరుగు ॥అన్న॥
అంటరా దనుచు నాడరా దనుచు - నతిదూరమునకు ద్రోసి
అచంటిబిడ్డలకు నార్యఋషీంద్రుల - శాస్త్ర రహస్యము మూసి ॥అన్న॥
క్రూర వృత్తులకు ఘోరకర్మలకుఁ - గోరి వారి నెరచేసి వారి
చేరువ చేరక బండ బూతులను - జేదుగ మీనోరు చేసి ॥అన్న॥
స్నానము చేస్తిమి దూరము బొమ్మని - చావ వారలను గొట్టి
ఆ దీనులు తెచ్చిన వస్తువు లెల్లను - దిని వారలఁబడఁదిట్టి ॥అన్న॥
కుష్ఠురోగులను గూడ నొకప్పుడు - కూడియుండెదరు గాని-
భ్రష్టులందు వారల నయ్యయ్యో! పలకరించ రది యేమి
వారల నిట్టుల నీచపుచ్చిన - వరపుణ్యమునకు ఫలము నొక
సారి కన్నులను విచ్చి ప్రపంచపు - సకలదిశల గనుగొనుము
ఎక్కడ జూచిన హిందూదేశజు - లెంగిలిమెతుకులు వలెను ॥అన్న॥
ఆ కుక్కలకంటెను గూడఁ దక్కువగఁ - గొట్టబడుదురీ యిలను
మానవులెల్లరు సోదరులనుచును మనల నెవ్వరన రిలను
ఆ కూనల నిట్టులఁ జెడగొట్టుటచేఁ - గూడినదిర యిట్టులను ॥అన్న॥
ఏమి నోరులను బెట్టి వారికడ - ఏద్వంగలము ధర్మముకు
భూమిని సర్వ సమానత్వంబు నల - బోజేస్తిమి ముందుగను ॥అన్న॥
సర్వ సమానత బాదుకొల్పి యాజనముతోఁ గల యండి
ఆ సర్వేశుడు స్వేచ్ఛా వర్షంబును - సరస జల్లు మనపైని ॥అన్న॥

గరిమెళ్ళ
1919

## "పరాకు సేయుట పాడిగాదురా" వలె

ప॥ పంచములని వంచన సేయుట కెంచదగదు వినరా॥

అ॥ప॥ కొంచపరుపకను మంచితనమునను । సంచరించుట మనపనిరా ॥పంచ॥

పుట్టిన దాదిగ గిట్టువరకును । నెట్టి పనికినైనా
గట్టిగ మాలడె పట్టుగొమ్మరా । గుట్టు తెలసి మనరా ॥పం॥

పొలముల దున్నుచు । ఫలములు గూర్చుచు । పలుబాము
లబడుచు । కలిగిన సిరులను । కలవారలకిడి మలమలమాడే
మనుజులురా ॥పం॥

ఎంతో హీనులని, స్వాంతమునందున పంతము బూనకురా ।
సుంతమైన సంశయము వలదు వాల్మీకి । సంతతి వారలురా ॥పం॥

దాసవృత్తిలో । గాసిలు వారల । జేసిన దోసమున । ఆసలు
డిగియా । దాసవృత్తిలో వేసరుచుంటిమిరా ॥పం॥

సోదరులనువలె ఆదిమాంధ్రులను । ఆదరించువరకు । పోదు
జానిసము । రాదు స్వరాజ్యము । లేదు ముక్తి మనకు ॥పం॥

**జాతీయ గీతములు**

చెఱకువాడ వెంకటరామయ్య
దామోజీపురపు వెంకటనరసింహారావు

**1921**

## మేలుకొలుపు

మేలుకొనరా మాలవాడా! మేలుకొనరా మాలో
వాడా! మేలుకొనవేరా! సోదరా ॥మేలు॥
మేలుకొనుటకు వేళలెమ్మిక। మేలుకొనుమిక।
మేలుకొనుమిక। చాలుచాలును నిదురమానుమురా। సోదరా ॥మేలు॥

గాంధిదేవుండవతరించెను। కానికాలము
పోవుచుండెను। కనుల తుడువుము। ఉలికిపడకుమురా సోదరా ॥మేలు॥

పాచిమొగమును కడుగుకొనుమిక నీచ వృ
త్తుల మానుకొనుమిక। బూచివాడనిపించుకొనకుమురా। సోదరా ॥మేలు॥

బూతు మాటల నాడబోకుము। నీతిగాదది
మానవునకును। జాతి గౌరవమెంచుకొనవేరా సోదరా। ॥మేలు॥

గొడ్డు మాంసము కోరి తినకుము। పెద్దదారుల
నడువబోకుము। జిడ్డుతనమును వదలుకొనవేరా। సోదరా ॥మేలు॥

అంటరాని దాని తినియెడు। నట్టి దానిని తినుట మాని
అంటుదోషము మంట గలుపుమురా సోదరా ॥మేలు॥

అంటు సంటులేని మార్గము నంటుకొని జీవనము
గడపర। వెంటనే మేల్కొనుము లే లేరా సోదరా ॥మేలు॥

మాల మాదిగ కులము హిందూ। మతములో
ఏల లేదు లేదుర। జాల మేలను మేలుకొనవేరా సోదరా ॥మేలు॥

జాతిభేదము మాయవాదము। నీతియే
మన జాతి సూత్రము। గోతిలో పడిపోయి
నావటరా। సోదరా ॥మేలు॥

నుడువనా వాల్మీకి యెవరో। తరుణి యరుంధతి
యెవరో। మరచి దుర్గతిజెందినావటరా। సోదరా ॥మేలు॥

నీతిగల్గిన జీవనమే సుమి! ఖ్యాతి దెచ్చెను
వారలకు భువి। నీతి సంగతి మదిని దలచుమురా సోదరా ॥మేలు॥

ఒళ్ళు తెలియక మత్తుజేసెడి। కల్లు త్రాగెదవేమి
పాపము। తెల్లవారెను మేలుకొనవేరా సోదరా ॥మేలు॥

ఆరుకోట్లకు మించియుండిన। ఆది హైందవ
జనులు మీరిటు। అడవిపాలై పోవతగునటరా సోదరా ॥మేలు॥

జగన్నాథా దాసుడిగతి। వగచిమిమ్ము వే
డుచుండెను। నిగమ మార్గము తెలిసికొనవేరా సోదరా ॥మేలు॥

కొండపల్లి-జగన్నాథరావు
స్వరాజ్య నవనీతము
1921

## మము విడిచి స్వరాజ్యమందుట సాధ్యమా?

ఆదిమాంధ్రులమగు మా యస్పృశ్యత,
నవలద్రోయుడో బుధులార
సాదరమొప్పగ మీరును మేమును
సహ జన్ములమో ద్విజులారా!
మీరీతిగ భారత వర్షంబున,
మేముదయింపగ లేదా
అరయమీరును మేమును గలిసియు,
భారతీయులమె కాదా
ఘనుడు వసిష్ఠుండను మౌనీంద్రుడు,
గనుగొన మా యల్లుండుగదా
ఇనవంశోత్తములగు రాజన్యుల
కెల్ల బురోహితుడతడెకదా!
అన్నలార పల్నాటి పీరులలో,
కన్నమనీడుమా వాడెకదా,
పన్నుగవైష్ణవశ్రేష్ఠుడైన తిరు,
ప్పాణియు మా సోదరుడెకదా!
పూర్వ విధమ్మున మము బ్రోచుటకును,
బూనుట న్యాయము గాదా,
గర్వితమతులని గారవింపకను,
కడకుద్రోయ మర్యాదా॥
మీరునమ్మి కొలచెడి దైవంబుల
మేమర్చించుటలేదా,
వేరుసేయకను మీతోసమముగ,
విద్యలు నేర్పగరాదా॥
అంధకులై మమువిడిచి స్వరాజ్యం
బందు టసాధ్యముగాదా॥
నరససూరి రచియించినగీతము
మరువక మదిస్మరియించి,
సరగునమా దురవస్థల బాపుడు
సాధులార కరుణించి॥

—తిరునగరి వెంకటసూరి
1922

# స్వరాజ్య తత్వము

(నగుమోమూ వలె)

అంబా భారతమాత ఆదరింపుమసుతులా
నీ పాదా సేవాలే నిత్యానందము మాకు
తుచ్ఛోదర పూరణకై మేమిక స్వచ్ఛమైన స్వేచ్ఛను వీడము ॥అం॥
పంచాములవంచించిన పాపానుభవము కొరకూ పాప
పు పాలకులకు లోబడి నీప్రాపు గాంచలేకుంటి మె తల్లీ ॥అం॥
తుచ్ఛా సంస్కరణంబులె స్వేచ్ఛా నొసగును మన
కనుచు హెచ్చగు సంతసముననేగి తిరిగివచ్చుచుండె
బాసవీగి కొందరు ॥అం॥
నిరుపమాన నిరాకరణాస్త్రంబును కరమునబూని కర
మరుదుగ కఠినపు శాసనముల ఖండించగ నిలుచితిమే తల్లీ ॥అం॥

కంభంపాటి లక్ష్మీనరసింహ సోమయాజులు
"స్వరాజ్య తత్వము"
1923

(మాలల నెందుకు తూలనాడెదరు?)

మాల మాలలని తూల నాడుటిది చాల పాపమన్నా।
దీనిచే భావిఫలము సున్నా అనుచుదెల్పి శ్రీ గాంధిమహా
త్ముడు అ-గె జైలుకన్నా ॥మా॥
మూర్ఖపు మూఢాచారమునకు చేజిక్కి-యుంటిమన్నా।
ఆ దిక్కు-జనకుమన్నా। అది కుక్క-పలలమన్నా। చన్నమను
జులకు లబ్ధిసున్నా। ఆ మక్కు-వవిడి శ్రీ గాంధిమహాత్ముని
పక్క-జేరుమన్నా ॥మా॥
అనుదినమును వారనుభవించునా యిడుమలుగనుమ
న్నా। వానిగని చింతనందుమన్నా। అదియె మనభావిభా
గ్యమన్నా। వారి వంత దీర్తునని నువ్వొక పంత
మూను మన్నా। ఆపంతమూని ప్రజలున్న గాంధి తన
చింతనీడునన్నా ॥మా॥

ఎక్కువైన స్వాతంత్ర్యపదవి మనమందగోరియున్నా।
ముందుపంచముల్బ్రోవకున్నా। పరతంత్రమువినదన్నా।
యిక నెన్నిజన్మములకైనను మనకు స్వతంత్రపదవిసున్నా।
యిది విధిలిఖితమురన్నా ॥మా॥

దేశమందు ప్రజలందరంకంటెను పాటుకధికులన్నా। చీ
వాట్లబ్రతుకులన్నా। కారణమునుగనుమన్నా। ధనమును
మితిగావాడు టెరుగకకీ చేటు వొందిరన్నా। పై వాటమెల్ల
వారలమనసులలో నాటజేయుమన్నా। అదియు మనజయ
సూచకమన్నా ॥మా॥

అంటరాని తనమును ద్వేషించకయుంటదోషమన్నాడు
దానిగనిచింతనందుమన్నా। అదిమనకు పెనుభూతము
రన్నాయీనిరుంకుశాపైశాచ బాధలకునిదివిభూతిరన్నా ॥మా॥

కంభంపాటి లక్ష్మీనరసింహ సోమయాజులు
"స్వరాజ్య తత్త్వము"
1923

(మాలలెవరు?)

వారు మాలలా లేక వీరు మాలలా?
మాల మాలలంచు మమ్మ జీలదీసి సంఘమందు బేద
భావములను బెంచి బాధలంద జేయునట్టి ॥వా॥
ఆంగ్ల దేశమునకు దాము అధిక విద్యలందబోయి ఆంగ్ల వి
ద్యకన్న అధికమద్యపాన విద్యనేర్చు ॥వా॥
వాటమైన గింజ తాను దినక పాలి వానికిడక పోటీధ
రలకమ్మి ధనపుమూట జూచి పొంగుచుండు ॥వా॥
అరువదేండ్ల వయసునందు అబలనొకతె బెండ్లియాడి
యాగములను జేసి దేవభోగమనుభవింపగోరువారు ॥వా॥
కాయకష్టమనుభవించి కాణీ దెచ్చు విధినిమరచి వాద
ములను బెంచి బీద జనులను బాధించి బ్రతుకు ॥వా॥

కంభంపాటి లక్ష్మీనరసింహ సోమయాజులు
"స్వరాజ్య తత్త్వము"
1923

(అన్నలాలా యీ హిందూదేశము వలె)

హిందూ సోదరులారా మీరిపు డేమరియుండగ రాదండీ
పంచములా పరితాపము దీర్చే మంచిదారియోచించండి
అంటరాని తనమన్నమాట మన ఆర్యులుమున్నెరుగరు
సుండీ యీ అంటువ్యాధి తొలగించకుండ మనమ్మింట దోషమనినమ్మండీ
శంకరాది మతకర్తలంత నిశ్శంకతోడ దెల్పిరిసుండీ
సందియమును విడిహిందూదేశజు లన్నదమ్ములని నమ్మండీ
వశిష్టాది మునులెల్లరు వారల స్వానుభవము జూపిరి
సుండీ అరుంధతీ మొదలగు యువతుల చారిత్రములను బరికించండీ
నావ నెక్క బోయిన వారలనతి నీచదూషణలు మానండీ
మానావ మానములు వారికిగలవని ఆత్మలలోమీరుంచండీ
శుద్ధి బుద్ధి శూన్యము వారలకను భేద బుద్ధి విడనాడండి
పరిశుద్ధులయ్యేడి విధానమిచేయని పెద్దలు వారికి తెల్పండీ
అలజడిగా నాస్పత్రుల కేగిన నాదరించి మందిడరండీ
ముందు సూటు బూటులు గలవారికె మందులిచ్చి పంపెదరండీ
రైలుబండ్లలో నెక్కబోయినా రాకురాకు మందురు తండ్రీ
చీటి దండగై మాటరాక బల్ చేటునందుచుండుదురండీ
హిందూ మతమనుదినమును దెలిపెడి అహింసార్థమును గనుగొండీ
ఆ యర్థములను గని స్వార్థము విడి వారి నుద్ధరించుటకు బూనండీ

కంభంపాటి లక్ష్మినరసింహ సోమయాజులు
స్వరాజ తత్త్వము
1923

(రామానుజా మమ్మాదరింపుము వలె)

తండ్రిరామానుజా తరలిపోయితివా।
చండశత్రులబారినుండ లేమయ్యా ॥తండ్రి॥
అక్రమసంఘాల నవలీలగొట్టీ
దిక్కులేని మాలలను చేతబట్టీ

మాలపల్లెలుజేరి మముజేరబిలచీ
లీలా తిరుమంత్రోపదేశంబు జేశి

శంఖుచక్రా ముద్రణములంది నట్టి
నరులంతా సములానీ శాసించితివిగా

దుక్కి ఎద్దులకన్నా దున్నాల కన్నా
అయ్యయ్యోమాగతి అన్యాయమాయె
విప్రవీధుల మేమూ వెళ్ళేటి వేళ
ముల్లెబోయిన యట్లుగొల్లుమందురయా
ఊరికీ దూరామౌ మరుగుస్థలములలో
చారె చారుడు నేలె శరణంబుమాకు
క్రూరనేరము జేయు చోరూలాఖైదులో
కుశలమడిగెదరు వారముకొక్కసారి
బందె లోనున్నట్టి బద్మాషునైన
రోగియైనా మందూలిచ్చి బ్రోచెదరూ
ఆరుకోట్లుమేమూ అల్లాడుచుండా
పాపాపుదొరతనము పరికింపదాయె
మాయమాటలుజెప్పి మముబుజ్జగించి
వోటూలందిన దొంగలున్నారో లేరో
గాంధి మహాత్ముండు కరుణించ నెంచా
మాపాపమాతని బంపెబందెకునూ
ప్రజలు బాధాలందు పాపంపు వేళ
ధర్మస్థాపన జేయా దేవుండులేడా
మాలాలా మొరవినీ లీలాగావగనూ
మక్కువమరి యొక్క సారిరావయ్యా

కంభంపాటి లక్ష్మినరసింహా సోమయాజులు
"స్వరాజ్య తత్త్వము"
1923

# హరిజనులు

("హరినామ స్మరణ చేయండి" - వలె)

పల్లవి : మాల మాదిగ వారమండి మమ్ము
చాలగ ప్రేమించి - పాలింపరండి
కూలి జేసెడి వారమండి - ఎండ
గాలివానలనకకే యే ప్రొద్దుసుండి ॥మాల॥

పాలు మానని వారమండి - ఎట్టి
పాలైన కోరకే పండింతుమండి ॥మాల॥

దిక్కుమాలిన వారమండి - మేము
పెక్కుబాధల పడి పొక్కితిమండి ॥మాల॥

కష్టించి పనిచేతుమండి మీతో
సృష్టి పుట్టినపుడె - పుట్టితిమండి ॥మాల॥

హీనపు మాలలనకండి - ఎల్ల
మానవులందొక - యాత్మె కదండీ ॥మాల॥

పశువులవలె జూడకండి - మమ్ము
విసిగించినకాని - కసిబూనమండి ॥మాల॥

గాంధి బోధల వినరండి - మాకు
బంధవిముక్తికి - బని బూనరండి ॥మాల॥

నెల్లూరి వెంకట రామానాయుడు
జాతీయ గీతాలు
1928

## మాల మాదిగల మొఱ

గాంధిమహాత్మ - గాంధిమహాత్మ!
కాచి రచ్చించు - గాంధిమహాత్మ!
సరకారవోరు - కరుకైనవారు
ఉప్పేరితేను - తప్పేసి నోరు
డబ్బుగలోరు - దరికి రానీరు
ఈ గోరమేమి - మా నేరమేమి
మాలమాదిగలం - మనుషులంగామా
కుక్కలకన్నా - తక్కువయ్యామా
మా మొఱాలించ - సామిరె దిక్కు
ఆసామివారి - అవుతారమైన
గాంధిమహాత్మ - గాంధిమహాత్మ
కాచి రచ్చించు - గాంధిమహాత్మ.

—బసవరాజు అప్పారావు

# గుడిలోని దైవమా

గుడిలోని దైవమా ఆలింపవోయి
గుడిలోని దయ్యమా పైకి రావోయి
నీపాద పూజకై వెదకి తెచ్చినపూలు
నీపాద సేవకై నింపి తెచ్చిన నీళ్ళు
పనికి రావంటారు మైల పడెనంటారు
మాల పెట్టిన నేల మాల ముట్టిన నీరు
మాల పాడిన పాట మాలలాడిన మాట
మైల పడెనంటారు పనికి రాదంటారు

—పురిపండా అప్పలస్వామి
విశాఖజిల్లా హరిజన సేవా సంఘం
ప్రచురించిన కరపత్రము
ఆంధ్రభూమి 1933 జూన్ సంచిక

## అంటరానితనము

(మేరే మౌల .... అను మాదిరి)

ఓహో హిందూ సోదరులార - ఇటు వినుడీ! ॥ఓహో॥

ఆరుకోట్ల హరిజనుల - ఆదరించీ బ్రోవుడీ। భారతావని పరమ కరుణ ప్ర - పంచమునకు జాటుడీ। మహాత్ముని మాటను, మది నిల్పుడీ - గాంధీ - మహాత్మ మాటను మది నిల్పుడీ. ॥ఓహో॥

నేను నీవను భేదభావము మేనులందే యున్నదీ। మేను నేననుమాట కడు అజ్ఞాన జన్యంబైనదీ। సర్వం బ్రహ్మమయంబను పల్కును గనుడీ!
॥ఓహో॥

రామరామ యనెడుదీనుల రట్టుజేయగ నేటికీ। రాముడే మును శబరి ఎంగిలి రమ్యముగ భుజియింపడా! రాము డందరిలో ప్రకాశింపడా ఆత్మా ॥రా॥
॥ఓహో॥

కాయకష్టముజేసీ మనల గాచుచుండే ధీరులు। పాదరక్షల నొసగి మనపై భక్తి నొసగేవారలు। ఇట్టి పుణ్యాత్ములూ హీనులైరా! అయ్యో!
॥ఓహో॥

దేవదర్శన మొసగుడీ మన బావులను నీరివ్వుడీ। సావకాశంబుగను బడిలో చదువుకొన రానివ్వుడీ। దోషంబునూ హతము జేయుడీ, అంటూ ॥దో॥
॥ఓహో॥

ముప్పదైదుకోట్లు గల్గిన ముద్దుబిడ్డల తల్లినీ। తప్పకను శ్రీ భరత మాతను ధన్యురాలిగజేయుడీ। భక్తుల విన్నప మాలింపుడీ - రామ ॥భక్తు॥
॥ఓహో॥

?
''జాతీయ గేయాలు''
ఆంధ్ర జాతీయ యువజన సంఘం
ఖమ్మంమెట్టు

## హరిజనులము

హరి జనులము మనము దుఃఖము లనుభవించ మికను
సరిసమముగ తక్కిన జాతులతో - సంస్తుతి నందుదము ॥హ॥

స్నానము లాడుదము దేహము - స్వచ్ఛము చేయుదము
మానక అలుకుదము ఇండ్లను - మడిగానుంచుదము ॥హ॥

మునివాకిళ్ళన్నీ తుడిచి - ముగ్గులు పలుపెట్టి
ఘనులందరు దర్శించుటకును ఆ - కర్షణ గూర్చుదము ॥హ॥

వెల్లలు వేయుదము - గోడలు - తెల్లగ జేయుదము
సొగసగు రంగులతో ద్వారములను - సింగారించెదము ॥హ॥

తెల్లటి బట్టలను దాలిచి - తేటగ తిరుగుదము
పిల్లలనందఱి బడులకుపంపి - విద్యలు నేర్పుదము ॥హ॥

సభలకు వెళ్లదము - పెక్కు సంగతు లెఱుగుదుము
విభవమునందే వృత్తులు పూని - విడువక చేయుదము ॥హ॥

భయమును మానుదము దేశ - భక్తిని పూనుదము
రయముగ మనమందరము తరించెడి - పనులను చేయుదము ॥హ॥

కల్లును విడుచుదము క్రూరపు - కర్మలు ముడుచుదము
ఎల్ల జీవములపై దయదాలిచి - యింపుగ బ్రోచుదము ॥హ॥

మూర్ఖాచారములన్ - మరియును మూఢ మతంబులన్
సమూలముగా విడనాడి జగత్ప్రభు - సంస్తుతిపాడుదము ॥హ॥

భజనలు సలుపుదము - పుణ్య వ్రతములు సలుపుదము
సుజనులతో కోవెలలో శివునకు - జోతలు పెట్టుదము ॥హ॥

గరిమెళ్ళ సత్యనారాయణ
'హరిజనుల పాటలు'
1933

# జ్ఞానోదయం

ఇన్నాళ్ళ మాలోళ్ళ మంటూ మీది మీది కెగిరిపడకుండయ్య మీరు
కన్నతండ్రి గాంధి కళ్ళు విప్పేశాడు కనుక్కోండి మీరు మే మొకటే ॥ఇ॥

చెరువుల్లో నూతుల్లో బాటల్లో సత్రాల్లో - స్వేచ్ఛగా తిరుగుతామండి
మమ్మర మరపెట్టకండి అందరిలాగే ఆదరముతోడ మాటాడరండి ॥ఇ॥

రెయిలూ బస్సూ పడవా - రేయీ పగటిబడులు - రొక్కమిచ్చిన
వారివల్లా
ఇంక హొయలు చూపి మమ్ము - ఎత్తిగిల మనకుండా - ఒప్పుగానే
కలసుకోండి ॥ఇ॥

చింకిపాతలవారు చీడ వాళ్ళువారు - తెలివి తక్కువ వారలంటూ
మమ్ముకింక పెట్టకండి - కించిత్తు దబ్బుంటే-ఇంకిపోతా యివ్వియెల్ల ॥ఇ॥

చేసిన కష్టముకు వాసిగాకూలిచ్చి - చిరపుణ్యమును కట్టుకోండి
మా మాసిన బ్రతుకెల్ల మరియాదలకు వచ్చి - మహిమ గూర్చును
మీకుకూడ ॥ఇ॥

పదిమందిలోనికి రానీకుంటే మాకు - పడివచ్చునా, మీదు తీరు?
త్రుళ్ళ గదిమిత్రోయుట మంచి మర్యాదస్థులకును - ఘనకీర్తి
యా చెపుడుమీరు ॥ఇ॥

భక్తులుచూస్తే గుళ్ళు మయిలపడతాయనుట - పరమ సిద్ధాంతమటండి?
ఇట్టియుక్తులు పట్టి పెద్ద ఉరిత్రాళ్ళు కట్టి మా-ఉసురెల్ల పోసుకోకండి ॥ఇ॥

జాతీయ జీవతరంగిణి పారెడి-జాలైనజూచి పొంగండి
వట్టి వ్రత ప్రతిష్టల పట్టి ప్రేలాడక - పాతకవితతి చెండండి ॥ఇ॥

హిందూ జాతి సన్నగిల్లి పోవుటమమ్ము - ఈసడించుట చేతనుండి
సందేహములుమాని సర్వసమతగొని సౌఖ్యపదమును బట్టుకోండి ॥ఇ॥

మన జాతి కికమీద మంచి దినంబులు మగిడివచ్చుట నిశ్చయంబు
ఘనులెల్లరును మాదు మనికి గూర్చి యిట్లు - కష్టపడిన కారణంబు ॥ఇ॥

గరిమెళ్ళ సత్యనారాయణ

"హరిజనుల పాటలు"

1933

# నూతన తేజము

సందు విడచిరార తమ్ముడా - పెద్ద సభ జరుగుతున్నాది తమ్ముడా
ఇండియా దేశమట - ఎల్లారునొకటంట
ముందర బడులంట - ముచ్చట చదువులంట
అందము గుండాలంట - ఆరోగ్య విధులంట
పొందుగ జీవనమంట - పురిషిట్లో ధనమంట
ప్రతి వాడికోటంట - ప్రతినిధి పంపాలంట
ఇది యేటో మనకి మే - లెగిరేలాగున్నాది ॥సందు॥
హరిజనులమట మనము - అయిదు కోట్లమంట
హిందూ సంఘముయొక్క - ఇంపైన కొమ్మంట
విడతీయుటకు సుంత - వీలేలేదెనంట
విడతీస్తే గాంధీ ఉసు - రిడుసుకుంటాడంట
సీమ దొరతనమారే - శిరసు వంచేరంట
ఏమూల మనగొడవ - లే సెప్పుకుంటారు ॥సందు॥
పంచా సొక్కా తొడిగి - పైమీద తుండేసి
పట్టెనామాలెట్టి - బొట్టు సక్కగదిద్ది
పదిమందిమీ కలిసి - పడతులతోను మెలసి
బహిరంగ సభల్లో - బాగుగ కూరుచొని
చెప్పిన దల్లా విని - చిత్తము కెక్కించుకొని
ఒప్పుగ చెయ్యెత్తి - ఓటియ్యవాలంట ॥సందు॥
ఆడోరు మగవారు - అదియేటీ లెచ్చెర్లు
గ్రుక్క విడువకుండ కురిపించేస్తున్నారు!
చెవిటోళ్ళకైనాను - తెలిసిపోతున్నాయి
ఇన్నాళ్ళు మనవెల్ల - ఈసడించారంట
ఇప్పటి నుంచి ముందు- కెత్త సంసిద్ధులట
తప్పకుండా మనము - ధన్యులమైనాము ॥సందు॥
రాముడి పటముపట్టి - రండోయి పాడుదము
ఆ మూల ఈ మూల - అంతట తిరుగాడుదము
మామూలాచారములు - మంటల్లో కలుపుదము
సోమరితనము కల్లు - చొరనీక గెంటుదము
దేముడి గుడి తలుపులను - తెరవుమని వేడుదము
సామికి పత్రం పుష్పం - సమర్పణ చేయుదము ॥సందు॥

**గరిమెళ్ళ సత్యనారాయణ**
హరిజనుల పాటలు 1933

# హిందూ సంఘీయులము

హిందూ సంఘమురా మనది - ఎవ్వడు కాదనురా
సందేహించినవాడే వేఱొక - సంఘంబై చెడురా ॥హిందూ॥

రామచరితం మనది - దాని - రచయిత మనవాడు
భారతము మనది - ధర్మ - వ్యాధుడు మనవాడు ॥హిందూ॥

భాగవతము మనది - అందలి - చెంచిత మనమనపడుచు
ఏగొడవను గాంచిన మనమట కనిపించనిదేలేదు ॥హిందూ॥

వల్లి మనపిల్ల - మనకు - అల్లుడు మురుగయ్య
ఎల్లెండలను మన చుట్టాలేసుమి - హిందూదేశములో ॥హిందూ॥

వేదంబులు మనవి - అందలి - వివరంబులు మనవి
బహు దేవళముల పంచమ భక్తుల - ప్రతిమలు లే వొక్కో? ॥హిందూ॥

మన పెద్దలు కూడా ధర్మ - మార్గము తెలిపేరు
భక్తిని కలిపేరు - ఈశ్వర - శక్తిని చూచేరు ॥హిందూ॥

ఎల్లరి హితమునకై - జీవన - మెటులో గడచుటకై
ఏవృత్తిని సక్రమముగ జేసిన - నెసగెడి తప్పేమి? ॥హిందూ॥

అంతమాత్రమునకే మనలను అంటుట తప్పంటే
పాపపు జన్మంటే వారికి పుణ్యమె తక్కువగున్ ॥హిందూ॥

ఎప్పటి మాటలనో మాపై - త్రిప్పి విసరకండి
ఇప్పటినుండి సమముగ మనుతెర - వేదో వెదకండి ॥హిందూ॥

కలసి మెలసినపుడే సౌఖ్యము - కలుగును నందరకు
విడబాటున దుఃఖం బెప్పుడును - నుడుగదు ఇరువురకు ॥హిందూ॥

నిట్టలు పడగొట్టి - గృహమును నిలబెట్టుకొనంగా
ఎట్టుల సాధ్యంబో మదినూ - హించుకొంటేమి? ॥హిందూ॥

గరిమెళ్ళ సత్యనారాయణ
హరిజనుల పాటలు

# అస్పృశ్యతా సిద్ధాంత నిరసనము

అంటరానివాడని న-న్నంటే ఇక ఒప్పుకోను
ఒంటరి! నీ కిష్టము - లేకుంటే అటు తొలగిపొమ్మి ॥అం॥

నీ గుమ్మము కడకేగి - నిను తాకగ మనసులేదు
ఏ తాకుడువల్లనే-నేమో ఘనతందబోను ॥అం॥

నీవే ఘనజాతివని - నేనేమో నీచునని
లోనదలచినచో నీ లోనే విషరణమౌసుమి ॥అం॥

నీవలె పుణ్యుల కడుపున - నేమాత్రము పుట్టలేదా!
జీవనమును సక్రమముగ - జేయగలేదో చెప్పుము ॥అం॥

సిరియును నుద్యోగమునా? - చేకూరవచ్చును మానును
గరువంబున మత్తిల్లుట - కా? రెండును సద్వరములు ॥అం॥

నీవలె కష్టముపడియా - ర్జించి పన్ను చెల్లింతును
ఈ విశాలభూమిని నీ - వెంతో నే నంతేసుమి ॥అం॥

నన్ను తొలగమని నీవును - నిన్ను తొలగమని నేనును
ఎన్నడు కసరగరాదు - ఇదియేమన నిర్ణయము ॥అం॥

నా సౌఖ్యము కొరకీవును - నీ సౌఖ్యము కొరకేనును
వాసిగబహు కష్టంబులు - పడవలెననుటయె ధర్మము ॥అం॥

వసుధను సజ్జనులకు స-ర్వమును నొక కుటుంబమెయగు
విసుగొందడు పరజనహిత - వృత్తి వ్రతుడెన్నండును ॥అం॥

జగమంతయు నుండగనీ - సర్వాసహ్యముమాపయి
భగభగ మనపించుటయది - పరువోవుచువో చెప్పుమ ॥అం॥

వేదాదుల యర్థమును వి - వేకముతో గ్రహియింపుము
లేదా వాటి ప్రసంగము - లే, యిక నెత్తగబోకుము ॥అం॥

గరిమెళ్ళ సత్యనారాయణ
హరిజనుల పాటలు
1923

## 8. ఎటువంటి మాలలము!

మాలలము వనమాలి శిరంబున గ్రాలెడి తులసీ మాలలము
మాలలము త్రిశూలిగళంబున వ్రేలెడి కపాల మాలలము
సుశీలురము జగతీతలమంతను శుభ్రము చేసెడి యేలులము
లయకారులము అఘకానన సంతతిఁ గాల్చెడి జ్వాలాకారులము ॥మా॥
హిందూ ధర్మ వ్యవస్థను మాకొక ఇంపగు స్థానంబున్నయది
మందులమై మనకుండా దానిని మాన్యముగా నెరవేర్చితిమి
అందరివలె చరియింపగనీయక అడ్డము వచ్చెడి వారెల్లా
చిందర వందర యౌదుర ధర్మ చ్ఛేదక నూతన యత్నములో ॥మా॥

జపములు సేయుడు తపములు సల్పుడు జన్నిదములు వడకం
దెవుడున్
నిపుణతతోడుతో మోక్షము వైపుకు త్రిప్పుడు జగతిని వీలైనన్
చపలత సంస్కృతి పథమున జాఱు చచ్చుచు పుట్టుచు నిలుగుచున్
కపటముగా మాపై పడబోయిన కలుషముగా మదిఁదలచరుకో? ॥మా॥

బ్రాహ్మణుల పదిరూకల కోసము సామర సేవలు సేయుదురు
క్షత్రియులా సలాములు చేసి గులాములరై వెలుగొందుదురు
వైశ్యులు రుసుములకై జనసంఘపు వైభవమెల్లయు తుడిచెదరు
ఎల్లరు నిష్టము వచ్చిన యట్టుల నే జీవములో దొరలెదరు
వర్ణమదెక్కడ ఆశ్రయమెక్కడ పంటను తింటను అంటుటను
మెడగంటులలో నెడ సేతలె జాతికి మేలగు ధర్మపు మూలములా ॥మా॥

ఇది వర్ణాశ్రమ ధర్మంబేమిటి? మదినమ్మెడి మూఢుండెవడు?
ఎదొ సమయానుగతంబగు పథమున నేగుచునుంటిమివ న్రములమై
మదినిక నిక్కులదేటికొ తెల్పుడు మహిమాఢ్యులమని అల్పులని
విదితముగ నెల్లర మొకటే లౌకిక విద్యలలో తేరినచో
బడులును కొలువులు పదవులు సభలును బహు వృత్తులును తెరచు
కొనెన్
గడియలు మూసిదాచతరంబెజ గన్నాథుని ఈ జగమునకున్ ॥మా॥

శుద్ధంబగు వర్ణాశ్రమ ధర్మము శోభిలచేయుదు రేయేనిఁ
నిషిద్ధంబందు అస్పృశ్యంబను నొక నీచపు వర్ణము నిశ్చయము
అబద్ధంబగు జాత్యభిమానము వర్ణాశ్రమ మనిభ్రమ మందకుడి
బుద్ధిగిలారలె పెద్దలు ఇతరులు బుద్ధిగరచి పెద్దయ్యేదరు
విద్దెను బాగుగ నేర్చెదము విత్తంబును చేకూర్చెదము
పొదును చెఱచి అందఱితోను హాయిగ సుండెదము ॥మా॥

కలియుగమందున బలమెల్లయు సంఘముచేయని శాస్త్రము చాటుఁ
అధునాతనమున అధికారము సామాన్యులదందురు పాశ్చాత్యుల్
అయిదుకోట్ల జనమును నేకంబయి నప్పుడు చేయగలమెద్దిన్
ఖయిదీలవలెం జరియింపము మఱి ఖామందులమే అయ్యేదము ॥మా॥

బడులు మావియని బాటలుమావని
సభలు మావి సత్రములు మావియని
దేవాలయములు తెరవులు మావని
ఆచారము వ్యవహారము మావని
దొరతనమును పెను పదవులు మావని
అరచి చరచి గ్రహియించక పోదుమె ॥మా॥

కాడుకాచిన హరిశ్చంద్రునకు కట్టుదు మొక్క దేవళము
వ్రేలు నిచ్చిని యేకలవ్యునకు వేడుక చేతుము ఉత్సవముల్
అద్భుత దివ్యత్వము గణియించిన అరుంధతికిని పెను జాతరలు
నందనారు పెనుపండుగలోపల వందలకొలది నాట్యములు ॥మా॥

ముందర చూచిన వెనుకను చూచిన
విందులు చూచిన వింతలు చూచిన
సందులు చూచిన సంతలు చూచిన
పొందులు చూచిన పొరుగులు చూచిన
అందఱి లోపల నందఱమై, పెను
సందడిలోపల సందడియై
ముందుకు దేశం బంతతో పోదుము
ముహ్యము చేతుము - లోకంబంతను ॥మా॥

సందేహించకయునులేదు చక్కనిదీ హిందూమతము
మందముగా వ్యతిరేకముగా పెను సందడి కొంతచేసినను
ముందర దృష్టిని కలిగి మార్పుకు పొందుగనౌ దలవంచెదును
గందరగోళములన్ని కూడా క్రమముగ ననియే సరిపడును

వందలకొలదీ రారోతమ్ములు
సందడిమీర గెంతుదము
బంధములన్నీ తెంచుకొని యొక
పందెముగా పరు గెత్తెదము
భారతమాత కొలువును చేసి
పావన జన్మల మయ్యెదము
మానవ జాతిని శుద్ధము చేసి
మంగళ గీతము పాడుదము

గరిమెళ్ళ సత్యనారాయణ
'హరిజనుల పాటలు'
1933

## దరిద్రనారాయణీయము

రామ రామ రామాభిరామా శ్రీరామా
లోకనాయకా పావననామా లోకైక రామా
జయము జయము శ్రీ గాంధిమహాత్ముని జయము దిగ్విజయము
జయము జయము మాభారతజాతికి జయము దిగ్విజయము
పంచముడని మనసాటి మానవుని, బహిష్కరించెదరా
పంచమ సహకారము లేనిచో, బ్రతుకు గడుపగలరా
కొట్టిన తిట్టిన మనసేమంటే కోరును పంచముడండి
యెట్టులైన మనమేలు కోరి, తా, నిబ్బందులు పడునండి
ఊరికి వెలుపల పూరికొంపలోనుండును కాపురమండి
దారిద్ర్యమునకు ముద్దు బిడ్డడై, తంటాల్పడతాడండి
నూతినీరు తోడకూడదంటే, నోరు విప్పబోడండి
జాతిభేదమెంచి తొలగుమంటే, సర్దుకుపోతాడండి

గుడిలోనికి రావలదనియంటే, గుడిదరికే రాకండి
బడిలోనికి రానీమనియంటే, భయపడిపోతాడండి
వద్దనియంటే యేపనినైనా వదలివేసుతాడండి
కొద్దివాడనని యనుకుంటూ, మనగొప్ప యెన్నుతాడండి
పుట్టుట మొదలు గిట్టేవరకూ, పూర్తిగ తోడగునండి
వట్టి నిందలకు శిరమునొగ్గి మన, వాంఛ తెలిసికొనునండి
యిట్టి పంచముని యెడల పెద్దలకు, నెట్టి ప్రేమమో కనుడు
ఉట్టిగట్టుకొని ఊగేటట్టులు, తిట్టుటమేలా వినుడు
పంచమదర్శనమైతే ఒక్కడు, పళ్ళుకొరకుతాడండి
పంచమస్పర్శకు పాము కరచినటు, బాధనొక పడునండి
ఇతర దేశముల కేగిన తెలియును, ఎవరో పంచములంటే
మతమునకింతటి విపత్తు దెచ్చిన, మనమే పంచములంటే
ఒక తెగవారిని త్రొక్కివేసి మన, ముచ్చస్థితి కనగలమా?
అకటా యీ దోష మెగాదా మన, కంటిన దనుకోగలమా?
కూలికి వచ్చెడివాడు పంచముడు, మేలునుకోరెడివాడు పంచముడు
జాటను కాచేవాడు పంచముడు, కాటనుగాల్చెడివాడు పంచముడు
అట్టివాని నాదరించకుండా, అవల గెంటుతావా
ఇట్టి నిన్ను భగవంతుడేమనునొ యెంచుకొనగలేవా ॥రామరామ॥

గాంధి మహాత్ముని యుపవాసమునకు, కారణమేమో కనుడు
సంధియముల విడనాడు దేకమై, సాటి నరుడు పంచముడు
బావినీరు పంచముడు త్రాగితే, బావియెపాడౌతుందా?
బావిలోనపడు పక్షుల రెట్టకు, బావిబాగుపడుతుందా?
దేవుని గుడికై పంచముడొస్తే, దేవుడు పాడౌతాడా?
నీవు నేననే భేదమునీకా? దేవునికుందంటావా?
ఆచారము, సాంప్రదాయమనుచును, హడలిపోకురా బాబూ!
ఆచారముపాడని తోచినచో, అతిక్రమించరా బాబూ!
సాంప్రదాయమని యంటే చెడుపని, సాంప్రదాయమేయౌనా?
సాంప్రదాయకులకే మనసుంటే, సాటిమనుజుడిట్లౌనా?

శంకరాచార్యు లద్వైతమత, స్థాపనచేస్తూఉంటే
శంకరుడే పంచముడై యడ్డుగ, శంకలేక నిలుచుంటే
తప్పుకుపోయిన ఆచార్యునిగని, తప్పుబట్టగాలేదా?
తప్పుతెలిసి శంకరాచార్యుడా, తప్పు దిద్దుకోలేదా
శ్రీమద్రామానుజులాళ్వారుగ, జేయలేదె పంచముని
శ్రీమానులు తిరుపాణాళ్వారుని, జేరి మ్రొక్క రాఘవుని॥
మతప్రవక్తకు బ్రాహ్మణపంచమ, మర్యాదలతోనేలా?
మతము సకలసమ్మతము కానిచో, మనుజులకా మతమేలా?
అంటరానివాడని యొకమనుజుని గెంటివేయునా మతము?
పంచమ దుర్గతి కంతకుమనమే, పట్టనైన కారణము
పంచమ సద్గతికై పనిచేయు ముపేక్షించుట దారుణము
భరతదేశమంతయు మేల్కొనినది, పంచమ గానమువినుము
భరతమహాఋషిపూనా ఖైదున పాడుచుండెరా కనుము
పరమ పదవు సోపానమైనయీ, భరతజాతి పడినావు
పరమపవిత్రపు హిందూమతముకు, వరపుత్రుడ వైనావు
సాటి మానవుని పంచముడనుచును, సందేహించుట తప్పు
వర్ణ భేదముల మరచి ప్రజల నీ వంకకుఁరమ్మనిచెప్పు
చాటినట్టులిది గ్రామపట్టణపు, జనపదంబులనుచెప్పు
స్వర్ణయుగము రానున్నది దానికి, సర్వసమత్వమేయొప్పు
జయము జయము శ్రీ గాంధిమహాత్ముని జయము దిగ్విజయము
జయము జయము మా భారతజాతికి జయము దిగ్విజయము

(సంకలితము)
కోడేటి రంగాచార్యులు
జాతీయ గీతాలు

# సవర్ణ గర్విష్ఠి

నా యభాగ్య దేశంపు సంతానమైన
ఓ! సవర్ణ గర్విష్ఠి! పేరాస వీడి
దులిపి వేయుము నీ గొప్పకులపు నీటు
ఎవరిపైన నిందా తిరస్కృతుల పేర
బెఱగుచుంటివో ఆ నిప్పుకరడు లెల్ల
కుప్పలై వచ్చి నీ తల కూలునోయి!
మానవుడనంచు తలయెత్తి మనలకుండ
పొదిగితివి గాదె కడజాతి బండకొయ్య!
నీచపుంగతి కన్నుల చూచిగూడ
మనసు కరుగని పెడసరితనపువాడి
తీర దొకనాడు యీ యప్రతిష్ఠకీవు
అన్నిటను వానికి సమానమగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

అన్ని విధముల నీకు తోడైన వాని
తాకకమటంచు వెంటాడి తరిమినావు
సృష్టికర్తనే తుద కీసడించినావు
అది సహింపక ప్రభువు శాపానలమయి
కాని కాలాన డొక్కల కఱవు వచ్చి
తూలిపడి.... వాని పంచ గల్లాలొ నీళ్ళు
త్రాగెదవొ యేమొ దప్పిక కాగలేక
తీర దొకనాడు యీ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్ప దీమాట గుండెలో దాచుమన్న॥

కలబలంబెల్ల నొక్కచో కదియ దీసి
కర్కశంబగు నీ పాద ఘట్టనముల
తమ్ము దనకుండ పైబడి తన్నినావు

వాని లజ్జాకరంబైన బ్రతుకు వోలె
అంత దుర్దశపాలు గానంత వరకు
లేదు నీకిక రక్షణే లేదు నిజము
తీరదొకనాడు యీ యప్రతిష్ఠనీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

నీ యభాగ్య దేశంపు సంతానమైన
ఓ సవర్ణ గర్విష్ఠి ఏ యూహ తోడ
ఇంత సంతోషముగను బ్రుళ్ళింత పడుచు
ఎవని నీ కాళ్ళతో మట్టగించుచుంటి
నతడె తన నల్లునిగ జేసినట్టి చోటి
కచటికే లాగి పదద్రోయునయ్య నిన్ను
కోరి యజ్ఞాన గాఢాంధకుహరమందు
యెవని బలవంతముగను ద్రోయించినావో
అదియె యజ్ఞాన మవధులనంటి వెడలి
అనుకొనని యంతులేని బ్రహ్మాండమైన
కారు చీకట్ల, నెందును దారి లేక
బాగుపడకుండ నీ కడ్డుపడిన దోయి,
తీరదొకనాడు ఈ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదునన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

కులము గొప్పకు నింత సిగ్గును త్యజించి
ప్రభువు బిడ్డలకే తలవంపు దెచ్చి
యెన్ని యుగములు నిట్లు వేధించినావు
వానితో స్వామి నెలకొన్న వాడటంచు
యిప్పటికినైన సాష్టాంగ మేలపడవు?

గొంతులను గోయు నీ కులగోత్రధాటి
కా దరిద్ర నారాయణో యనాథ
నాథుడే ధూళి గరచి సంతాప పడుచు
ఎట్లు పొరలాడుచుండె వీక్షింపు మింక
తీరదొకనాడు యీ యప్రతిష్ఠ నీవు
అన్నిటను వానికి సమాన వగుదువన్న
తప్పదీమాట గుండెలో దాచుమన్న॥

నా యభాగ్యదేశంపు సంతానమైన
ఓ సవర్ణ గర్విష్ఠి! ఇంకొక్క మాట
తేరి చూతురె నా బలాదూరు వీర
లన్న నేరాలనే పట్టుచున్న వాడు
కలడు యమకింకరుడు నీ తలుపుముందె
కలత పెట్టె నా పాపిష్ఠికులముగాదె?
ఇప్పుడైన గ్రహించి ప్రేమింపవేని
తగవు పొమ్మావలకు పొమ్ము తగవు నీవు
పై బటారపు గర్వగంబళపు చింకె
నీవె నిన్ను చుట్టుకొని బంధించుకొనుము
చచ్చి కాటికి పోయి తక్షణమునందె
నీవు బూడిదయగునాడు నిక్కువముగ
అన్నిటను వానికి సమానమగునపుడె
తప్ప దీ మాట గుండెలో దాచుమన్న॥

తెలికచెర్ల / తుమ్మలకూరు? 

**తీటుకూరు సత్యనారాయణరావు**
జాతీయ గీతాలు

జయ్ ఆదిహిందూమాతకు జయ్.

## అంటరానివారెవరు?

(బొబ్బిలి పాట వరుస)

రామరామ శ్రీరామారామ రామారఘు రామ
ఆలసింపక మేలుకొనండి ఆంధ్రులు మీరైతె
బానిసలై యీదేశములోన బ్రతికెద రెన్నాళ్ళు
పరాపాలనాచే యీప్రజలు పాడైయున్నారు
పాలకదలివంటీ రాజ్యము బానిసయైనాది
పరువులేద పౌరుషములేద ఓభారతీయులార
పాడిపంటలకు ప్రసిద్ధిజెందిన భరతదేశమండి
కలిమిచేత యీదేశమెల్ల ప్రఖ్యాతిగాంచెనండి
తల్లిదేశమున తరగనిపంట తక్కువలేదండి
కుడువకూటికి కట్టగుడ్డకు కొదవేలేదండి
పండినపంటలు పరదేశానికి పంపుచునున్నారా
పరదేశములో ప్రజలందరినీ పెంచుచునున్నారా
పూర్వకాలమున జనులకు ధాన్యము పుట్లకొలదియుండె
ధాన్యాదుల కిపుడెక్కడజూచిన ధరలు హెచ్చెనయ్యో
యిప్పుడు రాజ్యములోపల మీరు యెక్కడజూడండి
కరువుకాటకములెల్ల ప్రజలను కష్టపెట్టుచుండె
విదేశవస్త్రము మానుటకన్న వేరువిధములేదు
క్రోట్లకొలది ధనమిచ్చినగుడ్డకు కూలిపోతమండి
స్వరాజ్యసాధన చేయండయ్య సమయము వచ్చింది
ఖద్దరుకట్టినగానిజనులకు కరువుతీరిపోదు
దీనులవంక చూచుచున్నది దేశమాతనుండి
అంటుదోషమువల్ల అడలెడు అధికారతండి

## ప్రస్తుత మాలమాదిగెల స్థితి

మనదేశస్థులు మాలమాదిగల మరచిపోయినారా
అయ్యయ్యో యిది ఘోరముకాదా అన్యాయముకాదా
ఏడు కోట్ల మా మాలలదండు ఏమైపోయాము
కొంచమైన మీరాలోచించరు మంచితనముతోను
కూడగుడ్డలేకను మాలలెల్ల కూలుచునున్నారె
అన్నమో రామచంద్రాయంచు అడలుచునున్నారె
మా మొఱ్ఱల నాలించెడివారు మాయమైనారె
మనుష్యులమన్న సంగతి కూడా మరచిపోయినారె
దానధర్మములు దేశములోన ధ్వంసంబైనాయి
స్వార్థపరత్వము జగతిలోపల స్థావరమైనాది
జాతిభేదములబెట్టి మమ్ముల జంపుచునున్నారె
ఏశాస్త్రములో పంచములంటూ యేర్పడియున్నాది?
కుక్కలకన్న తక్కువంచు మమువెక్కిరించుతారె
చక్కనిపంటలు పండిస్తేను చల్లగ తింటారె
వీటినన్నిటిని ముట్టినవారికి వెగటేలేదండి
మమ్ములముట్టగ మాత్రమువారికి వెగటుపుట్టునండి
మాలవాడలకు వచ్చి మాతోడ మాటలాడుతారు
మీయిళ్ళకు మేమొస్తామంటె మిక్కిలిచేస్తారు
నలువురు నడిచే దారిని మమ్ములడదువ నీయరండి
మేము చేసిన పాపమేమిటొ మాకు చెప్పరండి
మనువు చెప్పిన గ్రంథములోను మాలే లేదండి
అంటరానివాళ్ళంటే మమ్ముల అన్యాయముసుండి
కుష్టురోగులకు మాత్రమే ముందుకులము లేదటండి
అంటరాదని అందురు వారిని అందుకుసుమ్మండి
ఆర్యులకంటే ముందటివారు అనార్యులేనండి
చరిత్రలెల్ల చెప్పుచున్నవి చక్కగ వినరండి
పూర్వము రాజ్యాలేలిన వీరపురుషులు మావారు
దండిగ సైన్యము గూర్చుక ఆర్యులు దాడిసల్పిరండి
దాడిసల్పుకొని రాజ్యంబంత దండుకపోయేరు

మా రాజ్యముదీసుక మమ్ములను మలలకు దరిమేరు
తిరిగివచ్చి సేవించినవారిని తిట్టికొట్టినారు
గుడ్డితనములో మెల్లకన్నులు కుదిరినవన్నట్లు
కొట్టినగాని తిట్టినగాని కూరిమిచేసేరు
వృత్తులు కొన్ని కల్పనజేసి వొప్పగించినారు
సేవకులంచును పేర్లనుబెట్టి సాగదీసినారు
వర్ణభేదములు పెట్టిమమ్ముల వంచివేసినారు
బానిసవృత్తులచేత మమ్ముల బాధలు పెట్టేరు
వృత్తి భేదముల పెట్టిమమ్ముల వేరుపర్చినారు
కళ్లతొ చూసినపాపంబంచు కఠినముజూపేరు
ఊరికామడ దూరములోన వుంచగనెంచేరు
మాటలాడిన పాపంబంచు మానివేసినారు
అడుగుజాడలే త్రొక్కినవారికి అంటేఅన్నారు
అంటరాదని ముట్టరాదని అన్నారండయ్యా
ఆర్యులయటే అప్పటినుండి అడుగునబడ్డాము
అంటరానివారనెడి పేరునే అప్పుడె పెట్టేరు
చెప్పరాని చెండాలురుమీరని చెప్పినారుమాకు.

## పూర్వోన్నతస్థితి

ఆదినిమాగతి యెట్టులుండెనో ఆలోచించేరా
ఆర్యులకెల్ల అండగనుండిరి ఆదిమాంధ్రులండి
హిందూశాస్త్రములన్ని పైకియికనైననుతీసి
పఠించుడీ ఓమాన్యులారా యోపరమభక్తులార
పురాణాలలోనుండే వీరపురుషులుమావారు
అగ్రజాతులు వీరికియింకా మ్రొక్కుచునున్నారు
వశిష్టవాల్మీకాదికవులు మావంశమువారండి
వేదవ్యాసుడు పరాశరుడు మావారేసుమ్మండి
హనుమంతా సుగ్రీవులు మాకు అన్నదమ్ములండి
అంగదవాలికన్నమనీడు అనీవీరులండి
రోహిదాసుడు చోకామేళుడు తిరుప్పణాళ్వారు

కనకదివాకర నందుడు గుహుడు కలిగిరిమాలోన
అనేకమందిభక్తులుమాలో అవతరించి నారె
అందరుమాలో గతించినారని అడుగునబెట్టినా?
వీరమాతలు యెందరో మాలో ఉద్భవించలేదా
వానికెక్కి పాతివ్రత్యము పాటించగలేదా
అరుంధతి మాకులమునకెల్ల ఆడపడుచుకాదా
శబరికన్యమాతంగులు వినుడీ మాకులస్త్రీలండి
ఆదిమురళిహేలావతిరేణుక అంజనగోసంగి
జరమాలెత సారంగి కర్కటక జాబాలిదేవి
ఇట్టివీరమాతలు మాలోన యెక్కువగానుంట
ఆదిపురాణముతీస్తేమీకు అంతావిశదంబు

## విచారణ

ఇట్టిమహామహులు పుట్టినజాతిని యెడగలుంచెనారె
కడుహీనులుగాజేసి మమ్ముల కడనుబెట్టినారె
చేసినపాపంబేమిటోమాకు చెప్పండికనైన
అంటరాని తనమెట్లువచ్చెనో ఆలకించుతాము
మేముచేసిన అపకారంబు మాకుదెల్పుడయ్య
మేముచేసిన నేరంబేమొ మాకుదెల్పుడయ్య
మేము చేసిన అన్యాయంబు మాకు దెల్పుడయ్య
జంతుజాలముల కెంతో సుఖము జగతిలో గలదయ్య
అంతకంటెను అధముల రీతిగ అడుగున నుంచేరు
పంచములంచు ఎంచుట మీకు పాడిగాదు సుండి
ధర్మరాజ్యమును పాడుజేసుకొని దాసులుగా కండి
సోదరత్వము జూపుటలోనె సుఖమున్నాదండి
బానిసకూటికి యెన్నాళ్ళిక బాధలుపడుటండి
దానధర్మములు జంపినారయా దీనదయాపరులు
దాస్యపుకూటికి లోబడిపోయిరి దానధర్మపరులు
మాలల సేవను మరచినారయా మానవులే జూడ
మాటిమాటికి తిట్టుట కొట్టుట మర్యాదగునయ్య

అవసరముంటే అంటుకొందురా అందరు మమ్ములను
కల్ల ప్రేమను జూపి మమ్ముల కౌగిలింతురయ్యా
ఏడాది మా సేవను పొంది యెడగలుంతురయ్యా
కూడూ గుడ్డా లేక మమ్ముల కూల్చుచుందురయ్యా
కొంపలపైన అప్పులు పెంచి కోర్టుకు లాగుదురు
కడకు కొంపలేకుండగ మమ్ము కడనేబెట్టిరు
గదుమక భూములు దీసుకొన్నపుడు కన్పడదే అంటు
పదిలముగా మా ధన మొసంగినను, పాటించరె అంటు
ఏనా దెరుకలకన మమ్ముల యెడగలుంచుతారు
నోటికిరాని బూతులతో మమ్మేటికి తిట్టెరు
పందుల నరికెడు యెరుకలకన్న పాపాత్ములమయ్యా
గొడ్లను గోసి చంపుకతినెడు కటికివారమయ్యా
చెంచులంబడికన్న మమ్ముల కించపరచినారు
కుష్టురోగులకన్న మమ్ముల కూళల మన్నారు
నోరుగల్గినవారికి మంచిదారి జూపుతారె
నోరులేని మావారికి అడవిదారి జూపినారె
మమ్మిటుజేయ మాకర్మంబా మాకు తెలియదయ్యా
ఇతర జాతిలో యిట్టి భేదములు ఎందునలేవయ్యా
ఎల్లపనిముట్లవలె మమ్ములను యెంచుకొందురయ్యా
ఏమీ పనిలేనప్పుడు మమ్ముల యెడగలుంతురయ్యా
ధాన్యపురాసులు దంపుటలోను దప్పులేదటయ్యా
కాటికి యింటికి కావలియున్న కాన్పడదే యంటు
కాయకూరలు తెచ్చియిచ్చిన కావాలంటారు
పాలను పండ్లను ప్రేమతొ నివ్వగ పట్టుకుపోతారు
ఉప్పు నిప్పును ముట్టగ మమ్ము తప్పనియెంచెరు
నీటికి గాలికి అంటేయంచు నీల్గుచునుండేరు
వంటకు పంటికి చెఱకుల నివ్వగ వప్పుకొందురయ్యా
వాదభేదములు బెట్టి మమ్ముల వంచనజేసేరు
వీధులందు నడువంగ మాకును వీలేలేదంద్రు
ధర్మమార్గమున బోయిన మాకు దారేలేదంద్రు

తలనుదాచగ చోటొక్కింత దాపరించదయ్యా
ధర్మంబాయిటు జేయుట మీకు ధర్మంబగునండి?
మేము మీవలె పుట్టినారము మనుజులమేనండి
మీకూ మాకూ ఒకడే దేవుడు మార్గమిచ్చునండి
దూర దూరమున దరుమగమీకు ధర్మంబేదయ్యా
నిఖిలమీశ్వర మహిమచేతనే నిండియున్నదయ్యా
నీదీనాదను వాదభేదములు నింక వీడుడయ్యా
మీ తల్లికి మీరెట్లు పుట్టిరో మేము అట్లైనయ్యా
ఉభయులము ఒక ప్రేమ తల్లికే ఉద్భవించినాము
మీ కున్నట్టి ఆచారములే మాకు ఉన్నవండి
మీరు చేసిన పూజలు గూడా మేము చేతుమండి
మీరు చేసిన స్నానపానములు మేము చేతుమండి
మూటలుమోసి బ్రతికెదమన్న ముట్టనీయరండి
వస్తువులమ్మి బ్రతికెధమన్న వల్లపడదు సుమండి
విద్యనునేర్చి బతికెదమన్న వీలే లేదంద్రు
మతము విడిచిపోతామంటే మండిపడతారు
సాలికాపుగనుండుట కెంతో పంతము బూనేరు
దాహముచే చలివేంద్రకుపోయిన తాకనీయరండి
పడవలయందుగూడను సరిగా వెడలనీయరండి॥
నీళ్ళ రేవులయందు మమ్ముల నిలువనీయరండి
రైళ్ళలోను రహదారులలోనూ వెళ్ళనీయరండి
ఋషులసంతతి వారముమేమని రుజువులు చేస్తారు
సోదరులనుచు పైకిమాత్రమే చెప్పకపోతారు
గాంధిమహాత్ముని బోధలన్నియు ఘనముగ వింటారు
ఆచరించరు ఒకరుగూడా అన్యాయము కాదా?
మహాత్మగాంధిమాటలు మీరు మరచిపోతరండి
అంటుదోషము వద్దనీ గాంధి అరచుచుండెనండి
కరుణతోడను గాంచుడంచును గాంధిమహాత్ముండు
యెన్ని విధంబుల నైనజెప్పెను ఏమిటి నేర్చేరు?

అంటరానితనమే లేదనుచు అంటూ ఉంటారు
దేశమంతటా చాటుచుండెను దీనదయాపరుడు

వాదులాడక అంటును వేగమె వదలివేయుడనుచు
దేశసుఖంబును గోరుడంచును దెల్పుచు నున్నాడు
మాలమాదిగలు అన్న తగ్గున మండిపడెదరయ్యా
మాలదొరలకు మ్రొక్కుచు వారిని మన్నించెదరయ్యా
వేషభాషలను వారివిగూడ వేసుకొందురయ్యా
వారంటే బహుప్రీతితోడను వేడుచుందురయ్యా
దిక్కుమాలిన వారలమయ్యా దీనులమేమయ్యా
కుక్కలవలె జూచుట మీకు కూడదుగదయ్యా

పెక్కు బాధలను పెట్టుట మీకు పౌరుషమంటయ్యా
తక్కువగా మము జూచుట మీకు తగునా చెప్పండి
పంచమాదుల కష్టములెల్ల బాపకున్న మీకు
జన్మహక్కులురావని భక్తులు చెప్పుచున్నారు
మాలమాదిగను భేదమునింక మంటగలుపరయ్యా
మరి భేదంబులు దీసివేసి యిక మార్గము గనరయ్యా
దేశములోన ఐకమత్యము దెచ్చుకొనేవరకు
రాదు స్వరాజ్యము నిక్కముగాను రాదు రాదు రాదు
తోడి మానవుల మయిన మమ్ముల త్రోయజెల్లునయ్యా
యింతకంటెను పాపము వేరు యెందునలేదయ్యా
మాయొక్క కష్టంబునుదినుచు మమ్ము జంపుతారె
అంటుకొన్న మాత్రానమీరలు అడలుచునుందేరా
కల్లు మానుడని బోధలెన్నియో కడుప్రీతిగజేసి
కల్లుపాటలే బాడుచు డబ్బు కొల్లగదీసేరు
కల్లుపాకలే మాచేరువనే కట్టియుంచినారు
గొడ్లక వేళాల్పెట్టి పన్నులు కొల్లగాదీసేరు

మాయచేతనే మాదుకలిమిని మరుగుగ దీసేరు
పైకి మాత్రమే కల్లుచెడ్డదని బోధనజేస్తారు
సర్వజనులును అన్నదమ్ముల సభలలో చాటేరు
ముట్టబోయిన ముట్టుకోరయా మూల్గుచునుండేరు
దయ్యమువలె జూచుట మీకు ధర్మంబగునయ్యా
త్రాచుపాములవలె జూడగమీకు తగునా చెప్పండి
కయ్యమాడుట దేశములోన గొప్పతనము కాదు
గాంధిబోధను ఆమోదించి కరుణాజూపరయ్యా
బానిసలంచు బిలువగమీరే బానిసలైనారు
మాతృపూజలను మానకుడయ్యా మంచిమాటకాదు
భూమియంతయు మాదేయనెడు బుద్ధిమానరయ్యా
మేముదక్క మీకెవ్వరుదిక్కని మిడిసిపడకుడయ్యా
పుట్టినదాదిగ పుడమిలోపల ప్రేమతోడలేము
దాసులమై మీ సేవజేసినన దలపరె మాగోడు
ప్రేమతోడకు మేలుజేతుము ప్రాణమిత్రుమయ్యా
కడుపులోన పసిపాపలుగాని కదలకున్న బాబు
మాలడు నీరు మంత్రముచేసి ముందుగానునిచ్చు
చూపు దోషములచేతను యాపసిపాపల రోగమున
మాలలు వేసెడు తోలుజందెము మరచిపోయినారు
ఎండకు కాళ్ళు మండకుండగ యేంత ప్రేమతోడ
గొప్పగొప్ప జోళ్ళనుజేసి మీకొప్పగించునయ్యా
పసిపాపలకు బాలగ్రహము పట్టియున్నబాబు
మాలరక్ష రేకునుయిచ్చి మాన్పివేయునండి
మాటిమాటికిని వీధినివీధిని చాటునుమావాడు
జమాబందులను జేర్చిమేలును జేయునుమావారు
పాడుపడిన యాభూములన్నియు బాగుచేయునండి

మేడమిద్దెలుగట్టి మీకును మేలుచేయునండి
కూడుగుడ్డకు లోటుజెందిన కూర్మితప్పదండి
అండగాను మీకుందురయెపుడీ దండుమాత్రముండి
ఏడు కోట్ల యీ దండును మీరు యెక్కడవుంచారో
ఇంచుకైన ఆలోచన చేయుడు యికనైనను మీరు
ఆలిపిల్లలతో కూలికివత్తురు మాలలు చూడండి
కూడులేకున్నను బాబుకూడి చేయునండి
తట్టలు బుట్టలు చాపలు మేము తయారుచేయాలి
కాయలు పండ్లు కఱ్ఱలు మేము కానుకలివ్వాలి
ఆదిమాంధ్రుల రక్తమునంత ఆరగించ మీకు
దాహమేమియు దీరలేదయా తనివితీరలేద
అంటుకు రూపంబెచ్చటున్నదో అసలు చెప్పరయ్యా
మతమనునది యెట్లు వచ్చెను మాకుజెప్పరయ్యా
అప్పులంచును మావులు మాకు ఒప్పగింతురయ్యా
ఏటికెల్లను వడ్డినిబెంచి యేడిపింతురయ్యా
కూటికిలేక మాయవేషమున కులము మరచిపోయి
మాదుయిండ్లలో భిక్షను హాయిగ చేదుకపోతారు
అంటుముట్లు అసలుండదు బాబు ఆ సమయంలోన
అన్నదమ్ములమంచును వారు ఆశనుబెట్టెరు
జంగమవేషము వేసుక డబ్బు చల్లగ దీసేరు
మల్లికర్జుల పేర్లనుబెట్టిక మాయ బుచ్చుతారు
చెంచులమంచు డబ్బునులాగి చెరుపుదురో బాబు
అంటనుచు యెగిరెగిరి పడుదురు ఆలోచించండి
మాయసరకులెంతేని ప్రేమతో మాకు నిత్తురండి
మాదుకండ్లలో దుమ్మిడిమమ్ము మాయ చేతురండి
ఇత్తడికి బంగారముగిల్టిడి ఏడిపింతురయ్యా

అరువుసరకులనిచ్చి వడ్డిని అధికము చేస్తారు
గాంధి బోధలు నమ్మినవారికి గలదు ముక్తిగలదు
దీపముండగ మేలుకొనండి ధీరులార మీరు
దేవాలయమున కంటులేద తెలిసికొనుడు బాబు
సంతలు సత్రములందు అంటును చంపివేయరండి
పగలు రాత్రి ఒక రీతిగనే పాటుబడుదుమండి
ఎక్కడ జూచిన మాదండెల్ల నిండియుండెనండి
దేశసేవను జేయునట్టి కడుదీనుల మోయండి
లంజిముండలకు పెడుదురు బాబు సంచమురెన్నైన
కష్టజీవులమైయున్నా మము కానరు బాబయ్య
అంగడిబెట్టి అమ్మెదమంటె అమ్మనీయరండి
అంగడిబెట్టి అమ్మిన బాబు ఆశీలివ్వాలి
భరించలేము బాధను మేము భారతీయులార
చదువుకొన్నము మీరలె మేము చక్కగ చూడండి
మాంసము తినుట మానినారమో ముట్టరు మమ్మయ్య
జీవహింసను మానితె మీలో జేర్చరె మమ్మయ్య
పాడుదురాచారంబులు మేము పారదోలినాము
జాతిభేదములు అన్నియు మాలోమేము జంపివేసినాము
మీవలెనే దేశాభిమానము మాకు యున్నదయ్య
మీకుమాకును జన్మభూమియిది మరచుటేలనయ్య
ధీరులువీరులు ఇప్పుడెమాలో దండ్లకొలదికలరు
మూలమూలలను బడియున్నారు మేలుకొలుపరయ్య
జన్మహక్కులకు మమ్ములగూడ జేర్చుకొనండయ్య
పెరవారముగాము మేము మీ ప్రియమిత్రులమయ్య
స్వరాజ్యసాధనచేయు మాకు సాహసంబుగలదు
మాతృదేవతారాధనమ్ము మాచేతనగునుసుండి
వీరశివాజీససైన్యములో మావీరులండి

అంటుదోషమును మానియతడు మమ్మాదరించెనండి
స్వరాజ్యమంటూ తోడి సోదరులు సకల బాధపడుతుంటె
అదిమాంధ్రులు వెదక బోరుతాము వలబోపుపొంటె
యోధులొక్కరెకాదు మాలోయోగులు గలరండి
తేజరిల్లె శ్రీరంగమునందున తిరుప్పణాళ్వారు
తిట్టికొట్టిమూర్ఛిల్లచేసినా తిరిగి కొట్టలేదు
రంగారంగారంగాయంటు రంగని పూజించె
అగ్రజాతి వైష్ణవులందరు అతని మ్రొక్కిరండి
చిదంబరంబున నందుని చోద్యము చూడరెవ్వరండి
విశ్వామిత్రుని పశుజలమును రావిపలము చేసినయట్టి
వశిష్టమహర్షి ధర్మపత్ని మా వంశపుపడుచెనండి
పశువులతిందురు వీరికెక్కడిది పాపభీతియనకండి
పాపభీతితో రాముజంపిన వాల్మీకిదియే కులమండి
ఆదరించి దయజూపండీ మా ఆదిమాంధ్రులకును
అప్పుడుచెప్పుడు ఆదిమాంధ్రుల అలసదనముమీరు
ఏడుకోట్లదండొక్కభాగమై ఎడగలుండిపోతే
బలమెక్కడిదీ హిందూజాతికి పౌరుషమెక్కడిది
హిందూదేశములోపల జనులు ఏకముకాకుంటె
సంపాదింపగ జన్మహక్కుమరి శక్యముకాదండి
త్రిప్పుడీ మరియొక్కసారి విదేశచరిత్రలను
రండిరండిమము జేర్చుకొనండి రయమునమీరండి
రంగస్వామిమొరనాలించనిచో రాదుస్వరాజ్యంబు

జాలా రంగస్వామి
అంటరాని వారెవరు ?
1930

# మేలుకొలుపు

మేలుకొనుమీ ఆదిమాంధ్రుడ। మేలుకో మహ నాటివాడ। మేలుకో వాల్మీకి వంశపు వీరపుత్రుండా ॥మేలుకో॥

అన్ని జాతులకెల్ల ముందర। అడుగు వేసెడు కాలమిదిరా అంధకారము నందు బడి నిదురంది కుందకురా ॥మే॥

దండిగను కష్టముల బెట్టిన। సందబాయని కులము మనదిర। నిండు ధైర్యము గనుము వేగమెలెమ్ము లే లెమ్మ ॥మే॥

శాంతిశూరుల రొచు రండిని। సాటివారెలుగెత్తి బిల్చిరి। ఇంచుకైనను నిదురజెందక సాగిపోదమురా ॥మే॥

అంటుమట్టులేని ఆది। మాంధ్రులనియెడి అరపులవిగో। ముట్టరాదను మూఢతనుమటు మాయజేయుమురా ॥మే॥

దూరదూరము దరిమినను। దుఃఖంబునొందక ధర్మమార్గము। దప్పకుం డెడి సంఘమని యెలుగెత్తి పల్కుమురా ॥మే॥

సృష్టి బుట్టినతోడ బుట్టియు। సుందరంబగు సౌఖ్యమొందియు। సలుపరా నటువంటి పనులలో । జిక్కి చెడితివిరా ॥మే॥

పెక్కుబాధలతోడ బంది। ఖానలంబడి యుండినను నిల । దిక్కుమాలిన వారమని । దిగులొందవలదికనూ ॥మే॥

పశువులవలె హింసించినను కని । బూనకను మసలేటి వారము । దశల బొందెడి కాలముందికతరలివేగమెరా ॥మే॥

ఎండవానలకోర్చి ఆకలి । దప్పికలవిడనాడి కష్టముజేసి ''తెలు''పను * గుణములోబడి తరలకుంటివిరా ॥మే॥

ధనము ధాన్యములేక యున్నను। ధర్మమార్గము దప్పకుండను ధనుశీ లౌటకు మార్గమిదిగోరమ్మ రారమ్మా ॥మే॥

అదిగో తెల్లగతెల్లవారెను । అడుగు ముందర వేయమింకను । దుర్గ ణంబుల ద్రోసి దేవునిధ్యానమొనరించు ॥మే॥

జాలా రంగస్వామి
మాలశుద్ధి
1930

* "తెలుపు అనగా కల్లు.

# మాలశుద్ధి

(మాయ మర్మము దెలుసుకొండోయ్ నరులార - మంచి గురువు నాశ్రయించండి)

మానుకొండీ మేలుకొండోయి జనులార । మాంసంబు కల్లు మానండి
పొగాకు పొగచుట్ట కల్లుసారాయిలు । పందులు దున్నలు పక్షులు కోడెలు
చచ్చిపోయిన గొడ్లనిక తినుట మానండి । మాంస తోరణములు మన
యిండ్ల కొద్దండి
జలచరాదుల జీవముల దీయవద్దండి । అంటరాదని మనల నణగ
ద్రొక్కినారు
ఇట్టి నీచులమయి ఎన్నాళ్ళు బ్రతికెదము । ఇకనైన మేలుకొని
ధర్మమును తెలియండి ॥మా॥
మన వంశ కర్తలను గనరోయి జనులార । మానపంతుల మొర వినండి
మనకున్న చెడువాడుకలు మానకుందురు । మూరెడు పొగచుట్ట మాను
కొనకుందురు
పండ్ల క్రిందను పాడు పొగాకు తిందురు । చెవిసందు పొగచుట్ట చేర్చుకొని
యుందురు
తలలోను చుట్ట తుంపులు దాచుకొందురు । మొలత్రాడు సందులో మహ
గొప్ప చుట్టంటారు
తప్పంటే తన్నుటకు త్వరితముగ వస్తారు ॥మా॥
అసలు మన దేశమిదిరండోయి జనులారా ఐకమత్యమె గోరుకొండీ
అందరము అన్నదమ్ములమె యనుచున్నారు। జాతిభేదము లేదు
జాగువద్దన్నారు
మేలుకొమ్మని మేనుతట్టుచునుయున్నారు। రండిరండని రెక్కలాగుచును
యున్నారు
బానిసత్వమె వేగపరిమార్చ మంటారు। దేశానికిమీరు దాతలని యంటారు
దేశవృత్తులు మిమ్ము దెలుసుకొమ్మంటారు। మీ బాలురకు విద్య
మప్పించమంటారు
మర్యాద నేర్చుకొని మెలగమనియంటారు। మీపూర్వులవలె మిమ్ముండ
మంటారు

వారిమర్యాదలు వీడవలదంటారు। కూటమైసంఘములు కల్పించమంటార
కూడిమీదోషములు కడకుచీమంటారు ॥మా॥

దోషములు తొలగనీయండోయి జనులార। దిద్దుకొని హక్కుగోరండి
పెందలాడె పనిచక్క పెట్టొస్తారు। నస్తూనె అన్నమ్ము వడ్డించమంటార
కాళ్ళువళ్ళెల్లను కడుగుకొనకుందురు। తిండితినుటకుముందు దైవమును
దలపర
చుట్టనోటిలోబెట్టి చురుకుగావస్తారు। పదిమందిలో పొగ బండివలె విడిచేరు
ఏండ్లక్రిందను చుట్ట నములుచును మ్రింగేరు। ఎప్పుడొంటికి నీళ్ళు పోసు
కొని ఎరుగరు
ఏడాది కొక్కమారే స్నానమంటారు। ఇంతఎడ్డిబ్రతుకు ఎన్నాళ్ళు
బ్రతికేరు ఇకనైన మేలుకొని ఇట్టి పనిమానండి ॥మా॥

చెడ్డపనులు మానుకొండమ్మ స్త్రీలలార। సర్వహక్కులు గోరుకొండి
వీరపుత్రికలు మనవంశమందున్నారు। వారెల్లరు మనకు వేల్పులైయున్నారు
దైవభక్తిని మనము విడువవలదన్నారు। నీతిజాతి మీరు విడుచుకొని
యున్నారు
నీతినిలుపండంటె మాకెందుకంటారు। బిడ్డలను కనగానె పరువువిడిచేస్తారు
పెద్దదానిని నాకు పరువెందుకంటారు। పతిభక్తినెల్లను పారదోలేస్తారు
కన్నవాళ్ళందరకు పాడుపేర్లెడతారు। మాలిదని, మల్లిదని, దాలిదని,
పోలిదని, పాటిదని, కడిమిదని, పోతిదని, జమ్మిదని, నూకిదని,
సెరబదని, చెంచిదని, పెంటిదని, అతినీచమైనట్టి ఆపేర్లునెప్పుడు।
ఇతరులందరితోను ఊలాగె చెప్పుదురు ॥మా॥

మడ్డితనములు మానుకొండోయి స్త్రీలార । మూఢతను విడిచి మేల్కొండి
చిప్పతో గూడెట్టి చేతనిడుకుంటారు । వాకిటకు వస్తారు వచ్చి నిలుచుంటారు
అరచేతిలో బెట్టి ఆరగిస్తుంటారు । ఇరుగమ్మ పొరుగమ్మ ఏమి
కూరంటారు
మాంసమంటె మచ్చు చూస్తా వెయిమంటారు । ముక్కలేకుంటేను
ముద్దదిగదంటారు
పండ్లక్రిందకు పెద్దముదుసుండ లంటారు । పాటింత కూరకే పెట్టవలె
నంటారు

ఎంతైన చాలదని విసుగుకొని తిడతారు । ఆ ఎంగిలికుండ లిల్లెల్ల
పెడతారు
ఈ హైన్యములచేత ఇల్లిడిచి పెడతారు ఇంటినంటి శుభ్రమెరుగకను
యుంటారు ఇంత నీచపు బ్రతుకు ఏన్నాళ్ళు బ్రతికేరు ॥మా॥
నీతిజాతి నిలుపలేరా స్త్రీలార । నీచకార్యము లణచలేరా
రహదారులందు రవ్వంతసిగ్గులేదా । రవిక, కొడవలి భుజముమీదెడతారు
మూరెడు పొగచుట్ట నోటిలో పెడతారు । రెండుచెప్పులు నెత్తిమీదెట్టు
కుంటారు
నడివీధిలో చీర నడుస్తుకడతారు । త్రోవలో బండబూతులె
తిడుతు వెడతారు పొలము కాపులతోను పంతములుచేస్తారు ।
ఆ పొలముకాపులే మిమ్మిద్చుకొస్తారు
జుట్టుమరి మెలివేసి జాడించికొడతారు । ఈరోజునుండి మాపొలము
విడుమంటారు
మీనోళ్ళు మూసికొని మీరూరుకుంటారు । ఇట్టి నీచపుబ్రతుకు ఎన్నాళ్ళు
బ్రతికేరు యికనైన నేత్రములు విప్పి మానుకొనుడి ॥మా॥
ఎదుటివారలు నవ్వినారోయి స్త్రీలార । నీచకార్యము లివన్నారు
ఈతరుప్పంటి తల విరబోసుకుంటారు।బారెడుపొగచుట్ట జారేసుకుంటారు
పెదవునందున చొల్లు పొరలుచును యుండును । తలదువ్వుకొనుటయె
యేనాడు ఎరుగరు
తాటిటెంకలబోలె తలలెల్ల యుంతురు । మేను రాక్షసిరూప మెత్తుకొని
యుండును
ప్రొద్దెల్ల బండబూతులె బోధచేయుదురు । ప్రొద్దుకుంకేసరికి కల్లుకే
బోదురు
ఇంటి పాచితుక్కు ఇంటికెగదోస్తురు । వాకిటను పెంటెల్ల బీడువలె
పెడుదురు
పాడైన గుడివలె ఇల్లెల్ల పెడుదురు । పాచిమొగమేసుకొని వంటొండి
పెడుదురు
వంట చేయుచు చుట్ట ఒక్కదమ్మేస్తురు । స్నానంబు ఎప్పుడు చేయడం
ఎరుగరు

స్నానంబు చేయమంటె చీకాకులంటారు । మైలగుడ్డే పదిరోజులే కడతారు
కల్లుకులేనప్పుడు కండ్లెఱ్ఱచేస్తారు। పదిమంది పెద్దలలో పొగచుట్టవేస్తారు
పరువు లేదాయంటె పైబడి తిడతారు ॥మా॥
పాడుకల్లుమరచి పొండోయిస్త్రీలార ! పిల్లజెల్లల మాడ్చకండా ।
తప్పత్రాగి దెబ్బలాటాడివస్తారు । ఇంటి పిల్లలనెల్ల అప్పుడెకొడతారు।
మగనితో పోరాడి వేరుంటనంటారు । పేటలో నందరితో పోరాడు
చుంటారు
కూడొండమంటెను కల్లుదెమ్మంటారు । ఆవేళ నందరిని పస్తుపడ వేస్తారు
ఇళ్లెల్ల వాంతులతో వీరంగమేస్తారు । మొలపంచియెగగట్టి మీసాలు
సవరించి
పైనున్న వలివాటు మొలచుట్టుతాజుట్టి । ఒళ్లెల్ల వెదజల్లి తొడమీద
చెయివేసి
పోయివారితో కుస్తిపట్టుమని యంటారు । త్రాగుబోతని తరలిపోయె
వారలగాంచి
పందరూపాయలె పందెమనియంటారు । రాళ్ళరప్పలతోను యుద్ధమే
చేస్తారు
ఇక మంచిబుద్ధినీపతికి నేర్పించుకొని ॥మా॥
మిముజూచి దూరమన్నారో స్త్రీలారా । మీ పనులె నీచమన్నారొ
ఇల్లలుకుటకు మహాబద్ధకమెయంటారు । నెత్తిమీదకుప్రొద్దు ఎక్కాక
లేస్తారు
నోటిలో పుడకెట్టి నీళ్ళపొయిమీదెట్టి । ఎసరుకాగినపిదప వార్చివడ్డిస్తారు
అంతవరకును పుడక నములుచునెయుందురు। పుడక నములుచు ఉమ్మి
పొయ్యలోవేస్తారు
మొగముకడిగి అన్నం వడ్డించు చుంటారు । తింటూనే నట్టింట
తుపుక్కునూస్తారు
ఆచేతనే కూర వడ్డించుకుంటారు । ఆ చేయి కుండలో అట్టెబెట్టుతారు
అంతలోచీడుకొని గుడ్డకేరాస్తారు చెయికడిగి వెంటనే చుట్ట కారేస్తారు
చుట్టకాల్చి పొగచప్పున మ్రింగి । దమ్ముతీరినవెనుక నలుగురును
గూడేరు

కూడి కల్లుముంత లెగరేయుచుండేరు । ఇట్టినీచపు బ్రతుకు ఎన్నాళ్ళు బ్రతికేరు
ఇకనైన మేలుకొని కల్లు మీరు । ఈనీచములవలనె వెలుపలను యున్నారు ॥మా॥

ఇంక చెడుబుద్ధి మానండోయి జనులారా । మానుకొని హక్కుగోరండి
మీతోటిపాటు ఇంటిల్లాల్ని చంపెదరు । మీ బుద్ధులెల్లను నేరుచును ఉందురు
కూలినాలి చేసి కల్లుకే పెడుదురు కూడు లేకను కష్టమొంద లేకుందురు
కూడొండకుండిన భార్యను కొడుదురు । కొంప తనఖా కిచ్చి నీడ లేకుందురు
పంచలందున పండుటకు ఇష్టమందురు । పదిమందిలో మీరు పరువు విడిచేస్తారు
పరువు మర్యాలను పోదోలుకుందురు । పొలమున్న తనఖాల కిచ్చుకొందుదు
పదుగురిలో బ్రతికి చెడిపోతిమని యందురు । ఇట్టి నీచపు పనులు మానుకొనకుందురు
మానుకొని హక్కులను గోరుకొనకుందురు ॥మా॥

అందరికి అవసరము యీరోయిజనులార । అది హైందవుల మనరండి
బానిసత్వము మీరు బావుకోవాలండి । పదిమందిలో మీరు పరువుగా యుండండి
అంటు మానండని అందరు కోరండి । అస్పృశ్యులమని మనలనెంచ వద్దనరండి
మీ ప్రక్కనుమమ్ము మెసలనిమ్మనరండి। మీవలెమమ్ము సృష్టించి - నాడనరండి
మాలమాలను మాటమరచిపొమ్మనరండి । కల్లుమాంసము మానుకుంటి మని చెప్పండి చెప్పి మీ మనసులో శపథములు చేయండి ॥మా॥

మీరు పైకి రండోయి జనులార । అంటులేదనిపించుకోండి

మీజాతి కొరకు మహానీయులొస్తున్నారు । మేలుకొమ్మని మిమ్ము
లేపుచునుయున్నారు
మీకొరకు మేముద్భవించినామన్నారు । వారి జ్ఞానముమిమ్ము
నేర్చుకొమ్మన్నారు
మీసేవ వారు చేస్తుంటిమనియన్నారు । లేవదీసిన మీరు లేవకుంటిరి
చెంతకు రమ్మనిన చేరలేకుంటిరి । దోషములు యింకను తొలగించ
లేకుంటిరి
ఆలసింపక మీరు ఆ కల్లు మానండి ॥మా॥
మీ దోషములు దిద్దుకోండోయి జనులార । మనుష్యులై మెలగవలెనండి
పరువు మర్యాదలు పోదోలుకున్నారు । కూడుగుడ్డలేక కూలుచున్నారు
కొంపలే అమ్ముకొని పాలేరులైనారు । ధనికులకు దాసులై కోర్టు
పాలైనారు
యీ బానిసత్వము యిక మిమ్ము విడువదు । విడిచినను పదుగురిలో
మెలగలేకుందురు
మెలగినను మనుష్యులనిపించుకొనకుందురు । ఎంతకాలము మీరు
వెలివేయబడుదురు
ఇకనైనా మేలుకొని కల్లుసారాయి మానుకొని హక్కులు గోరు
కొండికను ॥మా॥
న్యాయధర్మము గోరుకొండోయి జనులారా । అందరొకటంచుచెప్పండి
ఇటుల ఎంతకాల మెడిగలుండాలంట।ఊరికామడ దూర మెందుకుండాలంట
ఈ బానిస|బతుకు ఎన్నాళ్లు మనకంట । మనకెప్పుడొస్తాది
మనహక్కు, మనకంట
మాలమాలనిగోల కెప్పుడిక విడుదలట । మన కల్లు సారాయిముందు
మానాలంట
మానుకున్నామని వెల్లడించాలంట । యిటుల మీ సభలలో
ఎంచుకోవాలంట ॥మా॥
హక్కు మాకేల లేదనరోయిజనులారా । అందరును గూడియడుగండి
బావిలో చెరువులో బహిరంగస్థలములో । రైలుపడవలయందు
రహదారులందును
సభలలో సంతలలో మందిరములందున । బాహాటముగ చోటు చూపుడని
చాటండి

మీతోటి నరులమని మహిమీద చాటండి । మమ్ముద్ధరించండి మామా టె
తలపండి
మా సంఘములు వెల్లడించమని కోరండి । కో॥ మీరు కల్లు చెడ్డదని
మానండి ॥మా॥
ఎంతకాలము కల్లు మీకోయి జనులార । అంతకాలము మడ్డితనము
కల్లు సారాయిలు నల్లమందుచుట్ట । మద్దత్తు గంజాయి యికనైన
మానుకొని
పదిమందిలో మీరు మనుష్యులనిపించండి । పెద్దలని బిరుదులు
పారదోలుకొండి
ఒకట్రైయుండండి హక్కులనుగోరండి । కోర్టులందు డబ్బుకూల
బోయొద్దండి
పంతములు మాని యిక పరువుగని యుండండి ॥మా॥
కల్లుమానితె మోక్షముందోయి జనులారా । కనుల విప్పిగాంచరండి
పూర్వికుల డబ్బంత పాడుపర్చేశావు । గొంతమ్మ పండగే యనికొంత
ఇచ్చావు
శ్యామలాంబ కొంత సంబరము చేస్తావు । మరిడిమహాలక్ష్మి యని
మరికొంత యిస్తావు
రాళ్ళు, రప్పలుబెట్టి రాముడని యంటావు । వీరి వారికిలొట్లు వినయముతో
నిస్తావు
వాల వాలంచును కల్లువారేస్తావు । పోలయ్యంటె, కాదు
పోలిగాణ్ణంటావు ॥మా॥
ఆయంటు మానమని యనరోయిజనులారా । ఐక్యమత్యమె జూపమనుడీ
ఇటువంటికల్మషము ఇపుడు మానాలంటె । మొదట కల్లుచుట్ట మాను
కోవాలంట
అప్పటితో మిమ్మలను అంటుకుంటారంట । దేవతల మ్రొక్కులు మాని
వెయ్యాలంట
మీకున్న డబ్బును మిగిలించవలెనంట । చందాలు చేసియిక సంఘములు
పెట్టండి
బీదలందరి కొరకు బడులు నెలకొల్పండి । దేశములో మనుష్యులని
దెల్పవలె మీరండి

కల్లు మాట మరచి కూడియుండాలండి ॥మా॥
ఈ సేవనిక మానుకొండో యిజనులారా । బానిసల మనిపించకండి ।
కాయకూరలు దెచ్చి కానుకగనిస్తారు । పంటపండించుకొని పోషించు
చుందురు
పాలు పెరుగులు నెయ్యి ప్రేమతోనిస్తురు । ఈ తనువు వారికే అర్పించు
చుందురు
ఎంతచేసిన మిమ్ము వెట్టివాళ్ళందురు । చచ్చిచెడి యేడాదికొక గోనె
దెత్తురు
ఆఖరుకు పుల్లెలుగు మండగెంజందురు । యీ బానిసత్వమె యికవిడువ
కుందురు
యీ సేవవల్లనే ఇటుల మీరుందురు ॥మా॥
డబ్బు వ్యయపర్చుకొనకండోయి జనులారా । వంటి శుభ్రత ఎరుగరండి
కొంత డబ్బునుదెచ్చి కల్లుకే పెడతారు । వంటిమీదనుగుడ్డ వేసుకొని
యెరుగరు
గంజిముంతే చేత ఘనమనియంటారు । ఆమయిలగోచియె అందమని
యంటారు
తల వెంట్రుకలు పెద్దదుబ్బుపలె పెడతారు । జునపాలనిజాలు తల కెల్ల
పెడతారు
కొనజంపు చెవియందు గొప్పగాయుంచేరు । పాడిండ్లలో మనముపడి
చావలంటారు
తెల్లబట్టలు వేసుకుంటె తప్పంటారు । నిర్భాగ్యతను ఎపుడు విడువకను
యుంటారు ॥మా॥
మన చెడ్డపేర్లు మార్చండోయి జనులారా । మంచి నడతలు నేర్చుకొండి
పోలడని । పెంటడని । డోమడని । ఈగడని । తుక్కడని । ఎరకడని।
మాలిగడు । బుచ్చిగడు
మల్లిగడు । పాతిగడు । సిద్దడని । దక్కడని । గొయ్యడని । బుంగడని।
దాలిగడు । గురివిగడు।
అబద్దిగడు । తౌటిగడు । దుంగడని । దుక్కడని । సింగడని। చెంచడని
చెప్పరాని పేర్లు చెప్పుకొని తిరిగెదరు ॥మా॥

ఏడుకోట్లేకమై రండో యిజనులారా । ఏకమైహక్కు గోరండి ।
పంటి పుడకలు మనము పట్టుకొచ్చివ్వాలి । ధాన్యపు రాసులను దంచి మనమివ్వాలి ।
పొలములో పంటపండించి మనమివ్వాలి। బుట్టతట్టలు అల్లి। బజారుకివ్వాలి।
గోవులను పెంచుటకు గడ్డి మనమివ్వాలి । వంటకొరకునుమనము వంట చెరుకివ్వాలి ।
పండ్లు ఫలములు తెచ్చి ప్రేమతో నివ్వాలి। వనములందన వనంత్రములు మనమివ్వాలి
వట్టివేరులచాపలల్లి మనమివ్వాలి । అన్నిటికి మనమెంతో
ఆధారమైతిమి ॥మా॥

కల్లు కోరికాశమానండోయి జనులారా । కడవారమనిపించకండి।
మహనాటివారమని మనకు పేరుందండి। నాల్గు జాతులకెల్ల నాధారమె మనము।
పాదరక్షలు మనము ప్రేమతోనివ్వాలి। యుత్సవములందు మనడప్పు। వాయించాలి।
వానలకు గొడుగులె అల్లి మనమివ్వాలి। శుభకార్యములయందు చాపల్లివ్వాలి।
పనిముట్లవలె మనల పట్టిపీకెదరండి। అవసరమెయున్నచో అందరొక
టంటారు అవసరమె లేనప్పుడంటరా దంటారు ॥మా॥

జాతిభేదములేదు మనకోయి జనులారా । జీవితము శుద్ధిపర్చండి ।
జన్మమున జాతిభేదములేదు నమ్మండి । నీచమైన పనులు విడుచు కొమ్మంటిని ।
మాటనమ్మిన మోక్షముందియనుకొంటిని । హృదయ తాపముచేత చెప్పు కొనుచుంటిని ।

వాసిగను కంబాలపేటలో బుట్టితి । ఒప్పుగా ఆనంద నికేతంబనెడు ।
ఆశ్రమంబుననేను వసియించునుంటిని । రంగస్వామిని మిమ్ము వేడుకొను
చుంటిని త్వరితముగ మేలుకొనిమాను కొమ్మంటిని ॥మా॥

జాలా రంగస్వామి
మాలశుద్ధి
1930

# హరిజన శతకము

మాలవాడని యవ । మానంబు గావించి
పంచముడని పరువు । పారదోలి
ఆదిమాంధ్రుడవని । సోదిజెప్పిరి కాదె?
ఆలకింపుమయ్య । హరిజనుండ.

అంటరానియట్టి । యధమాధముడవంచు
చెప్పరానియట్టి । చెనటి వనుచు
చూడరానియట్టి । క్షుద్రుడ వనిరయా
ఆలకింపుమయ్య । హరిజనుండ.

సౌఖ్యజీవనంబు । సలుపంగ రానీక
మారువాడజేరి । యుండనీక
నంటముట్టరాక । గెంటరే? దూరాన
ఆలకింపుమయ్య । హరిజనుండ.

కుక్క భైరవుడని । కోతిని హనుమంతు
డనుచు నాదరించి । యాత్మ గొల్చు
బీదజనులతాక । బేదంబదేటికో?
ఆలకింపుమయ్య । హరిజనుండ.

సాత్త్వికమున బోరి । జయమందవలెగాని
తామసంబునెపుడు । వలపరాదు
సాత్త్వికంబు సకల । సాధన రాజంబు
ఆలకింపుమయ్య । హరిజనుండ.

దీనిని చదివిన విన్నను
మానక వాకొన్న మాల । మాదిగ లనుచున్
హీనముగా జూచెదు నా
మానిసి మూకలకు నీతి । మార్గము చిక్కున్.

కుసుమ ధర్మన్నకవి
"హరిజన శతకము" నుండి
1933

## నల్లదొరతనము

కుక్క నక్కలకంటె । తక్కువగ జూచి-
నిక్కి, తక్కి । నిగుడుతారు,
సాని ప్రక్కజేర । సాగుతారు,
కుష్ఠురోగి సరస । కూర్చుంటారు,
కుక్క, కోతిని । కోరి పెంచేరు
పిల్లి, పిట్టాల! ప్రేమించుతారు,
పందిగున్నాల । బాధింపరారు,
కాకి నీటిని । తాకనిస్తారు,
మమ్ము! దరికి చేరనీరు! దడదడ తిట్టేరు. ॥అంటుదో॥

పడవలందు రైలు । ప్రయాణములందు
కడకు పొమ్మని గసురుతారు,
మాలలంటె మండి పడిపోతారు,
క్రైస్తవూలంటె । కయ్యమాడారు,
తురకలంటె మాట । తూలబోరు,
సాగి శాస్త్రులక్కడ । చాటలేరు,
యెంచి యాచారమని । యెగరలేరు,
దేవ! అనువుగానిచోట్ల । అంటు పాటించారు. ॥అంటుదో॥

నీతిజాతిలేని । నీచులమని మమ్ము-
నిందించి బంధించుతారు,
జాతిభేదాలెన్నో । చాటుతారు,
నీతిజాతివారె । నిలువలేరు
తెల్లదొరలాను । దేవురించేరు,
చెడుగులెన్నో । చేయనెంచుతారు,
కూటసాక్ష్యాలు । కూయ నేర్చేరు,
మతము, హితము । మంట గలుపుతారు,
దేవ! గుణముకంటె । కులమే ఘనమని యెంచేరు ॥అంటుదో॥

ఎఱుకలి యేనాదుల । నెగ్గు పట్టరాక
యేకమై కలసి తిరిగేరు,
చెంచులాను । చెంత రానిస్తారు,
బందమొండి । నంద జేర్చుతారు,
పల్లి, రెల్లీల । పట్టి ముట్టేరు,
చాకలంటె । శంకబూనరారు,
మంగలంటె । మన్నింప సాగేరు,
సానులంటె । సరస రానిస్తారు,
మా మాలమాదిగలంటె । మండి పడిపోతారు ॥అంటుదో॥

తురక దూదేకులతో । దొరల క్రైస్తవులతో,
కలసి మెలసి తిరుగుతారు,
భాయి, భాయని । పాకులాడుతారు,
సరసజేరి । సలాము జేసేరు,
కూడి నూతిలో । తోడుకుంటారు,
యెంచి విందులార । గించుతారు,
పొందుగా వియ్య । మందుకుంటారు,
మేము కంటబడరాదంట! కంపు గిట్టదంట ॥అంటుదో॥

కుసుమ ధర్మన్నకవి
"నల్ల దొరతనం" గ్రంథం నుండి
1933

# హరిజన కీర్తనలు

అంటూ దోషము మానరేల దానివిడువరాదని మీరు పంతాలాడగ నేల అంటూ దోషము మానరేల ॥అం॥

పగలనక రేయనక పాటుబడ్డనుగాని పట్టెడన్నము గుడ్డసున్న, కడుపు మాడిన గంజిపొయ్యారు బాధపడుచుంటె పలకరించారు, మాచే పనులెన్నో చేయించుతారు. దేవహింశాపెట్టి మమ్ము హీనులుగా చూచేరు ॥అం॥
గాంధిబోధలన్ని గట్టిగవింటారు గాంధితో వుంటానంటారు, వారు చెప్పినట్లు చేయలేరు. మాల మాదిగల మన్నించబోరు, తోడిప్రజలాను వెలిపెట్టినారు. జాతిభేదము పాటించుతారు, పైరీతి గాంధిజి పలుకూ చుండినగాని అంటుండాలని మీరు పట్టుబట్టగనేల ॥....॥

ఎండనక వాననక పంటాభూములనెల్ల, పండించువారాము మేము ఫలము భుజించువారాలు మీరు తిండిలేక ఏడ్చువారము మేము కడుపుచూచైన కనికారించారు భార్యాబిడ్డలము పస్తుంటిమన్న, కన్నెత్తిచూడారు కఠినాత్ములై మీరు ॥....॥

పొలమూలెన్నో దున్నిపనులెన్నో చేయూచు బలహీనుడానై తినయ్య, పలకరించి బత్యము పెట్టరయ్య నోరు ఎత్తితే బడితదెబ్బయ్య, పలకరించితే పైబడతరయ్యా, సరసకెళ్ళితె సహించరయ్య, యీ బాధలన్నియుయికపడము మేమయ్య ॥....॥

పల్లెటూళ్ళల్లో బాధలు చూడండి పడజాలం యీ బాధలండి గడపదాటితె కంపూమేమంట, పండ్లుతెచ్చిస్తె తంటా లేదంట యింట్లో ధాన్యములు పొయ్యొచ్చునంట, పొలము పనులలో కలవచ్చునంట, పిల్లవాళ్ళకు పాలియ్యొచ్చంట, మాతో అవసరము లేకుంటే అవతాలుండాలంట ।....।
వాలి సుగ్రీవుల సంతాతి మమ్ముల ఈరీతి హీనాముచేయూట తగదు, దేవుడున్నాడు అదిగో చూడండి, మీదిమాదీని ఒకటేమతమండి హిందు దేశములో పుట్టినమండి క్రైస్తవమతమూలో చేరాలేదండి మమ్ము కించిత్తుచేయావద్దండి, మేము మానావులను మాటమరచి పోయారండి ॥అంటు॥

కోళ్ళ కుక్కలకన్న కొరగాకమమ్మూల కఠినముగా చూచుచుంటారు, మాది కష్టామెల్ల తింటమీరు, రక్తమాంసాదుల పిండుతారు, మాట చెప్పితే మన్నించబోరు, బూటకాలెన్నో చేయుచుంటారు, చొక్క తొడిగితే సహించలేరు. పంచికడితేను పగపెంచుతారు. బాబు గోచిగుడ్డ మాకు గోటాని చెప్పైరు ॥....॥

చదువూదమని మాకు సంతోషముండీన, చదువెందూకని చెప్పుతారు, చదువకూడాదు మమ్మూనంటారు, చదువుబడిలోనే చేరానియ్యారు బాగ బ్రతికితే పగపెంచుతారు. లేని అప్పులన్ని పెంచుతారు, చిప్పచేతికిచ్చి పంపుతారు, ముప్పతిప్పలపెట్టి మూడు చెరువుల నీళ్ళు తప్పాక త్రాగించి తంటాలు పెట్టేరు ॥....॥

పసువూలకోసేటి పాపాత్ములామాని, పక్కాకు చేరొద్దంటారు, తురక వారితో విందూ చేస్తారు కటికివారిని కలుపూకుంటారు, మంగలొస్తేను మరియాదిచ్చేరు, సాకలొస్తేను సరసానుంచేరు. చెంచువారొస్తే చెంతా నుంచేరు. వీరి ఐదూగూరికన్న అతిహేయమైతీమ ॥....॥

పల్లెటూరి దొరలు, బస్తీకి వస్తారు, బస్తీ అంతయు తిరుగుతారు, మాల మాదిగల నంటుతారు, అంటు ఎచ్చాటను కానరాదు, తోసుకు తోసూకోని తిరుగుతారు, మాలమనిషన్న మరిచిపోయ్యేరు, జాతిభేదము పాటించ బోరు, బాబు పల్లాపల్లలలోన పాతుకుందీయంటు ॥....॥

గాంధి మహాత్మూడు కట్టాడు కంకణము కనుడయ్య వారీది వ్రతము అంటు పోవాలి హిందూమతమందు, హిందుమతమెల్ల హతమవ్వు చుంది, అంటుదోషాన్ని మంటాకలపండి, హిందూమతమూనాకు చెందీన వారైతె అంటూదోషపుతంతు అవతలకి పంపండి ॥....॥

పై చెప్పినబోధ బాగావింటారాని, ప్రార్థానవే చేయుచుంటి, మా అందరకు దాసూడనంటి. తప్పుఒప్పులు మన్నించమంటి, ఆదిమాంధ్రూల మన్నించా లంటి, వాటమైన ఏలూరుపురమంటి. వంగాయ గూడెములోనే నుంటి, నక్కా చినవెంకయ్య నామంబునాదంటి ॥అం॥

నక్కా చినవెంకయ్య

1935

## 2. కీర్తన

(మమ్ముాకరుణించి బ్రోవుడి కళ్యాణరామ అనుమాదిరి)

మమ్ముాకరుణించి బ్రోవుడి కయ్యా మొద్దయ్యా మమ్ముాకరూణించి
బ్రోవుడి దీనులము హరిజనులము దారిజూపుడి దాతలార ॥మమ్ముా॥
అంటూ దోషమునెల్ల మంటాగలపండి అంటుదోషము మంటగలిపితె
అందులో తప్పేమిటి చింతచేయక మీరలెల్లరు చేంతజేర్చుడి
మమ్ముల ॥మ॥

ముందు యుగమందు మీరు మేము నొక్కటే జుట్టు బొట్టుయు మీకు
మాకును దేవుడొక్కడె రామచంద్రుడు ఎక్కువనుచును నిక్కు
చుందురు తక్కువెక్కడో చూపుడి ॥మ॥

పగలూ రేయనక మేము కష్టపడుచూను పొలములన్ని దున్ని మేము
ధాన్యఫలములు మీకునివ్వ, తిండిలేక మమ్ము మాడ్చి విందులెన్నో
చేతురయ్య ॥మ॥

భార్యాబిడ్డాలు నేను కష్టాపడుచూను బాధలెన్నొపడుచు మేము నీతితప్పక
సేవచేయ నీతిలేక మీరు మమ్ముల బూతులాడ న్యాయమా ॥మ॥

గొప్పా కులమనుచు మీరు గోటు చేయక గాంధీబాబు అవతరించి నీతి
లెన్నొ చెప్పుచుండ నీతి తెలియని తోడి ప్రజలపాడు చేయుట న్యాయమ
॥మ॥

ముచ్చాజోడులు తెచ్చి యిచ్చుచుండగా తుచ్చులాడుచు మమ్ము
మీరలు యిచ్చవచ్చినట్లు పలుకుచు మచ్చలెన్నొచూపి మాపై మన్ను
చేయనెంచుతారు ॥మ॥

కష్టాపెట్టకుడిమీరలు హరిజనులా మమ్మూ సూటిగా ఏలూరి పురము
వాటముగ వంగాయగూడెము సాటుచేయక చెప్పుచుంటిని నీతితో
వెంకయ్య నేను ॥మ॥

నక్కా చినవెంకయ్య
1935

# 3. కీర్తన

అంటుమానుడయ్యా మీరు వంట యింటిలో చొరమయ్య వంతమెందుకు
అంటూకొరకు, ప్రార్థించెదము వినరయ్య ॥అం॥

మనుష్య జాతికి అంటూ లేదు మరియు మీరు వినరయ్య, శబరి యిచ్చిన
పండ్లను రాముడు ప్రేమతో భజియించాడు ॥అం॥

అంటుమానాకుండా మీరు ఆడగవచ్చున రాజ్యము అంటుమానకుంటే
మీకు వచ్చున స్వారాజ్యము ॥అం॥

గాంధి తండ్రి మీకు మాకు కారణాసంభూతుడు మహాత్మగాంధీ చెప్పిన
రీతి మనమెల్లరము విందాము ॥అం॥

ఎంచి చూడ ఆదిమాంధ్రుల మేడుకోట్లువ్రంటిమి మేము యింత మంది
ప్రజలను మీరు ఎడము చేయుట న్యాయమ ॥అం॥

దేవాలయములోకి మేము చేరరాదనుచుందురే దేవునికి అంటూ వుంటే,
దేవుడే మీకు లేడౌనే ॥అంటు॥

కాయగూరలు తెచ్చి యిస్తే కమ్మగానే తింటారు, తిన్న వెనుకా మమ్ము
మళ్ళీ, తిరిగి చూడొద్దంటారు ॥అం॥

యింటి ముందు పసూవు చస్తే, యీడ్చువారము మేమయ్య, పెంట
కుప్పాలన్నీ యెత్తి ప్రేమతో మిము చూతుము ॥అం॥

మీదుకులములొ మనిషి చస్తే గొయ్యతీతుము మేమయ్య, సర్వ
నమస్కారములు చేసి, చక్కపెట్టి వత్తుమూ ॥అం॥

యింత సేవ మీకూ చేసిన కొంతైన దయలేదయ్య, చింత చేసి మనసూ
లోన చెంత జేర్చుడి మమ్ములా ॥అం॥

బోధచెయ్యి దయ్యలారా అంటు పొయ్యే వరకూ మీరు, ఖ్యాతి గాంచిన
హిందుమతమున, నీతి నిలుపండయ్యామీరు ॥అం॥

నక్కా చినవెంకయ్య
1935

# 4. కీర్తన

(నీతిగల అనుమాదిరి)

మునిసిపాల్టివారు మాకు ముఖ్యమైన బరులలోన జీతనాతము తీసుకొనక విద్యగరుపుడి వినుతి చేతుము ॥ము॥

పాకీపనులూ చేయువారని పరమహీనుల రీతి మమ్మ గ్రామశుద్ధి చేయు మమ్ముల కనికరించరు మీరలయ్యా ॥ము॥

జిల్లా బోర్డు దొరలుమీకు మనవి చేతును నాదుమొరను, మీదుబడిలొ విద్యనేర్పి విద్యావంతుల చేయురయ్యా ॥మ॥

జీతనాతము లివ్వలేము, ధనములేని బీదలాము, దాతలయ్యా మమ్మ మీరలు ధర్మపాలన చేయరయ్యా ॥ము॥

నీళ్ళ సౌఖ్య మెల్ల మీకు మురికి కాల్వాల నీళ్లు మాకు, ఎలక్టరు దీపాలు మీకు, సూర్యచంద్రులె దిక్కుమాకు ॥ము॥

నీటిపన్ను భూమిపన్ను యింకపన్నూ లేపిమమ్ముల పన్నులన్నీ తీసుకొంటూ పరమహీనుల రీతి చూతురు ॥ము॥

మురికి కాల్వాలనుండు జీవులు చీమదోమాలన్నలయ్యా, యింటిమీద కప్పులేక కంతలెన్నో కలుగునయ్యా ॥ము॥

సూర్యచంద్రులు మాకు మంచి వెలుగునిచ్చూచుండునయ్యా కంతలంబటి వచ్చి యింట్లో కాచుచుందురు కాంతిగాను ॥ము॥

మాదు మొరను వినియుమీరు, మాకునివ్వుడి పంపునీళ్లు వినయాముతో మ్రొక్కుచుందుము వినుడి మాపై బోధను ॥ము॥

మీకు నెల్లప్రార్థనిచ్చి మమ్మువేడుచుంటినయ్యా దాతలయ్యా మీరు మాకు దారిచూపూడయ్యాలార ॥ము॥

నక్కా చినవెంకయ్య
1935

## 5. హరిజన సంఘాలు

(జాలము ఏలనుర అను మాదిరి)

భారతదేశములో పలుతావులందూను పెట్టారు సంఘాలు హరిజన సేవ
కులు అలకించుడయ్యా వారిబోధలెల్ల ॥భా॥
ఆంధ్రదేశమునందు హరిజానసంఘాము కలదయ్యా ఏలూరుపట్టాణ
మందూను ॥భా॥
జిల్లాకు ఒక సంఘం, తాలూకకొక సంఘం పల్లెపల్లెలలో పెట్టారు
సంఘాలు ॥భా॥
పన్నెండుజిల్లాలకు ప్రసిడెంటుగారైన దేశోద్ధారక విశ్వదాతలయ్య ॥భా॥
ఖ్యాతిగల పురుషులు కాశీనాథునివారు నాగేశ్వరరావు నామంబు గల
వారు ॥భా॥
పన్నిండుజిల్లాలకు ప్రధమా కార్యదర్శి మాగంటి బాపినీడు మా కల్ప
తరువయ్యా ॥భా॥
బెజవాడపురములో అయ్యదేవరవారు హరిజనజాతిని ఆదరించూ చుండ్రి
॥భా॥
గుంటూరుపురములో లక్ష్మినారాయణులు, హరిజనబాలిక ఆదరించు
చుండ్రి ॥భా॥
నిడుబ్రోలునందూన గోగినేనివారు, హరిజనులపాలిటి అన్నదమ్ములయ్య
॥భా॥
గొల్లపూడివారు బహు గొప్పవారయ్య హరిజనుల రక్షింప కట్టాడు
కంకణము ॥భా॥
గుడివాడపురములో గూడూరివారయ్య సేవాశ్రమము పెట్టి సేవా చేయు
చుండ్రి ॥భా॥
బందరుపట్నములో ప్రబలయోధుడయ్య వేమూరివారింట వెలసాడు
రామంజీ ॥భా॥
నందనారనుపేర నాశ్రమము పెట్టించి హరిజనబాలురను ఆదరించు
చుండ్రి ॥భా॥
చెరుకువాడా వారు చేయూబోధా వింటె అంటన్న ఎట్టిదో అప్పుడె తెలి
యూను ॥భా॥

బోగరాజు వారు పేరు పొందినవారు అంటు లేదని చెప్పి చాటించు
చున్నారు ॥భా॥
ఏలూరుపురములో వెళ్ళకివారింట పులివంటిధీరుండు పుట్టాడు
కృష్ణుండు ॥భా॥
ఏలూరుపట్నములో హరిజనులానెల్లాను పట్టూదలతో మమ్ము బాగు
చేయుచున్నాడు ॥భా॥
రాజమండ్రీయను రమ్యమయిన స్థలమూలో ముళ్ళంగి వారి బోధ చెప్ప
నలవికాదు ॥భా॥
పితాపురములో పుణ్యాత్ములైనట్టి తల్లిదండ్రులరీతి ధాతయ్యె
వెలసాడు ॥భా॥
కాకినాడలోను ఘనులుసూవారు మా హరిజనులపాలిటి ఆదరణ
శూరులు ॥భా॥
కర్నూలువాడలో కసిరెడ్డివారయ్య హరిజనలబడులాను స్థాపించి
నారయ్య ॥భా॥
కర్నూలు జిల్లాకు ఘనుడున్న్యాసుండె హరిజనులపాలిటి
ఆదకర్తయ్య ॥భా॥
నంద్యాల నందయ్య ఎలుకూరివారయ్య హరిజనులపాటి అన్న
దాతలయ్య ॥భా॥
గాడిచర్లలారు కనికరము గలవారు హరిజనులపాలీటి అంత్రైయ్యె
నిలచారు ॥భా॥
చిత్తూరుపురములో సిద్ధన్శెట్టులయ్య అనంతశయనూడు హరిజనుల
కండయ్య ॥భా॥
యింకెందరొ ధాతాలువున్నారు అయ్యాలు హరిజనులందరిని ఆదరించు
వారు ॥భా॥
వీరంత హరిజనుల సేవకులు వినరయ్య మమ్ముద్ధరించుటకు మహిని
వెలసినారు ॥భా॥
పై వారిఅందరికి పాదసేవకుడాను నక్కా చిన వెంకయ్య నామంబు
హరిజనుడ ॥భా॥

నక్కా చినవెంకయ్య
1935

# హరిజన స్త్రీల అలరింపు

అంటుదోషము మానరేల దాని విడుదాలకై మీకు మతంబు యిక నేల అంటుదోషము, మానరేల॥

వచ్చినారుమేము వళ్ళు తెలియాకుండ నాటించుచుందుము మేము, ముడ్డి ఎత్తెత్తి మట్టిదబ్బయ్యా. తుచ్ఛలాడుచు వెనుకుందురయ్యా, భార్యనన్నట్లు పేలూదురయ్యా, గొప్ప కులమాని, నిక్కూదురయ్యా చెప్పరానిపను చేసేరుదొరలయ్యా ॥అం॥

వర్షమొచ్చినగాని ఓర్పూతోమేమెల్ల వణుకూచునాటెయ్యాలంట, గట్టు ఎక్కి తెకర్రాదెబ్బంట, తిండితినుచుంటె తొందారలంట, మావంక జూచితె మండిపోతారయ్యా ॥అం॥

కోతలన్నియు మేముకోయూ చందుమయ్యా, కొడవాలిచేతానుబట్టి, కోసి కుప్పాలన్నియు వేతుమయ్యా,కుప్పాలేసి ఇంటికెల్దుమయ్యా.కూలియివకాను తిప్పూదురయ్యా యిన్ని రీతులమమ్ము హింసా పెట్టెదరయ్యా ॥అం॥

పూద్పులో కోత్తాలో యిచ్చేటి బహుమతులు విన్నావింతును కొంత వినుడి, కల్లుకడవాలు యిస్తారుదొరలు, పందినిస్తారు మా పెద్ద దొరలు, కల్లుత్రాగేటి దారిచూపారు మాంసము తినియేటి మరియాదనేర్పారు ॥అం॥
యిన్ని రీతులమమ్ము యీరీతిహింశింప యిదిమీకున్యాయమాబాబు, బాధ పెట్టకుడి బాగూచేయండి కల్లునేర్పొద్దు కనికాంచండి, పందినివ్వొద్దు ప్రార్థింతుమండి, కొట్టతిట్టొద్దు మమ్మూలనండి ఆడవారిపై యింత అన్యాయమొద్దండి ॥అం॥

మీకుదానుడనైయ్యి, మీ పాదాలుపట్టి. చెప్పియుంటీని నా యొక్క మొరను, దాటిచెయ్యొద్దు, ధనమంతులార, హింశపెట్టొద్దు హిందూవులార కుక్కల రీతి కొట్టాగరాదు, సవర్ణస్త్రీలతో సమముగాచూడండి ॥అ॥

నక్కా చినవెంకయ్య
1935

# 7. కీర్తన

(నిన్ను నమ్మర కచుడనన్ను పెండ్లియాడు అను మాదిరి)

ఆదిమాంధ్రులంతా మీరు అందరు, రారన్న భక్తిమీరగ రామచంద్రుని ప్రార్థనచేయుదుము ॥అం॥

భజనకు వెళదాము మనము పదిమందితోపాటు గుళ్ళోవుండె రామచంద్రులకు పూజలు చేదాము ॥అం॥

హరికథలకు వెళ్లి, మనము అందరి సరసననూ, సరసను కూర్చుని సంతోషముతో ప్రార్థింతుము దేవున్ ॥అం॥

దేవాలయములోని మాన దేవుని చూతాము. అంటుదోషమెల్ల నచ్చట మంటపెట్టుదాము ॥అం॥

దేవునికి అంటు ఏచ్చట కానరాదు వినుడి, సృష్టికర్తయౌ భగవంతునికి అంటెచ్చటగలదు ॥అం॥

నూతులోని నీళ్ళు మనము చేదుకుందమన్న, బావుల దగ్గర అంటుదోషము పారదోలుదాము ॥అం॥

యాత్ర చేయునపుడూ మీకు ఎందుకు కష్టాలు, చెప్పెద వినుడి మీకు మంచి, సదుపాయము వినరన్న ॥అం॥

సత్రములకు నేగి, మీరు శ్రమలుదేర్చుకొండి చేయుడి మీరలు పై రీతిగను భయములేదు మీకు ॥అం॥

జడియవద్దు మీరు హరిజన అన్నదమ్ములార, హక్కుల కొరకు మనమెల్లరము అడుగుదాము రండి ॥అం॥

గాంధిబాబు మనకూ మంచి కన్నతండ్రికాద, వారు చెప్పిన హరిజన బోధలు వినుడి మీరలంత ॥అం॥

అగ్రజాతులార మీకు మ్రొక్కుచుంటి నేను పైన చెప్పిన పాటలన్నిటికి ప్రశ్నలడుగవద్దు ॥అం॥

ప్రశ్నలు వేసెటి కాలము పారిపోయినాది, అంటుదోషమును రూపుమాపుడి అడుగుడయ్య వెనక ॥అం॥

వినుడి చెప్పెదాను మీకు వినయుడనేనయ్య, నక్కా వెంకయ్య బోధలు వినుచు మానుడయ్య అంటు ॥అం॥

నక్కా చినవెంకయ్య
1935

# 8. అంటుదోషం

వినరయ్యామాదుమొరనుమీరు వినజెప్పెదాము వినయముతోను మీకు
మేము ఆదిమాంధ్రులము. ఆంధ్రదేశమున అన్నములేకను అడలు
చుంటిమి ॥విన॥

పన్నిండుమాసమూలు మేము, పనిచేయుచునుండిన, పలమేమిదక్క-
దండి మాకు పండిన ధాన్యమునంపియు తెచ్చితె పలకరించకను
పంపెదరింటికి ॥విన॥

నడివీదులందుబాబు మేము, నడవారాదంట నడచీతె నరకమంట బాబు
తక్కువెక్కువని తలచుచునుందురు తక్కువెందుకొచెప్పుడి మీరు ॥విన॥

తెల్లదొరలొచ్చిమమ్మూలాను ప్రేమించుటచూచి, నేర్వాలేరయ్య వారిదారి
విద్యావంతులుమాలోనుండిన హీనముగాను జూతురుమీరలు ॥విన॥

పోగోట్టడంటుదోషమునెల్ల ప్రియమొప్పగాను హిందూవుల గ్రవర్న్మము.
వారు అంటుదోషమనుపేరును మాపితె అప్పుడెవచ్చును రాజ్యము
మనకు ॥విన॥

నక్కా చినవెంకయ్యా
1935

## 9. జీవహింస

జీవ జంతూవులన్ నీవలె చూడు, జీవజంతూవులన్ ఎండీవలె జలమూలో
నుండు చేపలపట్టి బండపై జంపాకు ఓ ప్రియసోదర ॥జీ॥

గడ్డిమేయుచు ఆవుల్ బిడ్డలకు పాలొసగు చెడ్డచేసిన తినకు ఓ ప్రియ
సోదర ॥జీ॥

ఆకులు అలములు మేసి మీకు మేలును చేయు మేకాల జంపాకు ఓ ప్రియ
సోదర ॥జీ॥

పచ్చిక తిని గొఱ్ఱెల్ బొచ్చు కొంగళిసాల్వల్ యిచ్చేవానిని తినకు ఓ
ప్రియసోదర ॥జీ॥

సూకరంబుల తిండీ నీకు ఏరుకవాని అకలి అని దినకు ఓ ప్రియ
సోదర ॥జీ॥

దున్ని ధాన్యములాను ఎన్నో యొసగును ఎడ్లు దున్నపోతుల దినకు
ఓ ప్రియసోదర ॥జీ॥

నక్కా చినవెంకయ్య
1935

# అంటరానితనానికి మంట

యికనైన మేలుకొందీ మనశికిదేదినమనిరండి, జయ్ శంకరాయని
రండి, జన్మహక్కులను కోరండి ॥యి॥

హాయెండ వానలకోర్చి ఏడాది కష్టముచేసి ఫలమంత పరులా సొమ్ము
తినసోటమనకుదుమ్ము ॥జయ్॥

చేయూదమంటె కూలిపోవూదమంటె నాలి యేవిలేవో రెండు తప్పా
మానుకుంటె చేతచిప్ప ॥జయ్॥

వుండాగనిల్లేసున్న పండాగనేలేదన్న, వండపోయలేదోరన్న మనబ్రతుకు
దెరువేదన్న ॥జయ్॥

ఏ దానికైనా మనసు లేకున్న జరుగదు నిజము మన సేవ మానుకున్నా
దేశానికన్నముసున్న ॥జయ్॥

మానావ జన్మమెత్తి హీనులమై మనమిట్టి బానిసము చేయరాదు మనకేమి
పరువుకాదు ॥జయ్॥

వాల్మీకి వ్యాసశుకులు వారంత మనపితమహులు మనవంశ కర్తలపేరూ
ఎరుగనట్టివారెలేరు ॥జయ్॥

దేవాలయమునకుబోయి దేవూని చూతమోయి మన అంటరాని తనము
యిక మంటబెట్టుదాము ॥జయ్॥

"నల్లదొరకవి" కుసుమ ధర్మన్న
1935



# నల్లదొరతనము

కుసుమ ధర్మన్నకవి

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయోవర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః (మనుస్మృతి)

క॥ "వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపవలెన్
గని కల్ల నిజము తెలిసిన
మనుజుఁడెపో నీతిపరుఁడు మహిలో సుమతీ."

గౌళవంతు - ఏకతాళం

ప. మా కొద్ది నల్లదొరతనము - దేవ మా కొద్ది నల్లదొరతనము॥
॥బాబు మాకొ॥

అ. మాకు పదిమందితో పాటు - పరువు గలుగకయున్న ॥మా కొ॥

1. వర్ణాశ్రమ ధర్మాలు - వదలి తిరుగుటచేత - వచ్చేను వెలి మీకంటారు
వేదాలు బ్రాహ్మణులు వదిలేరు - క్షాత్ర ధర్మమును మానిరి క్షత్రియులు
కులవృత్తి మరచేరు కోమట్లు - శూద్రులు.... సేద్యము మానిరిప్పుడు
యిందు వర్ణాశ్రమ ధర్మము లెక్కడండీ - తండ్రీ ॥మాకొ॥

2. పన్నెండు మాసాలు - పాలేరుతనమున్న - పస్తుబడుచు బ్రతుకాలండి
తలి కూలిజేసి తీరాలండి - పిల్లగాడు పశువుల గాయలండి
మేమంతా కష్టపడ్డనండి - కట్టగుడ్డా కూడు గిట్టదండి
అప్పుతీరదీ చిత్రమేమండి - దేవ, కనికారము లేక కడుపు మార్చేరండి
॥మాకొ॥

3. కాపులెల్లపాలి - కాపులైనమమ్ము - అమ్మ యాలని తిట్టేరు -
దరిజేరిపైబడి తన్నుతారు - రక్తమాంసాలన్నీ పిండితారు
పంటలన్నీ పండించుకుంటారు-దేవ, మాలమాదిగలంటె-మండిపడిపోతారు
॥మాకొ॥

4. పాడి పంటలు మేము కూడబెట్టితేను - కూర్చోని తింటారు వారు -
లేని అప్పులెన్నో పెంచుతారు - చంపగొట్టి కొంపలాగుతారు -
కొట్టి తిట్టి కోర్టుకు లాగుతారు. దేవ, కూడుగుడ్డ కొంపలేకుండ కూల్చేరు
॥మాకొ॥

5. నీతి జాతి లేని - నీచులమని మమ్ము-నిందించి బంధించుతారు -
లేని లేదాలెన్నో చాటుతారు - నీతిజాతి వారే నిలుపలేరు -
చేయకూడని పనులెన్నో జేసేరు - మా, మాలమాదిగలంటె
మండిపడి పోతారు ॥మాకొ॥

6. కుక్కనక్కలకంటె - తక్కువగా జూచి - పెక్కుబాధలుబెట్టెదారు
పిల్లికంటె పాపిష్టులంటారు - కాకి కంటేను కొరగామంటారు
పందులానింట తిరుగనిస్తారు - దున్నాలను వాకిండ్లనుంచేరు
మానవులైన మమ్మంటుకోరు - వారి పాపమేమోగాని పండిపోయిందయ్యో
॥మాకొ॥

7. కటికి వారితోను కలిసి గూర్చుంటారు - కంపు లేదూ లేదంటారు -
భాయి భాయని పాకులాడుతారు - నూతినీళ్ళను తోడనిస్తారు -
విందులెన్నెన్నో అందుకుంటారు-దేవ, కటికి వారికంటె కడు నీచులైతిమా
॥మాకొ॥

8. ఎరుకలి యేనాదూల నెగ్గుపట్టక వార్ని కలుపుకోని తిరుగుతారు -
సెంచు లంబాడీల నంటుతారు - చాకలంటె సహించుకుంటారు -
మంగలంటె మన్నించుచుంటారు - మా, మాలమాదిగలంటె -
మండిపగిపోతారు ॥మాకొ॥

9. సంగీతమూలనుచు- సానూల రప్పించి- దేవాలయములోనికంపుతారు
దేవుని కేటేట పెండ్లిజేసేరు- వారితోగూడి సంభోగించుతారు-
తెల్లదొరలనైన రానిస్తారు- మా, మాలలొస్తానంటె మండిపడిపోతారు
॥మాకొ॥

10. పడవలందూ రైలు ప్రయాణములందు - మమ్మంటగూడదంటారు
మాలలంటేను మండిపడిపోతారు- క్రైస్తవులంటెకయ్యామాడారు
వారి శాస్త్రిలక్కడ సాగిరావు- దేవ, అనునుగానిచోట్ల అంటే
లేదంటారు ॥మాకొ॥

11. కోర్టులందూ గ్రామ కచ్చేరులాయందు- కఠిన బుద్ధి జూపుతారు
దూరదూరమంటు గెంటుతారు- మామూలంటూ లంచమడుగుతారు
మాట చెప్పితే వినిపించుకోరు- వారి మాయమంత్రాలన్ని
మందీ పాడై పోను ॥మాకొ॥

12. మేము నిలిచినచోట వారు నిలువబోరు - భూమికి అంటేనంటారు-
అగ్గిముట్టితే యెగ్గు పట్టేరు- గాలి తగిలిన మయిలేనంటారు -
మేము అంటిన వస్తూవంటుకోరు- దేవ, మతధర్మములన్ని
మంటబెట్టేశారు ॥మాకొ॥

13. కాయకూరలు మేము - కానుకలిస్తేను - కమ్మగా పుచ్చుకుంటారు -
పండ్లు, ఫలములు మేమిస్తే తింటారు-ధనము మేమిస్తే తాకుచుంటారు
మాచే సేవ జేయించుకుంటారు- దేవ, అవసరముంటె వారికంటే
లేదంటారు ॥మాకొ॥

14. మాలలంటినదాన్ని మేమంటుకోమని - హెచ్చుగ బహు చెప్పుతారు-
ఆసుపత్రీ మందూలడుగుతారు - మాలమందులక్కడ తాగుతారు -
పాలు పితికిస్తే పుచ్చుకుంటారు - దేవ, మందూ మాట మరచి
మాల మాల లంటారు ॥మాకొ॥

15. రథోత్సవములందు - రహదారులయందు- రానూకు తిరుగూదురంట-
నడివీధిలో నడచితే తంటా - త్రోవ తొలగకుంటే వఖ్ఖమంట
నీళ్ళరేవులో బహునిక్కులంట - దేవా, బజారులయందు యిక
పర్వాలేదంటా ॥మాకొ॥

16. దారిలోమముజూచి- దూరదూరముగాను- తొలగిపోయెదరయ్యోరామ-
మేము మీతోడి నరులాముగామ? తరిరిమి కరిచే తాచుబాములామ?
పట్టిలాగే రేగుకంపలామ? భయముపుట్టించే దయ్యములామ? కనిగుట్టే
కందిరీగలామ?- అయ్యో చిన్నబుచ్చెదరేల యిది మీకు ధర్మామ?
॥మాకొ

17. పొలముపనులూచేసే తరుణాలలో మమ్ముతాకిన తప్పూలేదంట
వారు మేము కలబడువచ్చునంట- కాళ్లుతగిలినా పర్వాలేదంట-
మాతో చేతూలుకలపొచ్చునంట- ఇంట్లో ధాన్యాలు పోయవచ్చునంట-
మాతో, యేమిపని లేనపుడు - యెడముండాలంట ॥మాకొ॥

18. హిందువు లారాధించు దైవాములనెల్ల భక్తితో పూజింతుమండి
జుట్టుబొట్లు కట్టు ఒకటేనండి - యెల్లరొక్క దేశీయులమండి
వారి తోడునీడ మేమెనండి - మియ్యసాహెబుల మన్నింతురండి
వారి యన్నదమ్ములమండి - మమ్మంటుకోరండి ॥మాకొ॥

19. అంగళ్ళవస్తువులమ్మి - బ్రతుకుదమంటె - అంటుపాటించేరసుండి
అంట్లుతోమైన బ్రతుకానీరండి - పదిమందితో పనిచేనీరండి
లాభమెందున పొందనీరండి - దేవ, బంట్రోతు పనిజేసి బ్రతుక
నివ్వరు తండ్రి ॥మాకొ॥

20. కల్లుత్రాగొద్దని - కడుదయతో చెప్పి - బుడ్లేపూర్తిగ త్రాగుతారు
కోడిగుడ్లు గోమాంసము తింటారు - కల్లుపాట కొల్లగ పాడుతారు
కల్లుపాక మాటెంతనుంచేరు - మాయిల్లూ వళ్ళంతాయు గుల్లాజేసేరండి
॥మాకొ॥

21. వేదశాస్త్రిలన్ని వెలసినట్టి పుణ్యభూఖండ మిదేనంటారు
దేవతాలుండె దేశమంటారు - ఋషులు పుట్టినస్థానమంటారు
ధర్మమార్గమూను దాటామంటారు - దేవ, బానిస పనిజేసి బ్రతుకు
చుంటారంటారు ॥మాకొ॥

22. గాంధీమహాత్ముడు - కరుణతో మమ్మూల - గాపాడమని చెప్పుతారు
అంటరాని తనమే లేదంటారు - గాంధి గాంధాని కలవరిస్తారు
వానిశిష్యూలమని తిరుగుతారు - గాంధీ బోధా మరువలేదంటారు
మా, మాలమాదిగలంటె మండిపడిపోతారు ॥మాకొ॥

23. స్వాతంత్ర్యమంటారు - సభలెన్నో జేసేరు - గాంధీకి జయ్ జయ్ యంటారు
దేవ, హిందూ ముసల్మాను లేకమై యుండమంటారు - మన ఇద్దారు
- గట్టమంటారు
శాంతమే స్వారాజ్యమంటారు శాంతి సైన్యామంటూ నిలుపుతారు -
మా, మాలల సంగతి యేమి మహిమీద చెప్పారు ॥మాకొ॥

24. శాస్త్రిలు వేదాలు చదివినట్టి గొప్ప శాస్త్రిలమని చెప్పతారు
విద్యావంతులమని పలుకుతారు - గొప్ప కవులమని చెప్పతారు.
శాస్త్ర ధర్మము లెన్నో చాటేరు - సర్వజను లన్నదమ్ములంటారు
మమ్ము మాల మాలను మాట - మాసూలు దప్పారు ॥మాకు॥

25. బ్రాహ్మణులమనియేరు - బహువిప్రవీగేరు - బ్రాహ్మణత్వము మరచినారు
వేషభాషాలతో తిరుగుతారు - తమకంటె ధన్యులూ లేరంటారు -
మత ధర్మాలు మంటాబెట్టేరు - పరమ బానిసలై బ్రతుకుచున్నారు
మా పంచములె బానిసలంటారు - వారి వేష భాషాలేమొ నేడే మాడి
మంటడిపోను ॥మాకొ॥

26. అచ్చరాలు నేర్వ - ముచ్చటున్నాగాని - చదువుబడిలో జేరనీరు
చదువు చదివితె సహించుకోరు - విద్యలేదని వెయ్యి తిట్టేరు
సరివారీనిదరికిరానీరు-దేవ, వేదాలంటా మేము వినరాదంటబాలు ॥మాకొ॥

27. స్వంత పరిపాలనా జేసెదమంటారు - చెంతాకు మము జేరనీరు -
శర్మగారిని శరణన్నలేదు - గుప్తగారిని గురువన్న లేదు -
కాపు కరణాలకు కరుణలేదు - దేవ, వర్మాలకు మేము దుర్మార్గులమంట
॥మాకొ॥

28. దిక్కు-మొక్కు-లేని-దీనులమని మమ్ము-వక్కరు దయతోజూడారు
పరహితమే పురుషార్థమంటారు-భూతదయ నీతిమార్గమంటారు
ఆత్మవత్సర్వ భూతాసంటారు-మా, మాలమాదిగలంటె-మండి
పడిపోతారు ॥మా॥

29. హిందూ మతస్థూలే-యిక్కట్టుమముబెట్ట-యేరీతి బ్రతుకూదుమండి
పండితూలకు దయలేదునుండి-విద్వాంసులున్నారెందుకండి
మహాభక్తులెందున్నారొసుండి-కవులు వ్రాయరు మా బాధ చూడండి
దేవ, యెందుబోయెదమండి-యెవరు మాదిక్కండి ॥మాకొ॥

30. పలు యుగములనుండి పగబట్టూటచేత-యూరికి దూరమైనాము
గ్రామ మునసబులాకు ఘనముగాము-ఊరి కరణాలకు కంపుమేము
కాపు కమ్మవారికి కలిసిరాము-దేవ, దేశామందారికి వాసనైపోయాము
॥మాకొ॥

31. నలుగూరితో పాటు-నాటకములు మేము చూడగబోతే రానీరు
హరికథ లాలకించ రానీరు-ఆటపాటలు మముజూడనీరు
సభలో సరసన కూర్చోనివ్వారు-వారి శాసనాలన్నియు నాశనమైపోను
॥మాకొ॥

32. వారు వీరను వాదభేదమేమి లేక-భూమి మోయుచున్నదండి
గాలి మీకు మాకు ఒకటేనండి-మీకుమాకు వర్షము గురియునండి
రాత్రిపగలు మీవలె మాకునండి-వెలుగు వేడియు గలదు మాకండి
సృష్టిలో భేదమేదీ జూపండి-యీపాడు మూఢాచారమెందుకు మీకండి
॥మాకొ॥

33. మీ తల్లి దండ్రూలు మిమ్ముగన్నట్టూల-మావారు మమ్ముగనలేద?
మీకుమాకుపుట్టు వకటి కాద? రక్తమాంసము నొకటిగాద!
కష్టసుఖము మీకె మాకు లేద? మీకు మాకు దేవుడొకడుగాద!
మతము మీకుమాకు నొకటిగాద? వాదా భేదమేల యిది మీకు మర్యాద?
॥మాకొ॥

34. అతివాదులంటారు-మితవాదులంటారు. వాద ప్రతివాదామాదేరు-
మాబాధ కళ్ళారాజూచేరు-మోటారు బండెక్కిపోతారు
మీమాట మరువలేదంటారు-దేవ, మంత్రూలందరు పరతంత్రులైపోయారు
॥మాకొ॥

35. అమెరికా దొరలూ మమ్మాదరించుట జూచి - వారిలో జేరొద్దంటారు
బరులు దయతో జూచితె యోర్వలేరు - ఒంటినిండా గుడ్డెందూకంటారు
గోచి గుడ్డ కట్టె గోటంటారు - దేవ, నోరులేదని మాకు దారే
లేదంటారు ॥మాకొ॥

36. ఆకలి చిచ్చు చేత నడలీ చచ్చిన గాని - అన్నసత్రము మాకులేదు
మంచినీళ్ళ చలివేంద్రయిన లేదు - వైద్యశాల మాకెందూన లేదు
చదువు నేర్పు పాఠశాల లేదు - మేము, మనుష్యులమన్న మాట -
మరచిపోయారండి ॥మాకొ॥

37. ఘోర రోగాలతో - కూలబడితె మాదు - బాధ కన్నెత్తి చూడరు
మా కష్టమంతయు తింటారు - కూడు గుడ్డాకు లోటు జేసేరు
మమ్ము గొల్లూన గోలెత్తిస్తారు - వారి నిర్దాయత్వము మంటగలసిపోను
॥మాకొ॥

38. మా కళ్ళు దుమ్మేసి మాకున్న మాన్యాలు గదుమూకోని కలుపుకుంటారు
అప్పులిచ్చి కొంప ముంచుతారు - పిచ్చకుంచాలతో మాకిస్తారు
హెచ్చుగా వారు పుచ్చుకుంటారు - బానిసవృత్తి చేయమంటారు
ఊరికి దూరముండమంటారు - మా గుణము ధనము చెరిపి కూడు
తింటారయ్యో ॥మాకొ॥

39. కాపురములుజేయ పూరిగుడిసెలె గాని మేడ మిద్దెలు మాకులేవు
తినకూడు కట్టగుడ్డ కానరాదు - ముంత పొలము కాసంతైన లేదు
ధనవంతులకేమి దయలేదు - దేశమందారికి మేము చేదు
మా దారిద్రియము జూడ - ఎవరికి దయరాదు ॥మాకొ॥

40. స్వారాజ్యమనుచు సర్కారుతో పోరాడి - స్వాతంత్రీయ మడుగుతారు
మాకు స్వాతంత్రీయ మివ్వబోరు - గుడిగోప్రాలకైన రానీరు
సత్రములందు మమ్ముండనీరు - నూతి నీళ్ళన్న తోడుకోనీరు
మాలలంటె హక్కులేదంటారు - మాకు హక్కులేదంటె స్వారాజ్య
మెక్కడదక్కు ॥మాకొ॥

41. పల్లె కూటములాకు బాహాటముగా మమ్ము - వచ్చి చూడానివ్వండి
వీధులన్నిట నడువానివ్వండి సభలకు మమ్మూ రానివ్వండి
నీళ్ళరేవులో ఎగ్గు వీడండి - మీ సంపదమే గోరమండి
మమ్ము అన్నదమ్ములరీతి యాదుకోనండి ॥మాకొ॥

42. మా వంశమున బుట్టి - మహిమ గాంచిన యట్టి మానవులను గానరేల
వేదవ్యాసుండు మావాడుగాడ? - వాల్మీకి గోత్రము మాదిగాద?
శుకుడు మా వంశమున బుట్టలేదా? పరాశరుని కులము మాదిగాద?
వారు మావంటి మాలలుగారa? మా కులము తక్కువైతె గుణమే
లేదంటార? ॥మాకొ॥

43. మాకు వైష్ణవమిచ్చి - మమ్ముద్ధరించె ఘనుడు యారామానుజుండు
ఆదరించె శ్రీ దయానందుడు - మన్నించె వివేకానందుడు
ధన్యులాజేసెగ చైతన్యుండు - గౌరవించె ఘనుడు శ్రీనానక్కు
కరుణ జూపె గాంధి మహాత్ముండు - వారి, బిడ్డలైన మాకీ గడ్డు
తనమెందుకో ॥మాకొ॥

44. మా వంశమున బుట్టి - మహిని రాజ్యము జేసినట్టి - రాజులు గానరేల?
ప్రమగందూడు మా రాజు కాడ? కీకట దేశము మాది గాద?
కుయవృందు మా నాయకుడు గాద? వాలిసుగ్రీవుల్మావారుగార?
కన్నమానీడు మాయన్న కాద? యెన్నొ సంబంధములున్న వరయ -
మా, లోపాలు మీవల్ల దాపురించెనయ్య ॥మాకొ॥

45. కందళా (?) తిరుప్పణ్యాళ్వారులు - నందనాది భక్తులుమావారండి
ఆరంజ్యోతి మా యాడబడుచండి - వశిష్టుండు మా యల్లుడండి
శబరి సారంగి మా తల్లులండి - కన్యమాతంగి మా యక్క సుండి
సత్యవతి మాదు జననీ సుమ్మండి - వారి కీర్తి వెలిగింప - మూర్తీభ
వించితిమండి ॥మాకొ॥

46. అభిమాన పుత్రికలని మా కుల స్త్రీల విశ్వామిత్రుడు గౌరవించె
లోకమాత్రై ఆరంజ్యోతి మించె - గౌంతిదేవి మాకిలవేల్పై నిల్చె
వాల్మీకి మహకీర్తి గాంచె - కాళిదాసూ మాలో నుద్భవించె
హరిశ్చంద్రుడు మా సేవజేసె - లోక, మెందు జూచిన నందు లేక
యుంటిమి దేవ ॥మాకొ॥

47. సీత కొరకై రామభూపాలుడు దిక్కుగానక తిరిగినగేనాడు
అతని దిక్కై నిలచిన వారెవ్వరు - సీతజాడ దెచ్చిన వాడెవ్వాడు -
రావణుని జంప మూలమెవ్వారు - రామ దుఃఖము బాపినదీ మా వారు
దీనులకెల్ల దిక్కు మావారు - మా యతిథులై వచ్చి మమ్మణగ
ద్రొక్కితిరి నేటికి మీరు ॥మాకొ॥

48. మా కష్టముల నెల్ల మనవిజేయగ దివికి వేంచేసెను మహిత ఘనుడు
బాలముకుందు ధీరుండు
రావిచెట్టు.... ... లాల్జి సతిగారు హీరాబాయమ్మ
వారి... .... దేవుండు యేడుకోట్ల జనసంఖ్య మాదండి.... ....
కడతేరగా లెందు ॥మాకొ॥

53. గవర్నమెంటువారు గయ్యాళి భూములు సాగుకై మాకిచ్చినారు
ధర్మచదువు చెప్పించుచున్నారు - స్వేచ్ఛమాకు దయిచేసియున్నారు
మాదుబాగోగులరయుచున్నారు - మాకెంతో ఉత్సాహమిచ్చుచున్నారు
మమ్ము గౌరవించుచున్నారు - మా, పేరెత్తితే మీకు పెద్దదోషముబాబు
॥మాకొ॥

54. ఆత్మగౌరవ సంఘమను పేరు మాదేశనాయకులంతాగూడి
మమ్ము దేవాలయమునందుచేర్చి దేవతాదర్శనమే ఇప్పించి
రానివ్వని చోటెల్ల సత్యాగ్రహముచేసి, వారు బెట్టు బాధలకన్ని నోర్చి
మాకు హిందూ సంఘమునందు స్వాతంత్ర్యమగువరకు ॥మాకొ॥

55. ఎట్టిపేర మమ్ముపట్టి తెప్పించి - వారు కష్టబెట్టుచుందురండి
పలువిధముల హింసింతురయ్య, పైయధికార్లు వచ్చినట్లయిన
వారి గుఱ్ఱాన్కి గడ్డిపుఱ్ఱాన. వారి వంటకు కట్టెలు పుఱ్ఱాన,
తెచ్చిపెట్టుకున్న దెబ్బలండి, కూలి బత్తమడిగిన తన్నులండి
ఆకలి దప్పియైన విడువరండి, రోగమొచ్చిన పర్వాలేదంటా
భార్య ప్రసవమైన యెట్టి తప్పదంటా-దేవ, ఈలాటి దౌర్జన్యమడుగంటు
వరకండి ॥మాకొ॥

56. ఓ దేశీయులారా! మా దీనాలాపము దయతో, వినుడు లేకుండా పరాకు-
వింటెకలదు ముక్తి మీకు మాకు - స్వార్థత్యాగులై మీరుండువరకు-
మాపై భ్రాతృ భావము జూపువరకు - జాతి భేదామడుగంటువరకు-
అంటు మంత్రై మాడిపోయేవరకు - మీరెల్ల మా హితమునరయువరకు-
మా ధర్మన్న బోధ మీరాలకించండి ॥మాకొ॥

49. మాకు చదువు నేర్పి మన్నించె - శ్రీ చిలకమర్తి వంశ చందురుండు
లక్ష్మీనరసింహాన్వయ కవిధీరుండు - విదిత వీరేశలింగామాత్యుండు
మాదు కష్టాల వ్రాసె ననఘుండు - మంగిపూడి వేంకట కవివరుండు
ధర్మోపదేశక ధీరుండు ఆదిపూడి సోమనాథరావుండు - ఆచార్యవర్య
సజ్జనుండు బాజీకృష్ణరావు పంతులుండు - దేశసేవక పతివత్న్యులైన
ఆర్య గయాప్రసాదుగారుండు - దేవ, కనుపించరీలాటి ఘనులెవ్వరును
నేడు ॥మాకొ॥

50. మమ్ముద్ధరింపగ మహిని శ్రీపీఠిక పురనేత వెలసి యుండేను
రాజాప్రతాపగీరుగారుండెను - గోస్వామి ధనరాజగీరుండె -
లాల్‌గిర్ బీర్‌ఖాన్ గిరులుండిరి - వనపర్తి సరేంద్రుడుండెను
మహారాణి గద్వాలు గారుండె - శ్రీ మునగాల నృపేంద్రుడుండె
రాజా వెంకట రామారెడ్డి యుండె - దేవ, ఉదయించినారు మమ్ముద్ధ
రింపగ వీరు ॥మాకొ॥

51. మీ జాతిలోన బుట్టి మాకు నాయకులైన, మా చెంత నీడై యుండె
భోగ (?) రాజా చెన్నపురిలో నుండె, ఏలూరు పురమందు దేవ,
కృష్ణుడుం (?) డె, హైదరాబాదున భాగ్యరెడ్డుండె,
వల్లాటి శేష...... మాదరి ఆదయ్యగారునుండె, అరిగె రామ
స్వామి గారుండె (?), బత్తుల వెంకటరావుగారునుండె దువ్వల
చెన్నకృష్ణయ్యగారుండె, గద్దం సేవకదాసుగారు నుండె, మాదరి
వెంకటస్వామి గారుండెను, దేవ, వాల్మీకాశ్రమములో ధర్మన
కవియుండె ॥మాకొ॥

52. మాదీనదశజూచి మదిలోన దుఃఖించి మాతోడు నీడై యుండెవారు,
ఆర్య బ్రహ్మసమాజము వారుండె, జీవరక్షమండలి వారుండెను, పండిత
కేశవరావు రాఘవేంద్రుడుండె, ధర్మవీరుండు వామననాయకుండు,
దేశభక్తుండు శ్రీకృష్ణుడుండె, సాధుశీలుండు వెలెంకరుండె,
సింఘ్వీగణేశమల్ లాల్జిగారుండె, శి. రఘునాథ్‌మల్ మోతిలాలుండె,
మాడపాటి హనుమంత రావుండె, వడ్లకొండ నరసింహారావుండె
జానకిరామయ్య
శ్యామరావుండె, మాకు తోడు నీడై సర్వదా నిలిచియున్నారు ॥మాకొ॥

## దళిత ప్రార్థనా గీతం
### (డాక్టర్ అంబేద్కరుకు)

జయ జయ జయ అంబేద్కర !
జయ దళిత జన స్వరా !
    జయ మానవ మందారా !
    జయ భారత భాస్కరా !
నవభారత సంవిధాన
ధర్మ పథక నిర్మాతా !
    భువి సమస్త పీడిత జన
    దుఃఖశాంతి తథాగతా !
వేదాలను శోధించి
వేదాంతము నధిగమించి
    మనిషి మనిషిగా బ్రతుకుటె
    మహిత మన్న మహాశయా !
అస్పృశ్యత రూపు మాపి
అగ్ర అంత్య భేద ముడిపి
    నిష్కల భారత జాతికి
    నీడయైన బోధి ప్రియ!
జాతీయ సమైక్యానికి
మతాతీత రాజ్యానికి
    ప్రజాస్వామ్య ధర్మానికి
    శరణమైన సంఘర్షీ !
జగతికి స్వేచ్ఛా సమతా
సౌభ్రాత్రములను కూర్పగ
    జన్మమెల్ల పోరాడిన
    జనగణ విప్లవ యోద్ధా !
అంధకారమున పుట్టి
అవనికి దీపము పెట్టి

పంకమును మదించి మహికి
పరిమళ మొసగిన సూరీ !
రాళ్ళకు జీవము పోసి
మ్రోళ్ళను చిగురింపజేసి
మట్టి నుండి మానవులను
మలిచిన కారణ జన్మా !

బోయి భీమన్న
దళిత కవిత, 1992

## మాల పేట

వుందర్రా - మాలపేట
ఆ వూరు సివర
కష్టాలు - వున్నసోటా
ఆ వూరు సివర
కాస్టాలు - వున్న సోటా ॥వుందర్రా॥

ఇల్లుమీద రెల్లిగడ్డి
ఎగిరిపోయి - ఎక్కిపోయి
పచ్చిమట్టి - గోడలన్ని
పగిలిపోయి - పిగిలిపోయి
తడక తలుపు బొక్కల్లో
కుక్కలు పిల్లులు దూరి
కుండలు దాకల దొంతులు
తిరగేసిన - తీరవగా ॥వుందర్రా॥

ఆ గుడిసెల గడపల్లో
ముసిలోలూ, ముడగోలూ
కుక్కి మంచాలు మీద
కోడి కునుకు కునుకాలని

గొ్రతిపొట్టు - సీరినట్టు
గుడ్డ గుడ్డ గెంటులేసి
కప్పుకోన కాలు తగిలి
బ్రరుమనే - బతుకులతో ॥వుంద్రా॥

వూరిలోని మురికి నీరు
ఆ ఈదికి పేరుకోని
కుల్లి, కుల్లి వాసనేసి
ఇల్లన్నీ కంపుగొట్టి
సిన్నోలుకు పెద్దోలుకు
పుల్లా బూదులు పుట్టీ
ఈగల దోమల కాట్లుకు
ఇసురుకొనీ - ఉసురుమనీ ॥వుంద్రా॥

పాలుతాగె సంటోల్ని
ఇంటిలోను ఇరికిబెట్టి
తల్లీ - దండ్రీ కలిసీ
కూలి - పనులకెళ్ళిపోతె
పాలూ, నీరూ నేకా
కంకటిల్లి గొంతుకెండి
నిద్దరలో సచ్చిపోయె
దిక్కులేని పిల్లలకు ॥వుండ్రా॥

**వంగపండు ప్రసాదరావు**
వంగపండు పాటలు
**1990**

## మాలయెవడా - మాదిగెవడా

మాల యెవడా
మాదిగెవడా
హిందు జాతికి తర తరాలుగా
బలై పోయిన త్యాగమూర్తులు ॥మాల॥

తక్కువోడని అంటరాదని
కుక్కవోలే మొరగబోకు
మనసే ఉన్న మనిషివైతే
మనుషులందరు ఒకటే గదరా ॥మాల॥

కులం పేరిట సాటిమనిషిని
దూరముంచుట మానరా
అది మానవతకే మచ్చరా
అది హిందు జాతికే శిక్షరా ॥మాల॥

ఈ దేశం మట్టిలోన వెట్టిచాకిరి రూపాన
ఉన్న వాండ్ల సుఖం కోసం
మాదిగ చాకిరే సాగుచున్నది
మాల నెత్తురే పారుచున్నది ॥మాల॥

ఈ భారత జగతిలోన
వారు కూడా మనుషులే
హిందు జాతికే అన్నదాతలు
దిక్కుమాలిన దీన జనులు ॥మాట॥

డా॥ యం.ఎన్.ఆర్. దేశబంధు
దళితుల నిప్పురవ్వలు
1985

## మమ్మడిగెవా రెవరురా ?

మమ్మడిగెవా రెవరురా - ఓరన్నా
మాదేటి బతుకాయెరా॥ ॥మమ్మడి॥

మాలంట - మాదిగంట
ముట్టరా నోల్లమంట
అరిజనుడా, గిరిజనుడా
అంటరా నోల్లమంట
ఎద్దోలె పనిజేసిన
ఎగిసెగిసి తంతన్నరు
జండాలు మారితేమిరా - ఓరన్నా
గుండెల్లు మారాలెరా ॥మమ్మడి॥

ఊరిబయట - వూరి
గుడిసెల్లనె ఉంటన్నము
సద్దిదో - బొద్దిదేదో
సాలనిదే తింటన్నము
కష్టపడి పనిజేత్తూ
కట్టాలనె పడ్తన్నము
సట్టాలు వొత్తేమిరా - ఓరన్నా
చిత్తాలు మారాలెరా ॥మమ్మడి॥

పల్లెల్ల - పట్నాల్లా
పోర్లెనోళ్ళ పెడ్తన్నరు
యెక్వతక్వోల్లమని
యిండ్లు కాలబెడ్తన్నరు
ఆలుబిడ్డల గొట్టి
అరె తమాషా జూత్తన్నరు
పానాలు - మానాలురా - ఓరన్నా
పగబట్టి దోత్తన్నరురా ॥మమ్మడి॥

యస్వీ
"ఉప్పెన"
1977

## పిలుపు

దళితులార ! కదలిరండి !
దళిత హితులు కలిసిరండి
సమసమాజ స్థాపనకై
సమరం సాగించరండి ॥ద॥

కులపిశాచి గుండెలలో
భూకంపం పుట్టినట్లు
మతరక్కసి నరనరాల
డైనమైట్లు పేల్చినట్లు
దోపిడి రాజ్యంబంతట
లావా ప్రవహించినట్లు
పీడితతాడిత ప్రజాళి
చిరుతల్లా కదలి రండి ! ॥ద॥

సింధునగర నాగరికత
నిర్మాతలు ఎవ్వరని?
ఈ జాతిని బ్రతికించే
అన్నదాత లెవ్వరని??
ఆది భారతీయులకిట
బానిసత్వ మేలనని???
—అగ్రవర్ణ - ధనికవర్గ
దౌష్ట్యము నరికట్ట రండి ! ॥ద॥

భుజం భుజం కలుపుకొని
ఇజం నిజం తెలుసుకొని
ఒక్కమాట నొక్కబాట
దళితులెల్ల కదిలిరండి ! ॥ద॥

సమతాధర్మ విధాత
గౌతమ బుద్ధుని దీప్తి
సాంఘిక విప్లవ నేత
జోతిబపులే స్ఫూర్తి
దళితుల వైతాళికుడగు

అంబేద్కరు దివ్యశక్తి
అణువణువున ప్రజ్వరిల్ల
సింహాలై కదలిరండి ! ॥ద॥

రాయి విసిరినోణ్ణి కుక్క
సింగంలా తరుముతుంది
తలుపు మూసి కొడితె పిల్లి
పులిగ తిరగ బడుతుంది
చలి చీమల దండు సర్ప
రాజుని చెండాడు తుంది

కండబలం గుండెబలం
దండిగున్న దళితులార!
"పాలితులుగ ఎన్నాళ్ళని -
పాలకులుగ ఏలాలని"
సామ్యవాద రాజ్యానికి
సారథులం మనమేనని
అంబేద్కరు ఆశయాల
కంకితమై కదలి రండి! ॥ద॥

సవేర
దళిత కవిత, 1992

## అందరము మేలుకోవాలి

అందరము మేలుకోవాలి
మేలుకొని
ముందడుగు వేయాలి
అల్లదిగో
ఆచరణలో చూపాలి.
ధనికులూ పేదలూ - ధర్మానురాగులై
వర్గముల్ బోనాడి - వర్ధిల్ల సమతను ॥అం॥

క్షుత్తుతో కొందరును - కోట్లతో కొందరును
కూడదండోయని వారి - కూడదీయగను ॥అం॥

కలహాలు ద్వేషాలు కక్షలు పెరిగేను
తొలగించివానిని మొలిపించ ప్రేమను ॥అం॥

బ్రాహ్మలా భట్టులా - కమ్మలా కాపులా
విస్తరిల్లే కులభావ మింకి పోవగను ॥అం॥

ఎవరు మీరంచూను - ఏది కులమంచూను
అడిగేటి అలవాటు - అదృశ్యమైపోగాను ॥అం॥

కులములో గోత్రంలో - పిలుపులూ పేరులు
మంచిదీగాదంటు - మానివేయంగాను ॥అం॥

కోపాల తాపాల కులముల జాతుల
పేరెట్టి తిట్టేటి - పెడదారి విడువంగ ॥అం॥

ఆటలా పాటలా - హాస్యాల జాతుల
హేళనా ఎగతాళి - ఎగవిడిచివేయంగ ॥అం॥

పంతాల సమయాన - పరువుకోసము తనదు
కులము పేరెత్తుట - కూనదని చెప్పగను ॥అం॥

సావాస వియ్యాలు - సాటికులమునెగాక
ఎల్లెడల గుణరాశి - వెదకిచూడంగ ॥అం॥

కులకోటరముదాటి - కోలాహలమురేగ
కయ్యాలు పోనాడి - వియ్యాలు పొందంగ ॥అం॥

కులపు గోషలుదాటి - కళ్యాణమాడంగ
స్వాతంత్ర్య మబ్బునని - చక్కగచాటంగ ॥అం॥

వర్ణకుడ్యముదాటి - వైవాహికము నెరపంగ
సౌభ్రాత్ర మెనయునని - చక్కగా రూపింప ॥అం॥

పరతత్వమునువీడి - పరిణయంబాడంగ
సామ్యధర్మము మెరయు - శతసూర్యప్రభనంచు ॥అం॥

సుబ్బారావు
"నవ్యగేయాలు"
1955

# సాంఘిక వేదమా ! వందనం

అణగారిన బ్రతుకులను
వెలిగించిన వాడా !
నవభారత రాజ్యాంగం
వెలయించిన వాడా !
అందుకో అంబేద్కరు
అఖిల ప్రజా వందనం ॥అణగారిన॥

పరిసరాలు వెంటాడుచు
పరితాపం కలిగించగ
విశ్వాసం ఎదనిండగ
విశ్వమంత ఎదిగినావు ॥అందుకో॥

అసమానపు చీకటులను
దెసలంటగ తొలగించగ
భరత చరిత గగనంలో
ప్రభవించిన తేజమా ! ॥అందుకో॥

మానవతా రాగంతో
"మహదా"శయ భావంతో
బ్రతుకంతా పోరాటపు
బాటలలో సాగినావు ॥అందుకో॥

బోధిసత్వ బోధసుధలు
పొంది మరోజన్మమెత్తి
సంఘ ధర్మ సమదర్శన
సిద్ధాంతం మనదంటివి ॥అందుకో॥

సమతా వాదమా ! వందనం
సాంఘిక వేదమా ! వందనం
నూతన యత్నమా ! వందనం
"భారత రత్న"మా ! వందనం ॥అందుకో॥

వేదాటి రఘుపతి
దళిత కవిత
1992

## కదిలినాముర

కదిలినాముర ఖబడ్దారురా
అగ్రకులపు ఉన్మాదుల్లారా!
రిజర్వేషన్లను వ్యతిరేకించే
మనుధర్మపు మూఢాంధుల్లారా! ||కదిలి||

లక్షల లక్షల డొనేషన్లతో
ఉన్న విద్యాసీట్లను పొందుతు
వేలకువేలు కుమ్మరించుతూ
ప్రశ్నాపత్రం ముందుగ బొందుతు
ఆంగ్ల విద్యకే అర్రులు చాచుతు
కులాసాగ కోచింగులు పొందుతు
ప్రతిభావంతులమంటూ పిళ్ళు
పరుగెడుతున్నారో నాయన ||కదిలి||

వీధులు ఊడ్చుతు వెర్రివెధవలు
పాలిష్ చేస్తూ పరాన్న భుక్కులు
రిక్షాలాగే వేషాలేస్తూ
నడివీధుల్లో నాట్యం చేస్తూ
శ్రమజీవుల్నే పరిహసించుతూ
ఉన్మాదంతో ఊగుతూ తూగుతూ
వాడిగోతినే వాడే నేడు
త్రవ్వుకుంటున్నాడో నాయన ||కదిలి||

కండలు పిండి బండలు గొట్టి
రక్తం ఓడ్చి శ్రమటలు గ్రక్కి
ఆనకట్టలే కట్టినామురా
పంటపొలాలను తడిపినాముర
రేయింబవళ్ళు రెక్కలిరుచుకొని
భవనాలను కట్టింది ఎవడుర

మట్టిలో మట్టై తారులో తారై
రోడ్లను వేసినవాడు ఎవడురా
జాతి సంపదను సృష్టించే యీ
పేదల ప్రతిభే అసలు ప్రతిభరా
మార్కులు పొందేవాళ్ళు మాత్రమే
ప్రతిభవంతులెట్లో నాయనా ॥కదిలి॥

దుక్కులు దున్ని సేద్యం చేసి
పైరులు పచ్చగ చక్కగ పెంచి
కోతలుగోసి కుప్పలు గొట్టి
ధాన్యం నులు విత్తనములు
జగతికి తిండి పెట్టినాముురా
భూమిని మింగిన భూస్వామెవ్వడు
పారపట్టుటకు పనికిరాడురా
నాగలిపట్టుట చేతగాదురా
నాట్లేయటమూ అసలు రాదురా
సేద్యం తెలియని సోమరోళ్ళకు
పొలాలు ఎందుకురోరన్నా ॥కదిలి॥

ప్రజల సొమ్ముతో పట్టాబొంది
దాబుదాబుగా డాక్టరు నంటడు
వైద్య వృత్తినే వ్యాపారంగా
జోరుజోరుగా సాగిస్తుంటడు
పేద రోగులతో బేరాలాడి
ప్రాణాలతో చెలగాటమాడురా
లక్షలు లక్షలు గుంజుకుంటడు
బిల్డింగులనే పెంచుకుంటడు
డాలరు మోజులో డాక్టరుబాబు
విదేశాలకే ఎగబడుతుంటడు

నీతిలేని ఈ ప్రతిభను నేడు
పాతి పెట్టరండో నాయన ॥కదిలి॥

రిజర్వేషన్లు భిక్షగాదురా
పీడిత కులాల జన్మ హక్కురా
అగ్రకులాల అరాచకాలను
సంఘటితంగా త్రిప్పికొట్టరా
దోపిడిపాలక వర్గాలన్ని,
ఓటుల కోసం వదవుల కోసం
కంటితుడుపుకివి పెట్టినారురా
రిజర్వేషన్లతో బాధలుపోవు
నిరుద్యోగమూ అసలేపోదు
ఎస్సీ, ఎస్టీ, బీసీలంతా
కూడులేని నిరు పేదలందరు
ఆస్తిహక్కు రద్దుకు కదిలీ
సమరభేరి మ్రోగించగలెండి
పీడిత కులాల విముక్తి కోసం
పిడికిలి బిగించరోరన్నా! ॥కదిలి॥

("భారత దేశం భాగ్యసీమరా" అనే పాట బాణీలో పాడాలి)

శంబూక
"పోయేదేమీలేనోళ్ళం"
1992

# ఒరె ఒరె ఒరె దళితన్నా

ఒరె ఒరె ఒరె దళితన్నా ఇంక లేవరో - మాయన్న లేవరో
ఈ దోపిడి దొంగల గూల్చ - పరుగు దియరో ॥ఒరె॥
కోడికూతా నిన్ను - చీకటిలోనే లేపే
కాడినాగలిపట్టి - దొరపొలము నువు దున్ని
పుట్లకొద్ది పంటదీసి - నింపావు గరిసెల్ని
ఎంతజేసిన పేగుకు మెతుకు లేదురా
నీ పేగులు తిన్నోనికి వాతమెక్కరా ॥ఒరె॥

పగలనకా రేయనకా - తిండి సరిగా లేక
ముడిపడినా నీ నరాలు - ముండ్ల కంచగాజేసి
నీ నెత్తురు సత్తువతో - చెరుకుకు తీపిని బోసి
పంచదార కొనబోతే ప్రాణమొనకెరా
ఆ షుగర్ జబ్బుతో ఒకడు చావబట్టెరా ॥ఒరె॥

బండచాకిరి జేసి - ఒళ్ళంతా గుల్లైతే
బతుకులు బండలుజేసి - బంగ్లానే నువు గడితే
అంటరాని వాడంటు - ఇంటిలోకి రాకంటు
ఊరవతల నీ బతుకుకు గుడిసెవచ్చెనా
ఈ గవర్నమెంటు ఆ గుడిసెను పీకవచ్చెనా ॥ఒరె॥

పారకు ప్రాణంబోసి - పొలమును మరమ్మతు జేసి
సుక్క సుక్క నీ సెమటను - సల్పేట్ ఎరువులు జేసి
పత్తిపంట పండించి - పట్నం నువు పంపిస్తే
పట్టుబట్టలేమో పెద్ద దొరలకాయెరా
పండించిన నీకు పచ్చకార్డు ఇచ్చెరా ॥ఒరె॥

ఈ రామరాజ్యంలో - మన సీతా రాజ్యంలో
చిన్నారి దళిత చెల్లి - చీకటిలో కాలు పెడితే
సినిమాల్లో చూసినట్టు - శీలాన్నే దోస్తుండ్రు
చట్టాలు పేదోల్లకు చెల్ల వంటరో
ఆ చెరచినోళ్ళు రాజ్యంలో - వెలిసినోళ్ళురా ||ఒరె||

ఇందిరమ్మను నమ్మి - ఎగిరెగిరి ఓటేస్తివి
తోలుబొమ్మలాట మనకు - హస్తంలో చూపింది
అదికాదు నను చూడని - అన్నొకడు వచ్చిండు
సినిమాలో ఫైటింగులు - మనమీదే చేసిండు
కారంచేడులో దళితుల చంపినాడురా
ఆ రక్తం తడిసిన గుడ్డలు తొడిగినాడురా ||ఒరె||

మూడేండ్లకు ఐదేండ్లకు - ఓటేసి నీ బతుకు
మారుతున్న ఈ మంత్రుల - చేతుల్లో నీ బ్రతుకు
పాముకు నువు పాలుబోస్తే - కాటు వెయ్యకుంటుందా
నాగలితో దున్నకుంటె పంటరాదురో
దొరలను ఎదురించకుంటె బతుకు లేదురా ||ఒరె||

ఈ బతుకులు మారాలని - మన బాధలు పోవాలని
బాబాసాహెబ్ బాటలోన - భారతావని దళితులంత
దోపిడిపై పోరాడుతు - ప్రాణాలే ఇస్తుండ్రు
వాళ్ళూపిరి అందుకొని లేసి ఉరకరో
దళిత జనుల రాజ్యంకై పోరు జేయరా! ||ఒరె||

కె.పి.
దళిత కళామండలి పాటలు
1992

## మనిషికి మత మేమిచ్చింది?

మనిషికి మతమేమిచ్చెనొ తిరిగిచూడు మానవుడా !
తిరిగిచూసి దానికుట్ర తెలిసికోర పామరుడా । ॥మనిషి॥

హిందువులను ముస్లింలు-ముస్లింలను క్రైస్తవులు
చంపుకునే మహాఘోర మతచరితను మరువకురా
క్రైస్తవ ముస్లిం హిందూ కొట్లాటలు గానరా
పరస్పరం ప్రతిమతం ద్వేషించును గదరా !॥మనిషి॥

మనుషుల నొకటిగ చేసిన మతమేదయినా వుందా ?
మనుషులలో ప్రేమనింపి మానవతను చాటిందా ?
దోపిడి కూటాన్ని మతం పుణ్యాత్ములు అందిరా
శ్రామిక జనసమూహాన్ని పాపాత్ములు అందిరా ! ॥మనిషి॥

పూర్వజన్మ సుకృతాలు పచ్చి అబద్ధాలురా
సోంబేరులు సృష్టించిన పొట్టకూటి కథలురా
మంత్రతంత్ర బాబాలను మక్కెలిరగ దన్నరా !
గీత ఖురాన్ బైబుళ్ళను తగలబెట్ట లేవరా ॥మనిషి॥

సతీసుతులు నిదుర తిండి దేవుళ్ళకు ఏలరా !
విల్లు గదలు శూలాలు వీళ్ళెందుకు పట్టిరా !
అటవిక మానవుని లక్షణాలవ్వీరా
పీడి పుర్రెలో పుట్టిన భయమే మతమయ్యెరా! ॥మనిషి॥

మతభక్తిని వీడరా - మంచిని ప్రేమించరా
మతం మత్తులోనుండి బయటపడితే మేలురా
మతభావాలొదిలేస్తే పోయేదేముందిరా ?
జనచైతన్యం పెరిగే పోరుబాట పట్టరా! ॥మనిషి॥

శంఖారావం
"పోయేదేమీలేనోళ్ళం"
1992

## బతుకు వెలుగు

చిక్కటి చీకటి కమ్మిన బతుకుల్లో
పసిడికి మించిన వెలుగు నిండురా॥

దగాపడిన ఆ గుండెల మంటలు
ఎగసి ఎగసి నలుదెసలు కమ్మురా
దబాయించి బతికేటి దళారులు
మాడి బూడిదై తీరునురా॥

దొరల దురంతాలకు బలియైన
ఓగిరాల, బెల్చి మృతవీరులు
అరుణభానులై ఉదయించెనురా
పోరుకురమ్మని పిలుపిచ్చెనురా॥

హరియె దిక్కని భజనలు విడిచి
హరిజనాళి కదలింది ఉప్పెనై
స్వార్థపరులు సాగించు పెత్తనం
యికపై సాగదు సాగదురా॥

తెలుగుగుండె లోలోని వేదనలు
దళితవర్గాల బతుకు రోదనలు
సొంతం అంతం అయ్యేరోజున
నిఖిల జగతి నవ్వులతో వెలుగురా॥

విగుళ్ళ
-ఉప్పెన-
1977

## దళితులనగా ఎవరురా...?

దళితులనగా ఎవరురా
ధరణిలోని దరిద్రులందరు
దళితులేనుర సోదరా- ||దళితు||

పట్టెడన్నము దొరుకనోళ్ళు
పుట్టెడప్పులున్న వాళ్ళు
బతుకుగడువని బడుగుజీవులు
దళితులేనురా సోదరా- ||దళితు||

కల్లకపటమెరుగనోళ్ళు
కాయకష్టం చేసెటోళ్ళు
సకలశ్రామిక జీవులందరు
దళితులేనుర సోదరా ||దళితు||

కులంపేరిట మతం పేరిట
మనువు వేరు చేసెరా
వృత్తిపనుల తీరుబట్టి
కులములంట గట్టెరా- ||దళితు||

మొలను ముళ్ళకంప
మూతికేమో ముంత గట్టిరి
పీడవారితే తానమాడిరి
పంచముడివని పారదోలిరి- ||దళితు||

నిన్ను కోసిన పాలురావు
నన్ను కోసిన నీళ్ళురావు
నిన్ను నన్ను కోసి చూసిన
ఎరుపు రక్తమే సోదరా- ||దళితు||

జి. అంజయ్య
స్వేచ్ఛ, 1992

# ఎవరే ఈ పోరగాడు

దొర : ఏమే ఎల్లి - ఎవరే ఈ పోరగాడు
యాడికెల్లి వచ్చిండు - ఏమైతడే నీకీడు
ఈనికోసమే నిన్ను - ఇంట్లకెల్లి బిలిపిస్తి ॥ఏమే॥

ఎల్లమ్మ : అయ్యా దొరా - మా అన్న కొడుకు పట్నపోడు
బత్కమ్మ పండుగీడ - బాగ బాగ అయితదనీ
బమసి చూడ వచ్చిండు - బాంచెన్ నీ కాల్మొక్తా ॥అయ్యా॥

దొర : పట్నమొల్ల పోరడాని - పట్టి పట్టి చెప్పాలా
ప్యాంటు ఏసుకున్నడంటే - పట్నమని తెల్వదేంది
సదువుకునే పోరడనే - చాల్బాజే చెప్తుందీ
ఇన్ని తెల్సినీ పోరనికి - వూరి సంగతెరుక లేద
సిన్న పెద్ద మర్యాద - ఏమి లేనట్టుంది ॥ఏమే॥

ఎల్లమ్మ : ఏమయ్యిందేంది దొర - ఒక్కసారెగట్లంటివి
ఎప్పుడు లేందీరోజు - కండ్లు ఎర్రజేస్తున్నవ్
ఏమైనా మా పోరడు - తప్పుజేసెనా ఏంది
జప్పునేందో జెప్పుదొరా - తప్పయితే దండిస్తా ॥అయ్యా॥

దొర : తొవ్వొంటి మా కొడుకు - ఇస్కూలుకు బోయిరాంగ
బస్సు దిగిన మీ పోరని - బ్యాగు జూసి మురిసిపోయి
పట్టుకుంట నిమ్మంటే - లటుక్కున ఇచ్చేసీ
వూరికాడి దాక ఈగు - వూగుకుంట ముందొస్తే
ఎట్టిముండకొడ్కులే - ఎన్కపొంటి నా కొడుకు
చూసిన మా కులపోల్లు - లేసి ఇంటి కుర్కొచ్చి
ముట్టరాని కులపోల్లా - బ్యాగు ఈడు మోసిండని
ఇష్టమొచ్చినట్టు తిట్టి - మూతి మీద ఉంచింద్రు
లుచ్చగాడి లంబ్డీకొడుకు - మా ఇజ్జతంత దీసిండు ॥ఏమే॥

ఎల్లమ్మ : అవునారా వో రామిగా - ఎంతపని జేస్తివిరా
వొచ్చెటోడ వూకెరాక - బ్యాగెందుకు ఇస్తివిరా
దొరసీ గులాపుదాన్ని - మన్నించీ పోరగాన్ని
వూరితీరూ తెల్వనోడు - అందరొక్కటనుకుండు
తెల్వకుండ తప్పుజేసే - తల్వకయ్య సెడు ఏది ॥అయ్యా॥

దొర : ఊరి తీరు తెల్వకుంటె - ఉన్ని బీక వొచ్చిండా
పట్నంలో వుంటేందే - సిన్న పెద్ద కులం లేదా
ఐనా మీ జాతికిపుడు - అడ్డు అదుపు ఏముందీ
సర్కారు మిమ్ములనే - సంకనెత్తుకుని దిర్గే
సాలె మిమ్ములాడనో - గాడనే ఉంచాలే ॥ఏమే॥

పోరడు : ఏందయ్య పటేలో - ఏమో లావు లావు మాట్లాడ్తవ్
తెలువక జేసినదానికి అమ్మలక్కలను దిడ్తవ్
కట్టుకున్న ఆలిలాగ - పట్టుకోని మా అత్తను
ఏమె గీమె అంటున్నవ్ - ఏంది నీ సంగతస్సలు
దొరవైతే నీ ఇంటికి - మాకు గాదు మర్యాదగ
అప్పటి నుండింటున్నా తప్పుడు మాటాపింకా ॥ఏందయ్య॥

ఎల్లమ్మ : ఓయమ్మో వో రామిగా - ఏందిర నీ ఎదురు మాట
వొచ్చినోడ వూరుకోక - చిచ్చుబెట్టెటట్టున్నవ్
పెద్ద దొరలు వూరికాళ్ళు - పిచ్చిగేది మాట్లాడకు
నోరు మూసుకొని ఇంటికి - ఎల్లిపోర కాళ్ళు మొక్తా
వో దొరా పోరగాడు - పట్టింపులు పెట్టుకోకు
పొద్దిమీకెట్యాల్లకిన్ని - పట్నం బస్సు ఎక్కిస్తా ॥అయ్యా॥

పోరడు : అత్తా నువ్వూరుకో - ఈల్ల సంగతంత తెల్సు నాకు
పట్నమొస్తె ఈ దొరలే - కులం కట్టు వొదులుతారు
బస్సులోన సీటిచ్చిన - మనిషి కులం ఏందడుగరు
హోటల్లో తిని తాగుతు - వొడ్డనెవరిదని అడుగరు
ఆడలేని అంటు ముట్టు - వూరిలోనే ఎందుకంట ॥ఏందయ్య॥

దొర : ఎల్లి ఈని హిమ్మతేందే - ఎదురులావు మాట్లాడ్తడు
ఉన్నదే జానెడంత - జవాబేమో చాలిస్తడు
అమ్మో పీన్నాల్లుంచితే - దుమ్ము లేపెటట్టుండు
ఇప్పుడే ఈన్నిడ్చికెల్లి - వొచ్చినూరు బంపించు
తెల్లారిలోపీడు - వూల్లె గనక కనిపిస్తే
కులం దావ బెట్టించి - గుణమొచ్చేటట్టుదంత ॥ఏమే॥

పోరడు : ఎందుకయ్య దొరగారు - అంత ఎగిరి పడతారు
ఉన్నమాట అని ఎవడు - వూళ్ళో బతుక్కుతున్నాడు
ఎల్లె ముందొక మాట - ఎదలరాసి పెట్టుకోండి
వూళ్ళో ఈల్లు లేకుంటే - నీళ్ళు కూడ కరువు మీకు
ఆల్లు పంట దియ్యకుంటే - పూటగూడ గడపలేరు
ఆల్లు ఇల్లు కట్టకుంటే - ఇల్లంటూ లేదు మీకు
ఆల్ల సెమట కన్నీళ్ళే - వొంటిలోని రక్తమంత
అంటుముట్టు అంటు మీరు - మంటలోలె మండుతుంటే
వొంటరిగా వొకనాటికి - బూడిదగా మిగులుతారు
దిక్కున్న దిక్కు ఈల్లు - ఊరు విడిచి ఎల్లిపోతే
అప్పుడు మీ గతి ఏందో - ఆలోచన జేసుకోండి ॥ఏంద॥

మాస్టర్జీ
దళిత కళామండలి పాటలు, 1992

## తుది సమరం

కొసగాలులు విసిరేసిన
నుసి బతుకులు మావీ
కసిగా సంఘం కరచిన
మసి బతుకులు మావీ॥

చరిత్రలో అంటరాని
మానిసులం మేమూ
ధరిత్రిలో ధనస్వామ్యపు
బానిసలం మేమూ॥

అడుగడుగున ఋణభారం
అణువణువున కులశాపం!
దారిద్ర్యం గజ్జెకట్టి
ఆటాడును మాకోసం॥

ఛీత్కారం ధూత్కారం
మా తలపై సత్కారం
వెట్టిచాకిరి పాశం
మాగళాల సుమహారం॥

కుల మతాల చితి మంటల
కమిలే మా బతుకుల్లో
అంతరాల దొంతరలో
చితికిన మా మనసుల్లో॥

అలజడి సంద్రాలిప్పుడు
కల్లోలం రేపాయీ
నేడో రేపో పొంగే
ఒడ్లు తెంపుతాయీ॥

పగరగిలిన అవమానం
సెగలెగిసిన ఈ తరుణం
భూస్వామ్య విధానంపై
సాగించును తుదిరణం॥

కొనగాలులు విసిరేసిన
నుసి బతుకులు మావీ
కసిగా సంఘం కరిచిన
మసి బతుకులు మావీ॥

ఏటుకూరి ప్రసాద్
ఉప్పెన
1977

# ఆస్టల్ పిల్లలన్నా

ఆస్టల్ పిల్లలన్నా.... అపనిందలేస్తరేమి
కండ్లుంటే జూసిపొండి - కథ ఏందో దెలుసుకొండి

ఆ ముక్కిపోయిన బియ్యం - ఆ పుచ్చిపోయిన బియ్యం
పందులకు బెట్టినట్టు - మాకొండి పెడతరండి ॥ఆ॥

పప్పంట జేసి పోస్తరు - నీళ్ళలో పసుపుగలిపి
నోట్లోన బోసుకుంటె - నోరంత చేదుగైతది ॥ఆ॥

వాంతులు బయలు పెట్టి - కడుపుల నొప్పి వస్తే
కరుణించెవారు లేరు - కాపాడెవారు లేరు ॥ఆ॥

నోరంత వాసనొస్తే - పేస్టేసి తోమమంటరు
బొగ్గే పేస్టయ్యె మా - నోరు వాచిపోయె ॥ఆ॥

పశువుల కొట్టమన్నా - శుభ్రంగ వుంటదేమొ
ఆస్టల్ కొంపలన్నీ - అత్యంత హీనముండు ॥ఆ॥

పుణ్యం కూడు అంటు - మదమెక్కినారు అంటు
సదువులు రావంటు - మా నోరు నొక్కుతారు ॥ఆ॥

వార్డెన కాఫీసర్లు - తొత్తులు అయ్యినారు
మా కడుపుమీద గొట్టి - బొజ్జాలు పెంచుతుండ్రు ॥ఆ॥

మేమె మొద్దులాము - బడిలోన ఎవరు లేర
ఆడిపోసుకుంటరేమి - అందరిలో మేమురామ ॥ఆ॥

అణచబడ్డోలకు - రిజర్వేషండ్లుండలన్నా
అంబేద్కరంటేనె - మీ కండ్లు మండిపోయే ॥ఆ॥

నీచజాతోల్లకు - ఆ నీచబుద్ధులంటు
ఎగిరెగిరి పండుతారు - జాతంటె దెలుసుకోరు ॥ఆ॥

ఎనకెవరు లేరంటు - ఈ ఎత్తిపొడుపులేల
పేదోళ్ళమయ్యితేమి - ప్రశ్నించి తీరుతాము ॥ఆ॥

యన్నార్
దళిత కళామండలి పాటలు
1992

# మాల మాదిగ పిల్లులు రెండు

మాల మాదిగ పిల్లులు రెండు - రొట్టెను పొందంటా
హక్కుల రొట్టెను పొందంటా....
పంచుక తిందమన్న కాడ అవి - పీకులాడెనంటా
ఓరన్న తగవు లాడేనంటా.... ॥మాల॥

తగవు తీర్చమని అగ్రకులాల - కోతి నడిగెనంటా
ఆ పిల్లులు కోతి నడిగె నంటా....
ఆ ఛాన్సు కోసమే ఎదురు చూసె - కోతి ఓకే అన్నదంటా
ఓకే అన్నదంటా.... ॥మాల॥

హక్కుల రొట్టెను ముక్కలు చేసి - తక్కెడలేసంటా
అధర్మపు తక్కెడలేసంటా....
అటింతెక్కువని, ఇటింతెక్కువని - తానె తిన్నదంటా
అంతా తానె తిన్నదంటా.... ॥మాల॥

అగ్రకులాల నీతి న్యాయ మీరీతి గున్నదన్నా
ఇలలీ రీతిగున్న దన్న....
ఈ రీతి రివాజు మార్చకపోతే - బతుకు లేదురన్నా
జాతికి బతుకు లేదురన్నా....
అన్నా మాదిగా మాలన్న - మనకెన్ని తగవులున్నా
మన జాతిలో మనమే చర్చకు పెట్టి తీర్చుకుందామన్నా
ఇకపై తీర్చుకుందామన్నా.... (3 సార్లు)

మాష్టారి
దళిత కళా మండలి పాటలు
1992

# దళిత రథం కదిలింది

దళిత రథం కదిలింది
దురితుల గుండదిరింది
సమతకై - మమతవై
సాగి ముందు కెళుతుంది

అధిక అధమ బేదాలకు
అసలు కారణం తెలుపక
కదలి నట్టి రథమిది
దళిత మనోరథ మిది!

అణగదొక్కబడిన జాతి
ఆ మోసం తెలుసుకుంది
తలెత్తుకు తిరగాలని
తపన చెందుతూవుంది

జాతికే జ్యోతిగా
భాసిల్లిన అంబేద్కర్
ఆశయాల సాధనకై
అనవరతం సాగుతున్న

నేరమేమి చేయకుండ
దారుణంగ అణచబడిన
తీరును ప్రజలకు తెలుపుతు
తిరుగుతుంది ఈ రథం

దళిత ప్రజా రథానికి
స్వాగతం పలకండి
నవయుగ నిర్మాణానికి
నాంది గీతి పాడండి

దోనేపూడి మోహనప్రసాద్
దళిత కవిత, 1992

## ఇదీ కథ

కులం కులం అనే
కుత్సితాలు పెంచుకోకోయ్!
కూటికి లేనివాడా!

మనమంతా కాకులం
మనబతుకే వ్యాకులం ॥కులం॥

మతం మతం అనీ
మాత్సర్యం పెంచుకోకు
దరిద్ర నారాయణుడా!
మనకులేదు కమతం
సమతే మన అభిమతం ॥కులం॥

నాది నాది అనీ
వాదులాట చెయ్యబోకు
రెక్కలమ్ముకునేవాడా!
మనకున్నది మనది
ఐక్యతే మన పునాది ॥కులం॥

విజయలక్ష్మి
ఉప్పెన, 1977

## డప్పుగొట్టి దరువెయ్యనా

రెక్కలిరుగ పనిజేసినా - డొక్కలే నిండవులే
అప్పుల బతుకులు మనవి - గొప్పలేమి లేవులే
అప్పు బతుకులు మనకొద్దని
మన బతుకులు మారాలని
అరెరెరెరే........
డప్పుగొట్టి దరువెయ్యనా
నేను గజ్జెగట్టి గంతేయనా
డప్పుగొట్టి దరువేసి - గజ్జెగట్టి గంతేసి ॥డప్పు॥

అన్నా డప్పుతోని - అమ్మా డప్పుతోని
అక్కా డప్పుతోని - చెల్లీ డప్పుతోని ॥డప్పు॥

తెల్లోడు బోయినా - నల్లోడు వచ్చినా
ప్రభుత్వాలు మారినా - ఈ మంత్రులెందరు మారినా
ఈ దోపిడి వ్యవస్థలో - మారనిది మన బ్రతుకని ॥డప్పు॥

పొద్దనక మాపనకా - పొలంలోన పనిజేసి
నీ రక్తం దారబోసి - పంటచేను పెంచినావు
పుట్లకొద్ది పంటదీసి - పూటకు నువ్ జస్తుంటే
పంచబక్ష పరమాన్నం - భూస్వామి షావుకారిది
ఈ సంగతి తెలియరన్నా........ ॥డప్పు॥

నీ ఎముకల మగ్గముతో - పట్టుబట్ట వేసినావు
నీ రక్తమంత రంగుపూసి - నగిసీలు దిద్దినావు
నువు నేసిన పట్టుబట్ట - మేడల్లో మెరుస్తుంది
సంపదకు పునాదేసి - సమాదయ్యి పోతున్నవ్
ఈ మర్మము ఎరుగరన్నా........ ॥డప్పు॥

కులం మతం ఏది లేని - లౌకిక రాజ్యాంగమంటు
పతిపేరుతో చితిని పేర్చి - మానవతను మంటగలిపి
అగ్రవర్ణ దురహంకార్లు - దళితులను చంపుతుండ్రు
రాబందుల రాజ్యమిది........ ॥దప్పు॥

ఎదురులేని హత్యలను ఎన్‌కౌంటర్లన్నారు
లాకప్ మరణాల సంఖ్య - రోజు రోజు పెంచుతుండ్రు
రక్షక నిలయాలు నేడు - భక్షక నిలయాలాయె
పోలీసుల రాజ్యంలో - బ్రతుకురే గ్యారంటి లేదు
తుపాకుల రాజ్యమిది........ ॥దప్పు॥

కులం మతం భాష - భేదమొదిలేసిరా
కార్మికులు కర్షకులు - భుజం కల్పిరా
విద్యార్థులు మేధావులు - గళం విప్పిరా
మనవర్గ ప్రజలల్లో - సంఘమెట్టి సై అంటే
చెలరేగిన సమూహముతో ఒక్కటయి కలిసొస్తే
ఈ దోపిడిని కూలదోసి సమ సమాజం స్థాపిద్దాం ॥దప్పు॥

కె.పి.
దళిత కళా మండలి పాటలు
1992

## మేకమెరం ఖలిగాకన్నో పులిమెరం లేచిరారన్నో

నీళ్ళు కట్టే సీరెడన్నో
బొందలకాడి బేగరన్నో
దప్పులుకొట్టె దుర్గన్నో
చెప్పులు కుట్టె చెంద్రన్నో
నిజం తెల్సుకోరన్నో
నిప్పు రవ్వై మెరిసి రారన్నో
మాల మాదిగ జాతన్నో
నువు మేలుకొంటే ఇక మేలన్నో ॥మా॥

నిజం తెల్సుకోరన్నో
నిప్పురవ్వై మెరిసి రారన్నో
మేక మెరం ఖలి గాకన్నో
నువు పులి మెరం లేచిరారన్నో
కూడు చాలదని కూలి పెంచమని
అడిగిందే అన్నాల మయ్యేనట
కాళ్ళకాడ పడిఉండే టోళ్ళు
కావాలని ఎదో అడిగిర్రనని
అయ్యా బాంచెనని మెదిలేటోళ్ళు
అన్నా యాలనే అడుగుతున్నరని
ఊరుకుంటె మన ఉనికే ఉండదని
ఉన్నోళ్ళందరు ఒక్కటయ్యింర్రు
కిరాయి గుండెల్నెగ బెట్టిర్రను
యాభై మందిని చంపిచ్చిర్రను
ఇది కీల వేణ్మనిలో జరిగిందన్నో
కీడుతలచి మే లెంచన్నో ॥కీల॥

నడి ఊళ్ళకెళ్ళి నవ దంపతులు
పళ్ళకీలో పోతున్నారంటని
పండ్లు పటాపట కొరికింత్రరంట
పెండ్లి మేళమునే ఆపింత్రరంట
పళ్ళకి మోసే మాల మాదిగలు
పళ్ళకీలో పోతారా మీరని
కత్తులు కటార్లు ఎత్తింత్రరంట
కరకర మనోళ్ళ కోసింత్రరట
వద్దెంది మంది వో మాలన్నో
భత్రై పోయిరే మాదిగన్నో
ఇది కపల్లా ఊరి కతరన్నో
నువు కలేజ చూపి కదులన్నో ॥నిజం॥

కంచెకచెర్లలలో కోటేశుని
కాళ్ళు చేతులు మీదికి గట్టి
కోదండంయెలాడ దీసి
తాటాకు మంటలలో పెయ్యంత కాల్చి
పన్నెండేండ్ల పసివాడని చూడక
ప్రాణాలతో వదిలి పెట్టక
ఘోరంగ చంపిరే వో అన్నో
నువు మేలుకోవె మాలమాదిగన్నో
ఘోరంగ చంపిరే మాలన్నో
నువు పోరాడ లెవ్వే మాదిగన్నో ॥నిజం॥

మాల మాదిగలు మాకే వినరా అని
మమ్మల్ని కాదని మెదులుతార అని
ఎనుబైనాలుగు ఇండ్లను కాల్చిరట
మనోళ్ళ నల్గురి నండ్లనే ఏసిరట
ఆడోళ్ళను చెఱ బట్టిరట
రెండేండ్ల పాపను తొక్కి చంపిరట
ఇది పదిరి కుప్పములో జర్గిందన్నో
పదిలంగా ఇక మెదులన్నో ॥నిజం॥

తుజల్ పూర్‌లో పులి లక్ష్మణును
రాతిరంతా రాకాసి కొడుకులు
ఘోరంగ కొట్టిరే ఘోరెంద కొడ్డుకులు
గోదనీడ్చినట్టు గుంజు కచ్చిరి
కచేరిముందర చెట్టుకు కట్టిరి
కిరోసిన్ పోసిరే మాలన్నో
నిలువున గాల్చిరే మాదిగన్నో ॥నిజం॥

చూచింది చూచినట్లు
జరిగింది జరిగినట్లు అబద్దాలె ఆడమన్నరని
అదాలత్‌లో చెపుతామన్నరని
మాలమాదిగ ముండా కొడుకులకు
మగుర బాగ నిండిందంటని
బందిపోటు దొంగోడు
బందూకు చేతపట్టుకొని
ఆ కసాయిరండా కొడుకన్నో
మనోళ్ళను కాల్చిండన్నో
ఆ టాగూర్ జాతోడన్నో
మనజాతోళ్ళమ చంపిడన్నో
ఇరువై నల్గురిని మాలన్నో
ఇది థియోలి సంగతే మాదిగన్నో ॥నిజం॥

సాదుపూరు మన జాతవ పీరులు
సంగతి తెల్సుకొని థియోలి పోయి
మనోళ్ళందరిని యెంటనే కల్సి
మదన పడొద్దని యిమ్మతిచ్చిరి
సాదుపూరుకే తిరిగి వచ్చిరి
చావంగ మిగిలినోళ్ళకు
దిగులు పడొద్దని దైరమిచ్చిరని
ఖూళ్ళనుగూడా ఇడవద్దనుకొని

పటాపటామని పదు నల్గురిని
పిట్టలమేరం కాల్చి పారేస్తే
చరాచరామని నాయకులంతా
సాదుపూరులో చేరిం(్రరంట
పోయినపాణాలు తేలేముగాని
పైకా మెంతో కొంత యిత్తామనంటే
మీ పైసలతో మాకేమి వొర్గదని
మీ మాటలతొ మాకు మేలుజర్గదని
తుపాకి కావాలన్నారు
లేకుంటె అపాయమన్నారు
తుపాకులే యిమ్మన్నారు
లేకుంటె పోపొమ్మన్నారు ॥నిజం॥

అంటద్దన్నవాన్ని
మంట కల్పుదాం
పక్కా కన్న వాడి
మక్కెలిరుద్దాం
తక్కువన్నవాడి
తిక్కకుదిరిద్దాం
చెక్కుచెదరక వొకటై ఉందాం
మాలమాదిగ పులులారో
ఇక మేకలము కాపద్దె అన్నలారో ॥మాల మాదిగ పులులారో॥

సుంకరం ఒడ్డయ్య
"అదిరిపడుతున్రు"
1985

# ఇదేమి ధర్మమన్నా...

ఇదేమి ధర్మమన్నా - బుద్దెరిగిన భీమన్నా
అధర్మమంటె ఇలలో - మనుధర్మము రోరన్నా
అధర్మ సారమేందో - ఇప్పి చెప్పుతానన్నా
ఆసక్తి వుంటేనే ఆలకించుడోరన్నా ॥ఇదేమి॥

వచనం: జగతిలోని జనులంతా బ్రహ్మ వివిధ అంగాల నుండి పుట్టినారంటా....
ఎవరెవరు ఎటునుండి పుట్టారో ఇపుడు వినుడన్నా....

బాపండ్లు పుట్టిందీ - బ్రహ్మ శిరస్సునుండంటా
క్షత్రియులు పుట్టిందీ - ఛాతి చేతుల్లోనంటా
కోమట్లు బుట్టిందీ - కడుపు తొడల నుండంటా
శూద్రులు బుట్టిందీ - చెప్పు కాలి నుండంటా ॥ఇదేమి॥

వచనం: పుట్టవలసిన చోటు నుండి పుట్టారనే కాబోలు
పంచములు వాళ్ళు పేరెత్తలేదు తెలుసుకొండన్నా....

మనిషెట్ల బుడతాడో - మనిషైనోడికి ఎరుకా
బూడ్డి గుంటల బొర్లే - గాడ్డులకు ఏ మెరుకా ॥ఇదేమి॥

వచనం: ప్రపంచంలో వున్న ఏ ప్రాణికైన వుండె సహజ లక్షణం....

సుఖంలో ముఖమంతా - వికసించి పూయడము
దుఃఖంలో కన్నీళ్ళు - తన్నుకొని రావడము
ఊపిరాడకపోతే - గుండె నిలిచి పోవడము
ఇదేర లోకంలో - ప్రాణికున్న లక్షణమూ ॥ఇదేమి॥

వచనం: ఇది ప్రాణికోటి ధర్మం....కాని మన మనువిచ్చిన హిందూ ధర్మలో
కులాల పేరుతో మనిషిని మనిషి దోపిడి చేయడమే ముఖ్య లక్షణం....

తాను బాగుండి - తన తమ్ముడెవడో చెడిపోతే
సంకలేగిరేసే గుణం - మనుధర్మములుందన్నా ॥ఇదేమి॥

వచనం: ప్రకృతిలోని ప్రతి జాతి ప్రాణి, తాను బ్రకాకడం కోసం, మరో జాతి
ప్రాణిని తింటుంది చూడన్నా....

నాచును తినే పురుగును - కప్ప మింగి కులుకన్నా
కప్పను పాము నమిలి - చప్పుడు గాకుండన్నా
పామును గద్దొచ్చి - తన్నుకొనిపోయిరన్నా
రొట్టలేసి తింటూ - తన చావు మరచురోరన్నా

వచనం: ఇది జంతు ధర్మం..........ఒక జాతి జంతువును మరో జాతి తినే నీతికాని.......మన మనువిచ్చిన హిందూ ధర్మం ...తన జాతి వాళ్ళను తానే తింటువుందన్నా....

మనుధర్మ కర్మాల - జాతి నరకమౌతుంటే
ఇంకేడ మిగులుతుంది - భరతజాతి రేపన్నా ॥ఇదేమి॥

వచనం: ప్రకృతిలోని ప్రతి జాతి తన జాతి ఉన్నతినే కోరుకుందన్నా....

చెట్టుకు చెట్టెపుడూ - చేటు చేయలేదన్నా
పిట్టను పిట్టెపుడు - ప్రాణమడగలేదన్నా
అదేమి చేటో మరి - మను ధర్మమురోరన్నా
తన జాతిని తానే - సంపితింటుందోరన్నా ॥ఇదేమి॥

వచనం: ఇలాంటి వికృత ధర్మాన్ని ఆదరిస్తే వోరన్నా.......జాతికి వినాశనమే తప్ప ప్రగతి మాత్రం లేదన్నా....మనిషిని మనిషిగా చూసేదే మానవతా ధర్మం....

మతంతో మనుషులను - కులంతో వర్గాలను
వేరుచేసి ఊరేగే - తరతరాల దోపిడిని
ఏ చోట దాగున్నా - వెతికి పట్టి రోరన్నా
సమాధి చేసేదే - దళిత ధర్మమోరన్నా! ॥సమాధి॥

మాస్టర్జీ
దళిత కళా మండలి పాటలు
1992

# పోరు సల్పమన్నారు - సమత నిల్పమన్నారు

పద్దెంది వందల తొంబది ఒకటి
ఎప్రేల్ పద్నాల్గున అంబేద్కర్ జననం ॥పద్దె॥
శాంతి అనే రథానికి
సారథి మా బాబా
సహనానికి మారు పేరే
అంబేద్కర్ బాబా
నవభారత రాజ్యాంగ నిర్మాత మా బాబా ॥పద్దె॥

నిమ్న జాతులకు
నిజమైన నేత
దళిత జాతులకు
మరపురాని దాత
ఆ దాత ఆశయమే
నేడెందరికో ఆదర్శం ॥పద్దె॥

హిందూమతం అనే
ఉద్యానవనములో
కాలసర్పమునంటూ
ఘర్జించిన కేసరి
కులం అనే పునాదులపై
జాతి నీతి లేదన్నారు ॥పద్దె॥

మేకల్నే బలియిస్తారని
పులులుగ మారుమని
నిదిరించిన జనతను సైతం
కదిలించినారు
కదిలిన ఆ గుండెల్లోనే
నిదిరించినారు ॥పద్దె॥

పోయిన హక్కుల కోసం
పోరాడుమన్నారు

బిచ్చమెత్తి బేరమాడి
పొందలేము అన్నారు
నిరంతర పోరాటమే
విముక్తి మార్గం అన్నారు ॥పద్దె॥

సాంఘిక ఆర్థిక
సమానత కోసం ॥సా॥
భూనభోంతరాలు
దద్దరిల్లెలాగ ॥భూ॥
పోరుసల్పుమన్నారు
సమత నిల్పుమన్నారు ॥పోరు॥

సుంకం ఒడ్డయ్య
"అదిరిపడుతున్న"
1985

## ఈ మగవాడి రాజ్యంలో చెల్లీ

ఈ మగవాడి రాజ్యంలో చెల్లీ
మంటసెగలోలె లెవ్వాలి మల్లీ
కష్టమేదొచ్చినా కర్మంటు గూసోక
మర్మమేదో ఎరిగి ముందుకే సాగుతూ ॥ఈ మగ॥

నీ నోటికే తాలంబు బెట్టి
కాళ్ళ జేతులకు సంకెళ్ళు గట్టి
నిన్ను వంటింటి జైల్లోకి నెట్టి
సంప్రదాయాల నిన్నదరగొట్టి
పుట్టినప్పుడె నిన్ను బానిసగ మార్చినా - 2
మనుధర్మ శాస్త్రాన్ని మంటలో కాలుస్తు ॥ఈ మగ॥

నీకు నూరేండ్ల ముసలోన్ని జూపి
నీ గొంతుకే ఉరితాడు వేసి
నీ బ్రతుకులో నిప్పులే బోసి
అయ్యో ముండగా నిన్ను మార్చేసి
ప్రాణమున్నన్నాళ్ళు బండోలె బ్రతుకన్నా - 2
థండకొడుకుల బట్టి చెండాడుతూ నీవు ॥ఈ మగ॥

ఇడుపు కాగితం నీ కిస్తనంటే
బత్కు లేనట్టు నువ్ కుమిలి సస్తవ్
వాడు లేకుంటె బత్కు లేనట్టే
కాళ్ళ కాడనే బడి సస్తనంటవ్
ఆ అల్సుతోనే నిన్ను ఐగ దొక్కేటి - 2
దుర్మార్గులను బట్టి కర కర కోయుతూ ॥ఈ మగ॥

సత్యసావిత్రి లాగుండు మంటర్
సీతమ్మోరి లాగుండు మంటర్
లేదు ద్రౌపదిగ నేనుంట నంటే
దిమ్మ దిరిగేసి అమ్మో నంటర్
ఈ నీతి సూత్రాలు నీకు మాత్రం బెట్టి - 2
నీతి లేక దిరుగు బూతు కొడుకుల దంతు ॥ఈ మగ॥

మీ బానిసపు ఉరి సంకెళ్ళన్నీ
పెల్లు పెల్లునా పగుల గొట్టేటి
రోజు మగవాడు మిమ్ము దోచేటి
చండశాసనం కాల రాసేటి
''హిందూ కోడు'' బిల్లన్న దేనాడో
బాబా చట్టమే జేసిందు చూడు
అందుకే అంబేడ్కరిందుకోడుబిల్లు - 2
సంపూర్ణముగ నేడు అమలు సెయ్యాలంటు
పోరాటము జేయు సెల్లీ
మీ బ్రతుకులే మారును మళ్ళీ

మాష్టార్జీ
దళిత కళా మండలి పాటలు
1992

# కదం కలిపి

ఎన్నెలో ఎన్నెలో.... ఆ....హా
పగటిపూట కాసేను ఎన్నెలా ఓహో ॥ఎన్నెలో॥

బుర్రమీసం కామందు ఎన్నెలా
ఆకలిగా చూస్తేను ,,
మాపిటికి రమ్మని ,,
సేయిపట్టి లాగినాడ ,,
చీరకొంగు చించబోతె ,,
చిలకట్టు ఎగగట్టి
పిడికిల్లు బిగపట్టి
శివమెత్తి సెలరేగి
చావుదెబ్బ తీయవే
సెల్లెలో సెల్లెలా ఆహా
పగటిపూట కాసేను ఎన్నెలా ఓహో ॥సెల్లెలో॥

రక్తాన్ని కుమ్మరించి ఎన్నెలా
పంటలెన్నొ పండించి ,,
కామందు గాదిలో ,,
గింజలన్ని నింపాక ,,
కూలిసీవు అడిగితే ,,
మెడబెట్టి గెంటితె ,,
నడుంకట్టు కట్టవోయ్
చేతికర్ర తిప్పవోయ్
సింగమల్లె గర్జించి
సలిజ్వరము దింపేయి
అన్నయ్యో....అన్నయా ఆహా
పగటిపూట కాసేను ఎన్నెలా ఓహో ॥అన్నయ్యో॥

ఎలచ్చన్లు వత్తేను ఎన్నెలా
వినాయకులె దిగుతారు ,,
నీ గంజి కూడు తాగుతారు ,,
నీ కాళ్ళకె మొక్కుతారు ,,
ఓట్లేస్తే గద్దెలెక్కి ,,
ప్రజల మాట మరచిపోతే ,,
కళ్ళెర్రజేయవోయి
చంద్ర నిప్పులు గ్రక్కవోయి
జుట్టు పట్టి గద్దెనుండి
బరాబరా ఈడ్చవోయి ॥ఎన్నెలో॥

ప్రసాద్
జన చైతన్య గీతాలు
1992

# మాలోల్ల మంటావు

మాలోల్ల మంటావు మాదిగలమంటావు
మాట మాటాడితే దూరముండంటావు
నీ రక్త మెట్లుండెరో ఓరోరి
మా రక్త మెరుపుండెరొ ॥మా॥

మమ్ముల్ను తాకితే మైలవుతనంటావు
మా గాలి సోకితే గంగలో మునిగేవు
నీ యిల్లు ఎవడు గట్టే ఓరోరి
నీ బాయి ఎవడు తవ్వే ॥మా॥

కూలికని మేమొచ్చి మా చెమటలను పోసి,
పంటలను పండించి నీపాలు చేస్తిమి
మా కష్టమే తింటివి - ఓరోరి
మమ్ముల్ను తరుమేస్తివి ॥మా॥

మాలోనె మాకేమొ కొట్లాటలనుబెట్టి
నీ సెప్పుచేతల్లో వుంచుకుంటున్నావు
నీ పద్ధతులు తెలిసెరో - ఓరోరి
నీ కుట్రలే తెలిసెరో ॥మా॥

భూములూ, జాగాలు ఇప్పిస్తనని చెప్పి
ఊరిబయటా మాకు పూరిళ్ళు కట్టించి
అంటరానీ తనమునూ ఓరోరి
పోషించు చున్నావురో ॥మా॥

కులము, మతమూ లేక పేద ప్రజలందరితో
కలసిపోతూ మేము కదలివస్తున్నాము
ఉన్నవాళ్ళ రాజ్యమూ - ఓరోరి
ఊడగొట్టేస్తామురా
పేదవాళ్ళ రాజ్యమూ - ఓరోరి
సాధించుకుంటామురొ

బి. యన్. బి.
"మేం పాడుతాం"

## పోరు చెయ్యి ఇక లెవ్వన్నో

కాళ్ళు మొక్కుతా
గులాపోడ్నని
బాంచనంటు నువు బతకకురో ॥కా॥

ఆరేండ్ల పోరడు
అరెయ్ తురెయ్ అంటె
అంతుకున్నదని తల్వకురో ॥కా॥

ఇండ్లు గట్టుతవ్
బావులు తవ్వుతవ్
రానియ్యరు నిన్ను ఇంట్లకు
తాకనియ్యరు నిన్ను బావిని
గురాత్మమే లేని మనుషుల పట్ల
గులాపోడివి ఎట్లవుతావురో ॥కా॥

ఉన్న భూములన్ని
ఆళ్ళకే ఉన్నయ్
ఉన్నదల్లా నీకు రెండు రెక్కలే
రెక్క ఆడనిదే డొక్క నిండదనే
సంగతి నీకు తెల్వందా ॥కా॥

సొంత భూములు ఎవర్కి వద్దని
భూములన్ని జాతీయం చెయ్యమని
బాబా సాహెబ్ ఎప్పుడో చెప్పెను
బాదలు పోయె బాట చూపెను
భూములన్ని జాతీయం అయ్యేదాక
పోరుజెయ్యి ఇక లెవ్వన్నో ॥కా॥

సుంకం ఒడ్డయ్య
"అదిరి పడుతున్రు"
1985

## మనమెనుబైయైదు శాతం

మైనారిటీలతో కలిసి - మన మీ దేశంలో
యస్సి, యస్టి, బిసి - మన మెనుబైయైదు శాతం
ఇంకెంతకాలముందాం - ఈ రాజ్య మేలకుండా
ఇంకెంత కాలముందాం - ఈ దేశ మేలకుండా
పదిహేను మందితేని - దోపిడి అగ్రకులము
దేశాన్ని దోస్తవుంటే - సూస్తెట్ల వూరుకుందం
కూసుండి మేస్తవుంటే - కాస్తెట్ల వూరుకుందం ॥యస్సి. యస్టి॥

కర్మంటు మనకు జెప్పే - ధర్మాన్ని అంటగట్టి
కలిసున్న భరత జనుల - కులమంటు క్రైమగొట్టి
అరె.... కులం కులం మధ్య - కోసంత తేడబెట్టి
నీ కులం తక్కువంటు - నా కులం ఎక్కువంటు
కులాల పేరుమీద - విడదీసి మనలనాళ్ళ
దోపిడి జేస్తువుంటే - దోయనట్టు ఎట్ల వుందం ॥యస్సి, యస్టి॥

అడవుల్లో బత్కులీడ్చే - మా ఆది జాతివాళ్ళ
అంటరానితనము పేర - వెలిబడ్డ బత్కులోళ్ళ
వేలాది పేర్ల మీద - నేడెనక బడ్డ వాళ్ళ
ఈ నేల పుట్టినట్టి - మా మూలజాతి వీళ్ళ
ఈ భారతాది జనుల - బతుకొచ్చినోళ్ళ ఎత్తే
బహుజనులమైన మనము - భరియించి ఎట్ల వుందం ॥యస్సి, యస్టి॥

ఈ మూల జాతి జనులు - ఏలాలి భరత వనినని
మన బాబా సాహేబూ - నాడు బతుకంత పోరుజేసి
ఓటన్న కాగితాన్ని - ఆయుధంగిచ్చినాడు
ఢిల్లీని ఏలుతున్న - ప్రధాని కొక్కోటు
పల్లెల్లో బత్కు గడిపే - పాపయ్య కొక్క వోటు
ఓటెవరికున్నగాని - దాని విలువ వొక్కటన్న
అధికారమిచ్చె శక్తి - ఆ వోటుకుందిరన్నా
మరి నూటికెనబైయైదు - మనమందిమొక్కటాయి
రాజ్యాన్ని ఏలుదంరో - రాతల్ని మార్చుదంరో
దేశాన్ని ఏలుదంరో - దోపిడిని గూల్చుదంరో....

మాష్టార్జీ
దళిత కళామండలి పాటలు, 1992

## రావనా చందనాలో ఎన్నెలా...

రావన్న చందనాలో ఎన్నెలా
బహుజనులకు వందనాలో ఎన్నెలా ॥ఎన్నెలా॥

| | |
|---|---|
| మాలన్న మాదిగన్న | ఎన్నెలో ఎన్నెలా |
| గొల్లన్న, గౌడన్న | ,, |
| కమ్మరన్న, కుమ్మరన్న | ,, |
| రెల్లెన్న, పల్లెన్న | ,, |
| మంగలన్న, వడ్డెరన్న | ,, |
| సారెన్న - చాకలన్న | ,, |

మనమంత ఒకటే ఎన్నెలా
దళిత వీరులై సాగండి ఎన్నెలా ॥రావనా॥

| | |
|---|---|
| మన ఆస్తులు దోచినోళ్ళ | ,, |
| మన ఇళ్ళను కూల్చినారు | ,, |
| మన భూములు దోచినోళ్ళ | ,, |
| మన కడుపులు కొట్టినారే | ,, |
| చదువెంతో నేర్చినారు | ,, |
| పేదోళ్ళకు ద్రోహం చేసే | ,, |

వీళ్ళు పదిహేనుశాతమే ఎన్నెలా
ఈ దేశాన్నే ఏలుతుంద్రూ ఎన్నెలా ॥రావనా॥

| | |
|---|---|
| ఎల్‌కేజి సీటు నుండి | ,, |
| ఎమ్.బి.బి.ఎస్ వరకు | ,, |
| ఐ.టి.ఐ. సీటు నుండి | ,, |
| ఇంజనీరింగ్ సీటు వరకు | ,, |
| బంట్రోతు కొలువు నుండి | ,, |
| పై కొలువుల వరకు వీరు | ,, |
| రేట్లేమో పెట్టినారు | ,, |

సీట్లన్ని కొట్టినారు ,,
కొలువులన్ని దోచినారు ,,
లంచగొండితనమంతా ,,
పెంచిపోషిస్తూండ్రు ,,
మెరిట్ అంటే ఇంతేనా ఎన్నెలా
వీళ్ళ ప్రతిభేంటో తెలిసిందే ఎన్నెలో ॥రావనా॥

వీధి వీధి తిరుగుతుండ్రు
ఇంటిచుట్టు తిరుగుతుండ్రు ,,
అక్కాయి - చెల్లెమ్మ ,,
బాబాయి - తాతంటు ,,
వరసవన్నె కలుపుతుండ్రు ,,
మాటలెన్నో చెప్తుతుండ్రు ,,
చేతులేమో తడుపుతుండ్రు ,,
కాళ్ళకేమొ మొక్కుతుండ్రు ,,
ఓట్లన్ని గుంజుతుండ్రు ,,
అధికారం చేతబట్టి ఎన్నెలా
మన ప్రాణాలే తీస్తుండ్రు ఎన్నెలా ॥రావనా॥

పల్లెల్లో భూస్వాములు ,,
పట్టణంలో దొరబాబులు ,,
వాళ్ళంతా వీళ్ళంతా ,,
ఒక్కటై చేయి కలిపి ,,
మన అక్కల మన చెల్లెల ,,
మానాలే దోస్తుండ్రు ,,
మన అన్నల మన తమ్ముల ,,
ప్రాణాలే తీస్తుండ్రు ,,
మనమంతా ఒక్కటై ఎన్నెలా
వీళ్ళ మక్కెలిరగ గొట్టాలి ఎన్నెలా ॥రావనా॥

కాంగ్రేసు కుళ్ళిపోయే ,,
తెలుగుదేశం తుప్పుపట్టే ,,
జనతదళ్ ముక్కలాయే ,,
బిజెపి మత పిచ్చి ,,
మజ్లిస్‌కు మతిపోయె ,,
జనతాపార్టి మాయమయ్యే ,,
కమ్యూనిస్టుల కల చెరిగె ,,
పై పార్టీల నాయకత్వం ఎన్నెలా
అగ్రవర్ణ భూస్వాములదె ఎన్నెలా ॥రావనా॥

దళితులంత వినరండి ,,
ఈ కుట్రలన్ని తెలుసుకొండి ,,
ఓట్లన్ని మావైతే ,,
సీట్లన్ని మీవా అని ,,
ఘర్జిస్తూ గాండ్రిస్తూ ,,
కాన్షీరాం తొడకొట్టి ,,
అంబేడ్కర్ ఆశయాల్తో ,,
బహుజనులకు పార్టీ పెట్టి ,,
నీలిరంగు జండ పట్టి ,,
మనముందుకు వచ్చినాడు ,,
దళితులంతా ఏకమై ఎన్నెలా
కాన్షీరాం బాటలోన నడవాలి ఎన్నెలా ॥రావనా॥

మారుముడి విక్టర్ ప్రసాద్
"బహుజన సమాజ్" బి.యస్.పి. అధికార బులిటెన్
ఫిబ్రవరి - మార్చి '91

## జాగర్త జాగర్త

చెల్లి : జాగర్త, జాగర్త, అన్నయ్యా....మా అన్నయా....
ఉద్యమం జాగర్త అన్నయా
దళితోద్యమం జాగర్త అన్నయ్యా!

అన్న : చెప్పొద్దు సుద్దులు చెల్లెలా....మా సెల్లెలా....
నా కన్నీ ఎరుకేలే సెల్లెలా!

చెల్లి : లచ్చలిచ్చి కొనబోతె అన్నయా....మా అన్నయా....
అమ్ముడు కాబోకురా అన్నయా
దళితోద్యమాన్ని దెబ్బతీయకన్నయా!

అన్న : నే అమ్ముడు బోడానికి సెల్లెలా.... సెల్లెలా....
నే గడ్డితినే వోణ్ణిగాను సెల్లెలా ॥జాగర్త॥

చెల్లి : పదవి ఆశ చూపితే అన్నయా....మా అన్నయా....
పరాయి పంచ చేరబోకురన్నయా
దళితోద్యమాన్ని పడదోయకురన్నయా!

అన్న : పరాయి పంచ చేరబోనె సెల్లెలా....నా సెల్లెలా....
నే హీనమైన వోణ్ణిగాను సెల్లెలా ॥జగర్త॥

చెల్లి : కాంతలను ఎరవేస్తె అన్నయా....మా అన్నయా....
భ్రాంతిలోన పడబోకుర అన్నయా
దళితోద్యమాన్ని కూల్చబోకురన్నయా

అన్న : భ్రాంతిలోన పడడానికి సెల్లెలా....నా సెల్లెలా
నే నీచమైన వోణ్ణిగాను సెల్లెలా ॥జాగర్త॥

చెల్లి : బ్రాంది సీసాలు చూసి అన్నయా....మా అన్నయా....
మత్తులోన పడబోకుర అన్నయా
దళితోద్యమాన్ని నీరుగార్చకురన్నయా

అన్న : మత్తులోన పడడానికి సెల్లెలా....నా సెల్లెలా....
నే తాగుబోతు కానులె సెల్లెలా.... ॥జాగర్త॥

చెల్లి : లాఠీ తూటాలు జూసి అన్నయా....మా అన్నయా....
గుండె చెదరనీయకురా అన్నయా
దళితోద్యమాన్ని ఆపబోకురన్నయా

అన్న : గుండె దిటువు ఉన్నోణ్ణి సెల్లెలా....నా సెల్లెలా....
దళిత సింహంలా కలియబడత సెల్లెలా ॥జాగర్త॥

చెల్లి : మాటలు మాజిక్కు చేసి అన్నయా....మా అన్నయా....
ఉపన్యాస పులివి గాకుర అన్నయా
దళితోద్యమాన్ని పిల్లిజేయకరన్నయా!

అన్న : ఉపన్యాస పులిని గాను సెల్లెలా....నా సెల్లెలా....
పట్టుదలగ నిలబడతా సెల్లెలా ॥జాగర్త॥

చెల్లి : పేరు ప్రతిష్ఠల కోసమన్నయా....మా అన్నయా....
వ్యక్తిగా ఎదగకురా అన్నయా
దళితోద్యమాన్ని చీల్చబోకు రన్నయా....!

అన్న : వ్యక్తి కంటె శక్తి గొప్ప సెల్లెలా....నా సెల్లెలా....
నాకు ఉద్యమమే ఊపిరితే సెల్లెలా.... ॥జాగర్త॥

చెల్లి : సమిష్టి నాయకత్వాన అన్నయా....మా అన్నయా ...
ఉద్యమాన్ని పెంచాలి అన్నయా
దళితోద్యమాన్ని పెంచాలోయ్ అన్నయా

అన్న : అందరమూ ఐక్యంగా సెల్లెలా....నా సెల్లెలా....
ముందుకె సాగుదాము సెల్లెలా
దళిత విముక్తికై పోరుదాము సెల్లెలా ॥జాగర్త॥

ప్రసాద్
"జన చైతన్య గీతాలు"
1992

# చెయ్యరాని ఘోరం

సూర్యుడా నీవు
చూచినావ నేరం
చెప్పరావేమి
చెయ్యరాని ఘోరం ||సూ||

ఊరి చెరువూకు
కోరి వచ్చినార
గేదె దూడల్ని
కడిగి పోయినార ||సూ||

వద్దు బాబంటె
గుద్దిపోయినార
కల్లుతాగి
గంతులేసినార ||సూ

కుట్రచేసి
కూడి వచ్చినార
కత్తి కర్రల
కూడ తెచ్చినార ||సూ||

కాళ్ళుపట్టిన
కూలతోసినార
కేకలేసిన
కుప్పకూల్చినార ||సూ||

పరుగుతీసిన
యెంటబడినార
కంటబడినోళ్ళ
కుమ్మిపోయినార ||సూ||

గుడిసె యిండ్లన్ని
గుట్టకూల్చినార
బరిసె పోట్లతో
బాధ పెట్టినార ||సూ||

ప్రక్క పల్లెల
పిలవనంపినార
పండుగని వారు
విందు చేసినార ||సూ||

పెద్ద పెద్దోళ్ళు
సద్దులేకున్నార
కొద్ది కొద్దోళ్ళను
బొక్కలో తోశార ||సూ||

విజయవాడలో
విడిదిచేసి చెప్పితే
లాఠిచార్జితో
దాడి చెయ్యమన్నార ||సూ||

అక్రమాలన్ని
గోలచేసి చెపితే
నక్సలైట్లని
టక్కరోళ్ళంటార ||సూ||

బీదప్రజలకు
నాదుడే లేడా
వారి ఏడ్పుకు
ఓదార్పు లేదా? ||సూ||

దొంతపాటి రామారావు
"దళిత జన గీతాలు"
1985

# నువ్ పోయిన మరునాడు

నువ్ పోయిన మరునాడు అయినాది మా బ్రతుకు
మండేటి నిప్పులా బాబా
మా కొరకు పోరాడె నీలాంటి శ్రమజీవి
జన్మించ లేదయ్య ఇంకా ॥నువ్॥

తాగుటకు నీళ్ళకి బడిలోకి రానీక
పలుమారు దూరాన మమ్ముంచిరి - 2
ఈ ఎట్టి అన్యాయ మతమార్చనీకినువ్
అంబవాడలో నాడు జన్మిస్తివి ॥నువ్॥

అంటరానింటిలో పుట్టినవాడని
అంటరానోడంటు గెంటేసిరి - మమ్మ - 2
అస్పృశ్యులందరికి దారి జూపే కొరకు
అంతులేని చదువు చదివేస్తివీ నువ్వు ॥నువ్॥

మేము శ్రేష్ఠులమంటు - మురిసేటి బ్రాహ్మణులు
దేశాన్ని పాలింప - లేనయ్యిరీ - 2
అస్పృశ్యులెంతటి - గొప్పవాళ్లో తెలుప
సంవిధానము అపుడు - రాసిస్తివి ॥నువ్॥

గాంధీ నెహ్రూల తోటి - అలనాడు పోరాడి
దళితులకు హక్కులను ఇప్పిస్తివి - 2
హక్కులను పొందినా - వారిని ఆలనాడు
దళితుల ముక్తికి - రమ్మంటివి ॥నువ్॥

నీ శ్రమతో బతికేటి ఉద్యోగ పురుషులు
అస్పృశ్యులందరిని - మరిచారయ్యా - 2
సోకుల మోహాల - బ్రమలోపల జిక్కి
నీ మాట నెప్పుడో - మరిచారయ్యా ॥నువ్॥

నువ్ పోయిన మరునాడు - ఆరింది దీపము
అస్పృశ్యులందరికి - చీకట్లురా - 2
ఆలుపిల్లల కెంత - అగచాట్లు కడగండ్లు
అడిగేటి దిక్కెవరు - లేరయిరిరా ॥నువ్॥

ఎందెందు చూసిన - ఆకలి కేకలు
బీదల కన్నీళ్ళు సోకాలు రా
కడుపులు పెంచుకొని - కులుకుతూ తిరిగేరు
బీదలను దోచేటి - లోఫర్లయ్య ॥నువ్॥

ప్రతిరోజు దళితులు - ముక్తికి పోరాడే
దళిత సంఘం - జన్మ మెత్తిందిరా - 2
నీ ఆట నీ పాట - నీ కలలు పండించే
సంఘమే సిద్ధంగా - ఉన్నాదిరా ॥నువ్॥

రామయ్య (కర్ణాటక)
దళిత కళా మండలి పాటలు
1992

# దేశం నీదన్నగాని

(యుగాలనుండి ఓ పాలకుడు దళితులతో)

పాలకుడు : దేశం నీదన్నగాని - రాజ్యమడగమన్ననా
దళితుడ ఈ దేశాన్ని - నిన్నేలొద్దన్ననా ॥దళితుడా॥

నేనున్న పార్టీల జేరి ఓరి దళితుడా
నావెంటనే రమ్మంటిరోరి ,,
నా అంతటి లీడరు లేడంటూ ,,
నిను వూరంత జెప్పంటిరోరి ,,
నాకెవడన్నెదురుంగొస్తే....? ,,
వాని పీక నులుమంటిరోరి ,,
గుండాగిరి జేసైనా ,,
నిను ఫండొసులు జెయ్యంటిరోరి ,,
జండాలు మొయ్యంటిరోరి ,,
నిను జేజేలు గొట్టంటిరోరి ,,

వచనం : గియన్నీ జేస్తూ........
క్యాడరులుండన్నగాని - లీడరుగమన్ననా
దళితుడ ఈ దేశాన్ని - నివ్వేలొద్దన్ననా
ఓట్లను వేయన్నగాని - సీట్లు అడగమన్ననా
దళితుడ ఈ దేశాన్ని - నిన్నేలొద్దన్ననా ॥దళితు॥

బర్లనిస్తా, గొర్లనిస్తా - పాడు బంజరు భూములిస్తా
బతుకుదెరువు గడ్వనీకి - బ్యాంకులోను అప్పులిస్తా
ఉండనీకి వూరవతల - కాలనీలో ఇండ్లుఇస్తా
సద్వుకునే పోరలుంటే - స్కాలర్ షిపు బిచ్చమిస్తా
ఎద్గుతున్న లీడరుంటే - రిజర్వేషను సీటులిస్తా
అధికారం అసలులేని - పదవులెన్నంటన్ని ఇస్తా

వచనం : కానీ............
అన్ని ఇస్తన్నగాని - అధికారమిస్తనన్ననా
దళితుడ ఈ దేశాన్ని నిన్నేలొద్దన్ననా
ఎట్టిసేయన్నగాని - గట్టునుండమన్ననా
దళితుడ ఈ దేశాన్ని - నిన్నేలొద్దన్ననా ॥దళితు॥

గుడి నువ్వు గట్టాలిరా ॥దళితుడా॥
ఆ గుడిలోకి రావద్దురా ,,
రామున్ని గొలువాలిరా ,,
నువ్ బ్రాహ్మణుడవు గావొద్దురా ,,
కృష్ణున్ని మొక్కాలిరా ,,
అష్టదరిద్రంలో ఉండాలిరా ,,
రథము నువ్వు జెయ్యాలిరా ,,
ఆ రథమెక్క జూడొద్దురా ,,
అన్ని నువ్వు జెయ్యాలిరా ,,
ఎప్పుడనిగి మనిగి ఉండాలిరా ,,
ధర్మానికి ఎల్లపుడు హిందువుగా ఉండాలి
కర్మాన్ని కాదనకా కులహీనుడు గుండాలి.

వచనం : ఏందిరో? ఏమో గట్ల జూస్తవ్....
నిను పేరుకు హిందువన్నగాని - హక్కులడగమన్ననా
దళితుడ ఈ దేశాన్ని నిన్నేలొద్దన్ననా
దేశం నీదన్నగాని - రాజ్యమడగమన్ననా
దళితుడ ఈ దేశాన్ని - నిన్నేలొద్దన్ననా ॥దళితుడా॥

దళితుడు : మోసి మోసి మీ పల్లకి
మా మెడలు వాసిపోయ్‌నాయీ
చేసి చేసి మీ సేవలు - మా
వయస్సు ఉడిగిపోయినాది
ఇగ గూసుంటామురో మీరేలే కుర్చిమీద
తెగ గోసేస్తామురో - మీరెవ్వరూ లేవనంటె ॥ఇగగూసుం॥

మాష్టార్జీ
దళిత కళా మండలి పాటలు
1992

## సమరశంఖం

అరెరరరెరె అన్నలు మా యన్నలు
దళితన్నలు పోరన్నలు మీరు
సాగిరండి సంగతిక తేల్చేద్దాం
కదలిరండిరో యుద్ధమిక సాగిద్దాం ॥అరెరరెరె॥

బావిత్రవ్వి నీరిస్తే ॥అన్నలు దళితన్నలూ॥
ఆ నీరు మనది కాదా ,,
భూమి దున్ని కూడుబెడితె ,,
ఆ భూమి మనది కాదా ,,
నేతనేసి గుడ్డ ఇస్తే ,,
ఆ గుడ్డ మనది కాదా ,,
గూడు కట్టి దీపమెడితె ,,
ఆ యింట నిలువ రాదా ,,
ఎన్నాళ్ళని ఎన్నేళ్ళని
అణిగి మణిగి బతుకుతాము
కుల గజ్జి నాయాళ్ళమ
నరికి పోగులెడదాము ॥సాగిరండిరో॥

మన చెల్లెలు మన తల్లుల ॥అన్నలు దళితన్నలూ॥
మానాలను చెరుస్తుంటే ,,
మన అన్నల మన తమ్ముల ,,
ప్రాణాలను తీస్తుంటె ॥అన్నలు దళితన్నలూ।
మన గుడిసెలు మన గరిసెలు ,,
మంటల్లో మాడ్చుతుంటె ,,
రోజు రోజు కొకపల్లెను ,,
మట్టిలోన కలుపుతుంటె ,,
ఎన్నాళ్ళని ఎన్నేళ్ళని
మౌనంగా ఉంటాము
బలసిన నా కొడుకులనిక
బల్లాలతో పొడుద్దాం ॥సాగిరండిరో॥

మన ఓట్లేసి గెలిపిస్తే ॥అన్నలూ దళితులూ॥
గద్దెలెక్కి కూకున్నరు ,,
ఆలకులపొల్లను కౌగిలించి ,,
రాజ్యపాలన చేస్తున్నారు ,,
పోలీసోడి నీడల్లో ,,
దారుణాలు చేస్తున్నరు ,,
ఒక్క చిక్కిన మనల జూసి ,,
ఆలు పకాపకా నవ్వుతుండ్రు ,,
ఎన్నాళ్ళని ఎన్నేళ్ళని
మృగాలతో వేగుతాము
గద్దెనుండి ఈడ్చితన్ని
మనమే యిక పాలిద్దాం ॥సాగిరండిరో॥

చుండూరు పల్లెలోన ॥అన్నలు దళితన్నలూ॥
చిందిన ఎర్రటి రక్తం ,,
కర్ర కత్తి పలుగు పార ,,
గండ్ర గొడ్డలి బందూకులు ,,
అరె చేతబూని కదంతొక్కి ,,
దోపుల పనిబట్టమంది ,,
దళిత జాతి విముక్తికై
పోరాటం సల్పమంది
భరత గడ్డ చరిత్రను
తిరగరాయ మందిరోయ్ ॥సాగిరండిరో॥

ప్రసాద్
జన చైతన్య గీతాలు
1992

# బహుజనులు రాజ్యమేలాలి

పల్లవి : పూలే మార్గం దాపులేనిది
పెరియార్ మాట అజేయమైనది
అంబేద్కర్ ఆలోచన తెలుసునులే ఓ దళితసోదర
అంతిమంగా గెలుపునీదేలే ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : భరత రాజ్యమేల్డానికి
అగ్రకులాల మూర్ఖులంత
చీల్చినారనేక కులాలుగా ఓ దళితసోదర
బహుజనులు రాజ్యమేలాలి ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : హరిజనులంటూ పేరుబెట్టి
గాంధి ఏమో కుట్రజేసే
అంబేద్కర్‌ను మరవనీకి
జగ్జీవన్‌రామ్‌ను దెచ్చిరి
ఎవ్వరేమి కుట్రపన్నినా ఓ దళితసోదర
అంబేద్కర్ యోచననే తెలుసునులే ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : రౌండ్‌టేబుల్ సమావేశం జరిగినపుడు
అంబేద్కర్ బ్రిటిషోడితో పోరాడి
దళితజాతి విముక్తికోరి ఓ దళిత సోదర
రిజర్వేషన్ ప్రతిపాదించె ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : రిజర్వేషన్ పెట్టవద్దనీ
గాంధీ ఏమో కుట్రబూనే
స్వాతంత్ర్యం ముఖ్యమని
బ్రిటిషోడితో చర్చ జరిపిరి
అగ్రకులాలు ఏమిచేసినా ఓ దళితసోదర
రిజర్వేషన్‌ను ఏమిచెయ్యాలె ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : కులవ్యవస్థను మార్చనిదే
దేశంలో మార్పురాదు
ప్రక్కదారి నీవుబట్టావు ఓ దళితసోదర
బహుజనులలో కలిసిపోరాడు ఓ దళితసోదర ॥పూలే॥

చరణం : అంబేద్కర్ యోచనమీద బెట్టిన
బహుజన సమాజ్‌పార్టీ
బహుజనులు రాజ్యమేలే
బహుజన సమాజ్‌పార్టీ
ఆ పార్టీలోనే ముందుండాలి ఓ దళితసోదర
కాన్షీరామ్ మాటవినాలి ఓ దళితసోదర ॥పూలే॥

పి. ఆర్. అనిల్‌కుమార్
దళిత్ వాయిస్
జులై, ఆగస్ట్ 1992

## కన్నీటికుండ

నీరుకొండో
నీ కడుపుమండ
నీకేల పుట్టింది
కులగజ్జిముండో ॥నీ॥

దొర పొగాకుతో
దొరవైతివంట
నిన్న మొన్నటి పదవి
కన్ను కప్పిందంట ॥నీ॥

పంచాయితికి పోటీ
పేదోడు దిగెనంట
పంతాన ప్రతిసారి
పొగ గక్కినావంట ॥నీ॥

ఊరేగు పేదోళ్ళ
పెండ్లిండ్ల కడ్డంట
పూరవతలునోళ్ళ
నోళ్ళు నాక్కినావంట ॥నీ॥

గుడిసెల్లో కులగుండ్లు
గుప్పించినావంట
పేదలను బరిసెలతో
పొడిచి, చంపితివంట ॥నీ॥

తాత తండ్రుల జులుము
తలపోసినావంట
పాత పద్ధతి పీడ
చేతకాలేదంట ॥నీ॥

గుడిసెల్లో నిప్పేసి
గుట్టుగా తిరిగేవు
అండతో బంగారు
కొండ కాలేవు ॥నీ॥

కారంచేడూ కత్తి
నెత్తురారనులేదు
నీరుకొండా!
దళిత కన్నీటికుండా ॥నీ॥

పేదోళ్ళ రక్తమ్ము
పిడికిలై లేస్తాది
నీరులేని కొండ
నిను పిండి చేస్తాది ॥నీ॥

దొండపాటి రామారావు
"దళితశక్తి"
1.11.87

## నెత్తుటి ప్రతిజ్ఞ

వీరుల్లారా శూరుల్లార
చుండూరు మృత వీరుల్లార
అందుకోండి మా జోహార్లు
అందుకోండి మా జై భీమ్‌లు ॥వీరుల్లారా॥

అన్నెం పున్నెం ఎరుగని మిమ్ము
ఆత్మగౌరవం కోరేమిమ్ము
పోలీసోల్ల అండ దండతో
నాయకులోల్ల ఆసీస్సులతో
కులహంకారం నెత్తికెక్కిన
కులాలె రంకెలు వేస్తూ
ఆయుధాలను చేతబూని మిము
వెంటాడి వేటాడి చంపిన
కసాయి కొడుకుల కుళ్ళు రక్తమును
కళ్ళజూసి కసి తీర్చుకుంటమూ
రక్త చరిత్రను రాస్తామయ్యా
రక్త తర్పణం చేస్తామయ్యా ॥వీరుల్లారా॥

మీ రక్తం ఇంకిన నేల సాక్షిగా
శవాలు నిండిన కాలువ సాక్షిగ
మూటలు గట్టిన గోనెల సాక్షిగ
తోటలో త్రొక్కిన మల్లెల సాక్షిగ
దోషులను ఉరితీసే వరకు
నక్కలు గద్దెలు దిగేవరకూ
పోరాటం ఇక ఆపబోమయా
అమీతుమీ యిక తేల్చుతామయా ॥వీరుల్లారా॥

ఇదిగిదిగిదిగో దండు కదిలెను
అదిగదిగదుగో దండు కదిలెను
ఎక్కడ చూసిన దళితుల దండే
కణకణ మండే అగ్నిగుండములె
భగ భగమంటూ భుగభుగమంటూ
పొగలై సెగలై ధరణి నిండెరా
దోపిడీ రాజ్యం కూల్చేవరకూ
దళితుల రాజ్యం వచ్చేవరకూ
పోరుబాటలో నడుస్తామయా
వేగుచుక్కలై నిలుస్తామయా ॥పీరుల్లారా॥

ప్రసాద్
"జన చైతన్య గీతాలు"
1992

## ఎట్టి మానర దళితుడా!

ఎట్టి మానర దళితుడా!
నువ్వు ఎదురు దిరుగర దళితుడా!! ॥ఎట్టి॥

పొద్దనక మాపనక పొలంలో పనిజేసి
దొరల గాదెలలోకి దొర్లించి నీ సెమట
ఎంత జేసినగాని ఏమి లాభమురన్న
ఎట్టిజేసే నీకు మట్టి గూడా కరువే ॥ఎట్టి॥

దొర ఇల్లు నువు గట్టి ఇల్లు లేనోడవూ
పంటలెన్నో దీసి పస్తులున్నోడవూ
ఇన్ని జేసిన నీకు విలువ లేకుంటాయె
అంటరానోడివని గెంటి పారేసిండ్రు ॥ఎట్టి॥

బాయిదొవ్వేది నువ్ బంగ్ల గట్టేది నువ్
బంగారు పంటల్ని పండించేదే నువ్వు
వూరి గుడిసెలోన నూరేండ్లు గడిపేటి
బాంచ బతుకొద్దని బరిగీసి నిలబడి ॥ఎట్టి॥

నీ రంగు జూసిండు రారండి సారండు
నువు నీటుగా వుంటె నీకు సీటిచ్చిండు
నీ ఊరు పేరడిగి కులగోత్ర మడిగిండు
కులమిప్పి చెప్పగనే ఛీఛీ పొమ్మండు ॥ఎట్టి॥

విలువలేని బ్రతుకు ఇంకెంత కాలమని
నిలదీసి అడుగగా బ్రాహ్మణవాదులు
కులమంటు మతమంటు నినువేరు జేసిండ్రు
ఆచారముల పేర అగ్నిలో వేసిండ్రు ॥ఎట్టి॥

కులమొద్దు మతమొద్దు, వర్గాలు వద్దంటు
భారతావని జనత జాతంతా ఒకటంటు
బాబాసాహెబ్ అన్న మాటెంతో బహుముద్దు
బాబాసాహెబ్ గారి బాటలో నువ్ నడిచి
కులరక్కసిని కూల్చ పోరు జేయరన్న ॥ఎట్టి॥

యం. వి. యస్.

దళిత కళామండలి పాటలు

1992

## లేవరా! దళితుడా!

లేవరా! లేవరా!
దళితుడా పోరాడ లేవరా
కదలి ముందుండి నడవరా!
మాలని మాదిగని
అంటరాని వాడవని
ఊరిబయట నిను వుంచి
హీనంగా చూస్తున్నారు ॥లేవరా॥

కులమతాల పేరుతో
కూల్చినారు మన బ్రతుకులు
మనిషి మనిషి కలవకుండ
అంతరాలు పెంచినారు ॥లేవరా॥

ఆర్యజాతి మూర్ఖులంత
అది శేషు బిడ్డలన్న
అదమరచి వుంటివా
దాటివేసి పోతరన్నా ॥లేవరా॥

భూమినంత చేతబట్టి
దోచారు మన శ్రమను
రాజ్యానికి వచ్చినారు
దేశాన్ని ముంచినారు ॥లేవరా॥

భూమికొరకు భుక్తికొరకు
దళితుల విముక్తికొరకు
బంధనాలు త్రెంచుకో
పోరుబాట నందుకో ॥లేవరా॥

దీన బంధు అంబేద్కర్
ఆశయాలు నెరవేర్చగ
కడదాక పోరుదాం
రాజ్యాన్ని పొందుదాం ॥లేవరా॥

కొరబండి ఆంథోని
దళిత కవిత
992

# అంబేడ్కర్ శతజయంతి

అంబేద్కర్ శతజయంతి
అదేనోయి పర్వం
ఆనందపు బాటలోన
నడచె జాతి పర్వం ॥అంబే॥

మహారాష్ట్ర ప్రాంతమందు
మహరు అనే జాతిలోన
మహనీయునిగా బుట్టి
మహామనిషిగా వెలసి
భీమాబాయి, రామోజి
పుత్ర రత్నమై శ్రీ సతి
రామబాయి చేపట్టిన
భీముడు గుణధాముడైన ॥అంబే॥

ముదముగ పరదేశమందు
చదువు సంధ్య లభ్యసించి
కొదమసింగమై సమతా విధమును
మన కందించి బరోడా సంస్థాన
మందు సైనిక అధికారమంది
కూడని కుటిలాత్ముల
వెనుకాడకుండ ఎదిరించిన ॥అంబే॥

రచనా వ్యాసంగమందు
సమత జనతలకు తోడుగ
వచన మూక నాయక మరివేరు
పత్రికలను నడిపి దళిత జాతులకు
విద్యా దానమొసగ జేసి
దయాకలితుడుగా రాజకీయ
హక్కులెన్నో ఇప్పించిన ॥అంబే॥

న్యాయవాదిగా సంఘ దురన్యాయం
నెదిరించి మూఢ నమ్మకాలను
దునుమాడి మంత్రిగా నిలిచి

అస్పృశ్యత రూపుమాపి బౌద్ధధర్మ
రక్ష జేసి అందరి మనముల
నిలిచిన వందితు డామాన్యుడు మన ॥అంబే॥

భారత రాజ్యాంగానికి
పూర్ణత చేకూర్చాలని
రూపుదిద్ది ప్రజాతంత్ర రూపం
కల్పించెనపుడు, న్యాయశాస్త్ర
మంత్రిగ అన్యాయం సహించలేక
తన పదవిని వదలిపెట్టి
దారిని చూపిన ఆద్యుడు ॥అంబే॥

మగవాళ్ళతో మగువలకు
సమాన హక్కులుండాలని
వేగవేగమే హిందూ కోడ్
బిల్లు సవరించి, స్త్రీల ఉద్ధరణకు
నడుంకట్టి ముందుగా నడచి
ఆదర్శం చూపించిన
అంబేద్కరు పూజ్యుడతడు ॥అంబే॥

కడజాతుల విభజించే
పద్ధతి యిక మానాలని
బాపూజీ నిరాహారదీక్షను
బూనిన యంతట
పూనా ఒప్పందానికి పునాది
రాయిగా నిలిచీ (తన)
ఆశయమే పణంపెట్టి (బాపు)
అశువులు కాపాడిన మన
అంబేద్కర్ శతజయంతి
అదేనోయి పర్వం ॥అంబే॥

రచన : డా॥ వి. బండారు
పాడినవారు : ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం
డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషన్ ట్రస్ట్
హైదరాబాద్ వారి సావనీర్ నుండి.

## చుండూరు గ్రామంలో చెల్లెమ్మా

చుండూరు గ్రామంలో చెల్లెమ్మా - దిగులు జెందకు మాయమ్మా
కండ పొగరెక్కిన దోపిడి దొరగాండ్లు
దళిత జాతులపైన కత్తులే నూరిండ్రు
కలత జెందకు నీవు చెల్లెమ్మా
కసి దీర్చుకుందాము మాయమ్మా
దిగులు జెందకు నీవు చెల్లెమ్మా
ధైర్యంగ ఉండాలె మాయమ్మా
పారిపోయిన దొరలు పోలీసు మూకలతో
పల్లెకే తిరిగొచ్చి పడగలే విప్పిండ్రు
మీసాలు మెలివేసి రోసాలు పోతుండ్రు
ఈ రోజులెన్నాళ్ళు చెల్లెమ్మా
మనరోజులొస్తాయి నిజమమ్మా
వెట్టిచాకిరి జేసి మట్టిగలిసిన బతుకు
ప్రాణాలు బోయేటి పాడాయె బ్రతుకులు
దొరగాల్ల చేతిలో దొర్లిపోయే బ్రతుకు
ఈ బతుకు మనకొద్దు చెల్లెమ్మా
మన వెతలు తీరాలి మాయమ్మా
దోపిడి దొరగాండ్ల పొతంబట్టే వరకు
దళితులకు రాజ్యము వచ్చేటంత వరకు
కలిసికట్టుగ మనము చెల్లెమ్మా
నిలిసిపోరాడాలె మాయమ్మా
నీలిజెండా మనకు అండగా ఉన్నది
బాబా జూపిన బాట దేశంలో ఉన్నది
పోరాట మొక్కటయి చెల్లెమ్మా

బ్రతుకు భాటలో సాగు మాయమ్మా
చుండూరు దళితుల్ని చండాడి చంపేస్తే
భీతిజెందక దళిత జాతంత లేసింది
జాతంత లేసింది దండోర వేసింది
అగ్గోలె లేసింది బగ్గున మండింది
పిడికిలి బిగియించి చెల్లెమ్మా
దోపిడిని ఎదిరించు మాయమ్మా
భారతదేశంలో చెల్లెమ్మా
బాబా జూపిన బాట మాయమ్మా
బాబా జూపిన బాట చెల్లెమ్మా
మనకు అండగా ఉంది మాయమ్మా

**ద.క.మ. మిత్రులు**
దళిత కళామండలి పాటలు
**1992**

# పుట్టినాడు ఒక భాస్కరుడూ...

భరతజాతి కీర్తికీ - భావి భరత చరితకు
కళంకమై నిలిచిన - ఈ కులం కుళ్ళు కడిగేందుకు
పుట్టినాడు ఒక భాస్కరుడూ....
అతడేనోయ్ అంబేద్కరుడూ.... ॥పుట్టి॥

ప్రతిభన్నది యే ఒక్కడి - సొత్తు కాదు ఇలలోయని
అవకాశం వుంటే అది - అందరి దరి చేరునని
అందరి అవకాశాలను - కొందరే దోచుకునే
దోపిడింక, ఇకపైన - సాగదని హెచ్చరించ ॥పుట్టి॥

నింగి, నేల, గాలి, నీరు - ఎవరి సొత్తు కావని
వీటిననుభవించే హక్కు - అందరి కుండాలని
పోయిన హక్కు పోరాడితే - తప్ప నీకు రాదని
పోరాడగ పులిలాగ - ముందుకు సాగాలని ॥పుట్టి॥

వర్ణ, వర్గ, కుల భేదపు - కుంపటులంటించీ
మానవతను విద్వేషపు - కీలలలోన ముంచే
బ్రాహ్మణీయ ఆజ్యాని - భరత వాక్యమును పలికే
బౌద్ధీయమే మానవతకు - శరణమంటు తెలుపా ॥పుట్టి॥

మాష్టార్జీ
డా॥ అంబేద్కర్ పీపుల్స్ ఎడ్యుకేషన్
ట్రస్టు (హైదరాబాదు) వారి సావనీర్ నుండి

## ఆలోచించండాలోచించండి!

ఆలోచించండాలోచించండి!
ఓ బాబుల్లారా! ఆలోచించండాలోచించండి!
కల్లాకపటం ఎరుగనోళ్ళు - కాయకష్టం చేసేటోళ్ళు
నాయకుల్ని నమ్మేటోళ్ళు - నమ్మి మోసపోయేటోళ్ళు ॥ఆలో॥

ముస్లీమూ మన ప్రెసిడెంటాని - మురిసిపోతే లాభమేమిటి?
తిరిపమెత్తే పకీరోళ్ళకూ తిండిలోటూ దీరిపోయెనా ॥ఆలో॥

స్త్రీ దర్జాగా రాజ్యమేలితే - స్త్రీ జాతికి మేలేమిటి?
పడుపువృత్తి నశించిందా? పూర్తి స్వేచ్ఛ లభించిందా? ॥ఆలో॥

మాలతను, మాదిగతను - మంత్రైడే ఫలితమేమిటి?
చెప్పులుకుట్టే బీద హరిజనుల - చిప్పలోన బువ్వ వున్నదా ॥ఆలో॥

గిరిజనుడూ ఎమ్మెల్లే అయితే - గిరిజనులకు ఒరిగేదేమిటి?
కట్టెలుకొట్టే తేనెలుపట్టే - కష్టం వాళ్ళకు తప్పిపోయెనా? ॥ఆలో॥

కులాలన్నీ సమానమంటూ - కులానికొక్కడు నాయకుడంటూ
ఆడా మగ తేడాలేదంటూ - డాబులుకొట్టే పాలకవర్గం ॥ఆలో॥

ఎవడో ఒక్కడు సుఖపడుతుంటే - ఎందరికో ఈ బాధలెందుకు
అందరు ఏకంగా ఎదిరించి - అన్యాయాన్ని పాతేయండి

శతార్
దళిత కవిత
1992

# మడిధర్మం మనదికాదు దళితన్నా

ఎవ్వని ధర్మమే, మాయన్నో దళితన్నా
ఇది ఎవని రాజ్యమే మాయన్నో దళితన్నా
తడిబట్టతో గొంతుకోసే - ఆ మడి ధర్మం మనది కాదు
మనువు ధర్మమే, మాయన్నో దళితన్నా
అది మనది కాదురో మాయన్న దళితన్నా
మన ముత్తాతల తండ్రులకు - ముడ్డికి పొరకాట గట్టి
దగ్గి ఉమ్మిన నేరానికి - మూతికి లొట్టిని గట్టి
తరతరాల వర్ణధర్మ - కర్మపుతల రాతపేర
ఎట్టిపనులు చేసేటి - కట్టుబాంచెలుగ మార్చిన ॥ఎవని॥

గొడ్ల మేపుక చ్చ ఖిల్వ - దడ్ల పెండ్ల కడ్లుతీసి
జొన్న సొప్ప బుడ్డపోల్లు - సన్నంగా నరికిపెట్టి
వాగుల ఊత పడగొట్టి - ఒళ్ళంత రాసి కడిగి
ముకుదారం పగ్గమేసి - మువ్వగంటలను గట్టి
రాముల గుడి సుట్టు దిరిగె - బండికి రంగులు దిద్ది
కావురమెక్కిన ఎడ్లకు - కాడిమాకు కట్టినంక
ఎక్కువోళ్ళ పిల్లలంత - ఎగిరి ఎక్కి కూసుంటే
అయ్యా బండెక్కుతనని - అడిగిన మా చంటోన్ని
మాదిగోడ నువ్వెక్కితె - మైలబడుతమని తోసిరి ॥ఎవని॥

సేతుల్ల పురితిప్పి - ఈతనార తాళ్ళుపేని
మండలు తెగనరికి - మామిడి తోరనాలు గట్టి
ఆరెముండ్లు మారెముండ్లు - అడవి తిరిగి తీసుకొచ్చి
తిరునామము దిద్దె మట్టి - ఆకు తెంపుకొచ్చి పోసి
పాడుబడ్డ గుళ్ళముందు - పచ్చని పందిళ్ళు వేస్తే
దేవుని పెండ్లైతుంటె - దూరముండని తరిమిరి ॥ఎవని॥

రక్తమంత ఇంకిపోంగ - రాళ్ళ గోడలు పేర్చి
దేహమంత అవిసిపోంగ - దేవ గోపురాలు గట్టి
రాతిగిర్రల ఇరుసుకు - రథము గుంజె మోకుకట్టి
కింద మీద పట్టి మనం - బంధం యేసి గుంజుతుంటే
దేవ ప్రతిమలా పక్కన - తావు వానిదంట సూడు ॥ఎవని॥

పసులు సస్తే చర్మమొలిసి - లిద్దిలేసి కర్రుచేసి
కంపునంత మింగుకుంట - కాళ్ళజోడు మనం చేస్తే
పీక లేని పిల్లగాడు - అరె తొరె అంటుండు
వాని తల్లి వయసు మన తల్లుల - అసె తొసె అంటుండు
మురికి పనులు చేసెటోడ - ముట్టకురా మమ్మండు ॥ఎవని॥

ఈ పొగరెక్కిన ఎక్కువోళ్ల పొత్తు మనకు కలవదన్నా
ఈ నిజం తెలుసుకో మాయన్నా దళితన్నా
నీవు నిప్పైమండరో మాయన్నో దళితన్నా

వెంకన్న
''నలుపు''
ఏప్రిల్ 1-30, 1992

## వింటివా మల్లన్నా

వింటివా మల్లన్నా - కాలేజి సదువులల్లో
కులంజేసే గమ్మత్తు - వింటివా మల్లన్నా
వింటివా మల్లన్నా - వింటివా మల్లన్నా ॥వింటి॥

నువ్ అడ్మిషన్ దీసుకోని - క్లాసులోకి రాగానే
ఆ క్లాసు లెక్చరరు - నీకేసి నడిసొచ్చి
ఊరడిగి పేరడిగి - ప్రేమ కులాసాలడిగి
బాబూ మీరెవరంటూ - భుజంమీద చెయ్యేసి
తడిమి తడిమి చూసుకుంటు - జంధ్యం చేయికందగానే
ఈ పోరడు మావోడని - యిగ నమ్మక మొచ్చినంక
ఫస్టుక్లాసు మార్కులిచ్చి - పైకి పైకి తోస్తరట ॥వింటి॥

మావూరి సోదరుడు - సందీపు భార్గవని
ఉస్మానియా కాలేజిలో - డాక్టరుగా సదవంగా
చదువుజెప్పె పంతులేమొ - సందీపుని ముఖం జూసి
ఎర్రగ బుర్రగవుంటే - భార్గవంటె బ్రాహ్మడని
డాక్టరు డిగ్రీతోపాటు - తన డాటర్ని యిచ్చెనంట ॥వింటి॥

ప్రతిభంటు మొత్తుకునే - ప్యారాసైటీసులారా
ధాని అర్థమేందో తెలుసారా - తెలివి లేని కుంకలారా
భారతీయ హిస్టరీమీకు - ఏమైనా తెలుసారా
ఆది కవి వాల్మీకితో - మొదలైన మా ప్రతిభ
ఆగలేదు ఏనాడు - అంబేద్కరు వరకు నేడు
కవికోకిల జాషువా - మహాకవి భీమన్న
విప్లవ కవి శివసాగర్ - ప్రజాకవి గద్దర్‌లో
ప్రతిభ లేదనే దమ్ము - ఎవడికైన ఉందారా
మాకు బుట్టినదే ప్రతిభ - మా ఉనికే జాతీయత
మేమంటు లేకుంటే - మీరంటు లేరంటు
దళితులు ప్రతిరోజంత - దండోర వేస్తరట ॥వింటి॥

మాష్టార్జీ
దళిత కళామండలి పాటలు
1992

## ఇదేదారి

ఇదేదారి - యదేదారి
ఇదే - ఎడారి
దళితన్నా - బాటసారి
ధనస్వామ్య - పు పెడారి ॥ఇదే॥

కుళ్ళు సంఘ - మెడారిలో
మంచి నీరు - బావిలేదు
ఏ కొంచెం - నీరున్నా
అంటు జబ్బు - కోనేరే ॥ఇదే॥

సమానత్వం - ఖర్జూరం
నేదతీర్పు - చెట్టులేదు
ఇసుక తుఫా - నల్లదిగో
మసక కులం - చాటున్నది

సమ సమాజ - మొయాసిస్సు
సహజముగ - లేదు లేర
సాహసించి సాధించర
సహజీవన - మదేపోర ॥ఇదే॥

ఎండమావు - లల్లవిగో
మందు స్వేచ్ఛ - కొండచుట్టు
పొంగెడి పాలా - నందం
పొయ్యిపాలు - కావచ్చు ॥ఇదే॥

పేదవాంటె - నీ యెంట
పస్తులుండి - నడచివచ్చు
ఈ దోపిడి - మనిషికన్న
ఆ జంతువు - మేలన్న ॥ఇదే॥

ఈ చీకటి - ఎడారిలో
ఏ వెలుతురు - కానరాదు
ఏ మహాత్మ - దుదయించిన
ఈ సంఘం - వెలుగలేదు ॥ఇదే॥

ఈ గమనం - ఎన్నాళ్లో
నీ త్యాగం - ఎన్నోండ్లో
కలతమాని - అలతమాని
కలసిరార - కదలిపోర ॥ఇదే॥

దొండపాటి రామారావు దళితజన గీతాలు 1985

# దళిత జనగణమన

జనగణమన భీమ నాయక జయహే
నిమ్న జాతుల భాగ్యవిధాతా
ఆర్థిక, సాంఘిక, రాజకీయ
న్యాయశాస్త్రంబుల నిపుణుడా ||జన||

జ్ఞానమునం దజాతశత్రువా
నీ నామస్మరణ శుభమగుగాక
నీ నామ మార్గమే శుభమగుగాక
జనగణమంగళ భీమ నాయక జయహే
భారతరాజ్య భాగ్యవిధాతా
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ, జయహే!

జై భీమ్

కె. త్యాగరాజు
దళిత కవిత
1992

# యాలరో ఈ మాదిగ బతుకు

యాలరో ఈ మాదిగ బతుకు
మొత్తుకుంటే దొరకదురా మెతుకు
నీకు మొత్తుకుంటె
దొరకదురా మెతుకు ॥యాల॥

మాలన్న మాదిగన్న
నీరడన్న బేగరన్న
మేదరన్న మ్యాతరన్న
లంబడన్న చెంచన్న
కులం కులం కులమంటు
కుమిలిపోయె కూలన్న
గొంతు విప్పి పాడుతున్న....
మనసు విప్పి వినరన్నా ... ॥యాల॥

బొందలు తొవ్వేటి
బ్యాగరక్కు మనదీ
సచ్చిన పసుల మోసె
మాదిగక్కు మనదీ
నీల్లను కాపాడే
నీరుడక్కు మనదీ
రోతను సాపుచేసే
మ్యాతరక్కు మనదీ
బాంచ బతుకె మన బతుకని
మన బతుకుల మన్నుబోసి
బలసిన దోపిడి దొంగలు....
బాగ బలిసి పోతుండ్రు.... ॥యాల॥

బంగారు పంటలిచ్చే
భరత గడ్డరా మనది
గంగమ్మ ప్రవహించే
పుణ్యభూమిరా మనది

గంగ యమున బ్రహ్మపుత్ర
కృష్ణ పెన్న కావేరి
ఎన్నెన్నో జీవనదులు
ప్రవహించే జీవగడ్డ
మాల మాదిగన్నలకే ...
మంచినీల్లు కరువాయె.... ॥యాల॥

శాస్త్రిగారి ఆవులకు
గర్క దెచ్చి గడ్డిదెచ్చి
పిండిపెట్టి కుడితిబోసి
బుదగరిచ్చి పాలుపిండి
పాలు మీగడలు శాస్త్రిలు
పసందుగా మింగుతుంటే
చల్లబొట్లు శాస్త్రిలంటె
అంట్లైతది అడగకనే ॥యాల॥

ప్రాణాలు బోవంగా
పునాదులు దొవ్వి
రక్తాలు కారంగా
రాళ్ళ గోడబెట్టి
కంటికి ఇంపైనా
కర్నపోని బంగ్లా గట్టి
ఇంట లగ్నమైతుంటే
ఇనామిస్తడని పోతే
కులం తక్కువ ముండాకొడక....
గడపదాటి రాకుమనే.... ॥యాల॥

మతం మార్చుకుంటేనేమో
మనసు చల్లబడ్తదాని
కష్టాలు బోతయని
క్రైస్తవ మతములో చేరితే
కమ్మ క్రైస్తు, రెడ్డి క్రైస్తు
మాల క్రైస్తు, మాదిగ క్రైస్తు
అంటారాని పిశాచము....
ఎంటబడుతున్నది.... ॥యాల॥

మాల మాదిగుల నడుమ
మంచి నీళ్ళ బాయిగొట్టి
మాలోళ్ళ గిరక దిక్కు
గజంలోతు ఎక్కువ దొవ్వి
మాలోల్ల గిర్క దిక్కు
మాదిగోల్లు రావొద్దని
మనలో మన మిద్దరమె
తన్నుకోని చస్తుంటే
తాకులాటబెట్టి దొరలు
తమాష చూస్తున్నారు.... ॥యాల॥

సర్ పంచు గ్రామ పంచు
సంతకాలు తీసుకొని
కర్నము కనకయ్యకు
కోడిపుంజు కాలబెట్టి
గిర్దావరు గానికి
గురుదక్షిణ చెల్లించి
తాసిల్దారు సంతకముకు
తలపానము తోకకొచ్చె
ఎర్రగ బుర్రగ ఉన్నావు
మాదికంటె నమ్మనందు
సర్టిఫికేటు లేకుంటే
సీటురాదు సారంటే
నొసటిమీద మాదిగోల్ల....
ముద్దరేసుకోమన్నాడు.... ॥యాల॥

దొరవారి కొడుకులను
అరె అన్నందుకు
తెల్లని మల్లె మొగ్గ
చీర కట్టినందుకు
కోటేశును కాల్చిండ్రు
కొండమ్మను చెరిచిండ్రు
తప్పుడు కొడుకులను తన్న
ఉప్పెన వలె ఉరికిరార.... ॥యాల॥

బెల్చిలో భూస్వాముల
కథ తెలుసా నీకు
దున్నే వానిదే భూమి అన్నందుకు....
భూస్వాముల కాల్లకాడ
పడియుండా నందుకు
పట్టపగలే కాల్చి కూల్చి
టాంకు కింద పడదోసి....
తారురోడ్డు లేసింగ్రడట....                ॥యాల॥

ఇందిరా కాంగిరేసు
హితం జెస్తదంటా
జనతా నాయకులు
జయం చేస్తరంటా
నిన్న మొన్న నేడు రేపు
నీ రక్తం దాగినోళ్ళు
కవల పిల్ల లీలంత...
కలల గూడ మరసిపోకు....                ॥యాల॥

భూమంతా భూస్వాముల
ఇలల ఉందిరన్నా
వాలను కూల్చేదాకా
కులం పోదురన్నా
గనిలో బొగ్గు దవ్వే
గని మనిషివి నీవు
సమ్మెట పట్టినోడ
సమ్మె చేయరార
కమ్మని బతుకు కొరకు
కత్తి నూరుకోర
నీ చెమటినకని చేనుందా
నువు చెయ్యని ఏజుందా
శ్రమజీవుల విముక్తికై
పిడికిలెత్తి బాస చెయ్                ॥శ్రమ॥

గద్దర్

## అయ్యాళ్లు - ఇయ్యాళ్లు

గబ్బిలం బుర్ర కథ రాసీ....గవర్నరు పేటల జెపితె
గావుకేకలు పెట్టింండ్రో అన్నా అయ్యాళ్ల
గాయదలమని కొట్టింండ్రో అన్నా అయ్యాళ్ల
గారడేదో చేస్తూంండ్రన్న ఇయ్యాళ్ల

అందరమూ మనుసులామె - అందరిలో వుంది రక్తామె
కులముతోని - కుక్కలమని
ఊరిబయట వుంచిండ్రో అన్నా అయ్యాళ్ల
ఉసురు తినీ వూరింండ్రో అన్నా అయ్యాళ్ల
ఉత్తకబుర్లూ చెపుతుంండ్రన్న ఇయ్యాళ్ల

చిన్నలేదూ - పెద్దలేదూ - బూతు మాటలు మానలేదు
పాలేరు పనీ - సపాయి పనీ
సల్లగ సవారి చేసింండ్రో అన్నా అయ్యాళ్ల
మెల్ల మెల్లగా దోసింండ్రో అన్నా అయ్యాళ్ల
ఉద్ధరిస్తమని సెబుతుంండ్రన్న ఇయ్యాళ్ల

మాలమాదిగ సీలికబెట్టి - ఉద్ధరణ అనీ పోజులు బెట్టి
బంజరు భూములు - ఇండ్ల జాగలు
ఆశలు చూపి ఆడిస్తుంండ్రన్న - ఇయ్యాళ్ల
హరిజనులని పేరు బెట్టింండ్రు అన్నా ఇయ్యాళ్ల
అందరితో వేరూ చేస్తుంండ్రన్నా - ఇయ్యాళ్ల

చిన్న తప్పును పెద్దగ జూపి - గుండుసూదినీ గొడ్డలిజేసి
కంచికచర్ల కాళరాత్రుల్ల - సజీవంగా సంపింండ్రో అన్నా అయ్యాళ్ల
కట్టేసి కాలబెట్టింండ్రో అన్నా అయ్యాళ్ల
మాటలతో మాయ జేస్తూంండ్రన్న ఇయ్యాళ్ల

కూడు సాలతలేదంటే - కూలిరేటు పెంచమంటే
మదరాసు కీలవేన్మణిలోన -
మాలగూడెమో కాల్చింండ్రో అన్నా అయ్యాల్ల
నలభై మందిని సంపింండ్రో అన్నా అయ్యాల్ల
నవ్వేతు నూతిలో తోస్తుండ్రన్న ఇయ్యాల్ల

మదముతో మానభంగాలు - గర్వంతో గృహదహనాలు
ప్రతిపూట - ప్రతిచోట
నిర్భయంగా చేస్తూండ్రో అన్నా ఇయ్యాల్ల
న్యాయమడిగితె సంపుతుండ్రన్నా ఇయ్యాల్ల
నీతులు గోతులు తీస్తూండ్రన్నా ఇయ్యాల్ల

భూస్వాముల ఈ పరిపాలన - నాయకుల ఈ నయవంచన
ఆగేదాకా - అంతమయ్యేదాక
కలిసీ కొట్లాడుండ్రో అన్నా ఇయ్యాల్ల
దోపిడిరూపు మాపుండ్రో అన్నా ఇయ్యాల్ల
కలిసీ కొట్లాడుండ్రో అన్నా ఇయ్యాల్ల

నవోదయ
దళితకవిత
1992

## మేం బాంచోల్లం

మేం బాంచోల్లం -
మాదిగోల్లం -
మాలోల్లం -
గులాపోల్లం - గాయిదోల్లం
ఎట్టోలం - ఏమిలేనొల్లం
దరిద్రులలో - దరిద్రులం

నోరుండి - లేనొల్లం
ఊరుండి - లేనొల్లం
మనుష్యులుగ పుట్టి
మనుష్యులుగ గుర్తింపు లెనొల్లం

ఊరావాల - మావూరు
మురికి కాలువ - మా గంగమ్మ
దోమలు ఈగలు - కుక్కలు పందులు
మా స్నేహితులు

సచ్చిన గొడ్లమాంసం - పరమాన్నం
రెండు రెక్కలు - మా స్వంత ఆస్తి
పిడిల్ పిడిల్ నుండి
తలవొంచి - మెడలొంచి
దొరల పొలాల్లో - ఎద్దులా పనిచేయడం
మా జన్మ హక్కు

స్వంత ఆస్తి ఉండొద్దు - ఉంటే నేరం
వేదాలు వినొద్దు - వింటె సీసం పోస్తారు
దేవుండ్లను చూడొద్దు - చూస్తే కండ్లు పీకేస్తారు
మనుధర్మ శాస్త్రం....
మాకిచ్చిన కానుకలివి

మాకు చాల హక్కులున్నయి
సీరుడకు్క - బ్యాగరకు్క
మాదిగ హక్కు - మెహతర్ హక్కు
పసుల మోసె హక్కు - శవాల కాపల హక్కు
తలవొంచి బ్రతికే హక్కు

మా చర్మమే - మా వస్త్రం
తెల్లచొక్క - మల్లెమొగ్గ చీర
కట్టుకున్న - పెట్టుకున్న
పట్టుకుంటది
దొర అనే దయ్యం

మా పిల్లలు - మట్టి బొమ్మలు
చింపిరి తలలు - చీముడు ముక్కులు
మట్టి పెల్లలే - వాళ్ళ మిఠాయి బిల్లలు
మేం ఓట్లుగానే చెల్లయ్యాం
దొరల కాల్లకింద నలిగిపోయే
చెప్పులయ్యాం.

మేం
అలసిపోయాం
అవమానంతో
కృంగిపోయాం
కష్టాలలో కాగిపోయాం
మోయలేని
బరువులు మోపాల
తిట్లు, తన్నులు గుద్దులు
కొరడా దెబ్బలతో మొద్దుబారిపోయాం
మా బతుకులోని అనువనువు
రగిలి, రగిలి, నలిగి, నలిగి
అణుబాంబె అయ్యింది
మేం అణుబాంబై పేలి
దోపిడి వ్యవస్థను
రూపు మాపేస్తాం
మనిషిని మనిషిగా చూసే
మరో ప్రపంచాన్ని నిర్మించుకొంటాం

గద్దర్

# నిన్న మనం

నిన్నమనం కాము కాము
మనుషులెకాము - నేడు
హరిజనులన్నారూ -
ఆశలు పెట్టారూ

వూరికవతలుండుమన్న
పెద్దమనుషులే - నేడు
గడపలు తొక్కారూ -
ఉద్ధరణన్నారూ

ఏదేదో బోధచేసి
ఎన్నికలొస్తే - కల్లు
కుండలు తెచ్చారూ -
దండలు వేశారూ

పట్టా ప్రేమలొలక బోసి
బ్రహ్మరథం పట్టి - బడుగు
వర్గాలన్నారూ -
మడుగుల దోశారూ

ఇంకా ఇంకా మా గూడెం
దరిద్రానబడితె - మాల
బుద్ధులు అన్నారూ -
బూతులు తిట్టారూ

సర్కారుకు భూసామికి
చాల దోస్తి అంటె - మమ్మ
ఠాణకు పంపారూ -
కోర్టులు తిప్పారూ

మా ఊళ్ళో గరీబోళ్ళు
కలవారిని హతాయించె
కత్తులు ఎత్తారూ -
దళములు గట్టారూ

మీ వూళ్లో మీరుగూడ
మా వోలె నడిస్తేనే
బాధలు చస్తాయా -
ప్రాణాలుంటాయా

చెరబండరాజు
జన్మహక్కు (పాటలు)

## ఎటో తేల్చుకో

కవీ....ఓ కళాకారుడా....
కవయిత్రీ....ఓ కళాకారిణీ....
అటా ఇటా నువ్వెటువైపూ.... ॥అ॥
ఎటో తేల్చుకో....ఇటే తేల్చుకో.... ॥ఎ॥

కవితలల్లే నీ కలము
పాటపాడే, నీ గళము
సప్త స్వరమ్ములు సరిగమ పాడగా....
కాలియందియలు ఘల్లు ఘల్లుమనా ...
కాదు కాదు కళకళ కోసం
కావాలీకళ ప్రజకోసం.... ॥కవీ॥

అటూకాదు ఇటూకాదు
అటూఇటూ నేనెటూకాదనీ
అందరివాడ్నని బొంకేవాడా....
సామరస్యమని సణిగేవాడా...
పీడక కులము పీడిత కులము
పీడక వర్గం - పీడిత వర్గం
ఈ రెంటిలోన నీదే కులమూ?....
ఈ రెంటిలోన నీదే వర్గం?.... ॥కవీ॥

అణిచివేసేదె బ్రాహ్మణ సంస్కృతి
తిరగబడేదే దళిత సంస్కృతీ
అణగారిన మా దళితులవైపా?....
అగ్రకులాలా ధనికులవైపా?....
దళిత సంస్కృతీ, బ్రాహ్మణ సంస్కృతీ
ఈ రెంటిలోన నీదే సంస్కృతీ.... ॥కవీ॥

కాసుకోసం ఆశపడి
కిరాయి కవిగా సిద్ధపడి
పాలక వర్గం వంత పాటగా....
కలం కత్తిగా విషం కక్కుతూ....
ప్రజలకు ద్రోహం చేస్తావా?
ప్రభుత కూడిగం చేస్తావా?.... ॥కవీ॥

ప్రజా సేవే ఊపిరిగా
ప్రజలపోరు ఉత్తేజంగా
ప్రజల పక్షాన పక్షపాతిగా....
కలం కత్తిగా విప్లవ జ్వాలై....
ప్రజల వాణిగా వుంటావా
ప్రజా కవిగ నువ్వుంటావా.... ॥కవీ॥

ఉ. సాంబశివరావు

## దళిత నాట్యం

తాలే లిల్లాయిలో - తకతాలే లిల్లాయిలో
తాలే లిల్లాయిలో - భీమతాలే లిల్లాయిలో
తాలే లిల్లాయిలొా - తందానానా
తానా తందాన తందానానా
తాధిమి తకధిమి - తందనాన తానా
తళాంగు తకధిమి - తానాతందానో ॥తాలే॥

తక్కాలిల్లే, లిల్లేలిల్లే - తక్కాలిల్లే తకథిమితోం!
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలిల్లే తకథిమితోం!
చిందేసె మాదిగోడ్ని నేనేనయో
చిన్న కత్తి పెద్ద కత్తి నాదేనయో ॥చిందు॥

కర్రసాము కత్తిసాము నాదేనయో
సాముగరిడి మాలోడ్ని నేనేనయో ॥కర్ర॥

నెమలిఆట పులిఅడుగూ నాదేనయో
అదివాని కొండమావు నేనేనయో ॥నెమ॥

ఈరతాళ్ళు నారతాళ్ళు నాయేనయో
ఈరంగం బీరప్పన్నే నేనయో
పనీపాట ఆటపాట నాదేనయో
పాటగాడ్ని ఆటగాడ్ని నేనేనయో ॥పనీ॥

కొమ్ముబూర ఎదురుబూర మాయేనయో
డప్పుదరవు డోలుదరువు మాయేనయో ॥కొమ్ము॥

చిందేసి ఎగిరేది మేమేనయో
గజ్జగట్టి గెంతేది మేమేనయో ॥చిందే॥

ఘల్లుఘల్లు, ఘల్లుఘల్లు ఘల్లుఘల్లు ఘల్లుఘల్లో
" " " "
ఘల్లుఘల్లు ఘల్లుఘల్లు -
గజ్జెల సంగీతమా - దళితజనం గీతమా!
జజ్జనకరి జజ్జనకరి-
తస్సదియ్య తక్క-థిమ్మి దళితచిందు నాట్యమా!
ఎయ్‌రా ఓ కొండన్న!
ఎయ్‌రా గెంతెయ్యరో - తందనానతాన!
ఎయ్‌రా కొండన్న - ఎయ్‌రో గెంతెయ్‌రో! ॥ఎ॥

ఎయ్‌రా! ఓసామేల!
ఎయ్‌రా చిందెయ్యరో - తానితందనాన!
ఎయ్‌రా సామేల - ఎయ్‌రో చిందెయ్‌రో! ॥ఎ॥

ఎయ్‌రా! ఓదానేల!
ఎయ్‌రా దరువెయ్యరో - తందనానతాన!
ఎయ్‌రా దానేల - ఎయ్‌రో దరువెయ్‌రో! ॥ఎ॥

ఎయ్‌రా ఓ బీరప్ప!
ఎయ్‌రా ఈరంగమెయ్ - తాని తందనాన!
ఎయ్‌రా బీరప్ప - ఎయ్‌రో ఈరంగమెయ్! ॥ఎ॥

ఘల్లు ఘల్లు ఘల్లో - తస్సదియ్య ఘల్లో
ఘల్లు ఘల్లు ఘల్లో - తక్కధిమ్మి ఘల్లో ॥తాలే॥
నాలిల్లాయి పదమే జానపదమై
నా జానపదమే సరిగమపదయై
సరిగమ పదనిస సంగీత మాయెరో ॥తాలే॥
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలీల్లే తకధిమితోం ॥తక్కా॥
నేనేసె చిందే చిందూ భాగోతమై
చిందూ భాగోతమే బ్రాహ్మణ భాగోతమై
బ్రాహ్మణ భాగోతమే భరతనాట్యమాయెరో ॥తాలే॥
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలిల్లే తకధిమితోం ॥తక్కా॥
నా తందనానతానే తకధిమిదరువై
తకధిమిదరువే నా డప్పుదరువై
డోలూ డోలక్కులకు దరువే నేర్పిందిరో ॥తాలే॥
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలిల్లే తకధిమితోం ॥తక్కా॥
నేజేసె శ్రమలో పుట్టిన కళలను
కాజేసినా ఈ పరాన్నభుక్కుల
స్వాహా సంస్కృతే బ్రాహ్మణ సంస్కృతీ ॥తాలే॥
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలిల్లేలిల్లే తకధిమితోం ॥తక్కా॥
బ్రాహ్మణ సంస్కృతె భరత సంస్కృతని
శూద్ర సంస్కృతిని చులకనజేసీ
అణగదొక్కినా అణిగిపోదురా-
దళిత సంస్కృతై ధ్వజ మెత్తునురా ॥తాలే॥
తక్కాలిల్లే లిల్లేలిల్లే - తక్కాలిల్లే తకధిమితోం ॥తక్కా॥
తక్కధిమ్మి ఘల్లో - ఘల్లు ఘల్లు ఘల్లో ॥తక్కా॥
తస్సదియ్య ఘల్లో - ఘల్లు ఘల్లు ఘల్లో ॥తస్స॥

ఉ. సాంబశివరావు

# ఈ హింసలిక సహించము

ఈ హింసలు ఇక సహించము
ఈ బాధలు ఇక భరించము
ఇది దళితవర్గ హృదిని
ప్రజ్వరిల్లు ప్రతిన॥

మన కన్నుల కెంపులన్ని సంఘటితం కావాలి
తిరుగుబాటు ఎర్రబావుటలై నింగి నిండాలి॥

ఇంకెందరు కోటీసులు జీవదగ్ధ మవ్వాలి
ఇంకా రామన్న పల్లెలెన్ని బూడిదవ్వాలి
తెలుగుతల్లి గుండెలపై మాయని గాయాలుగా
ఇంకా చినటగిరాల హత్యలెన్ని జరగాలి?॥

హలంపట్టి బలం పిండి భుక్తిని పండించు మనకు
బ్రతుకంతా అవమానం, ప్రతి పూటా ఉపవాసం
దేశానికి స్వేచ్ఛవచ్చి మూడుపదులు దాటినా
మన నెత్తిన భూస్వామ్యం పెద్దమ్మల పీడనా?॥

బెత్తెడు బంజరునేలని మనం సాగుచేసుకుంటె
తమదేదో దోచినట్టు దొరబాబుల కడుపుమంట
గతం బాగా కాలరాచి అణచిపెట్టి ఉంచాలని
దాడులు అదిరింపులు బెదిరింపులు వెలివేతలు॥

ఢిల్లీ తఖ్తు తమదేనని విర్రవీగుతున్నారు
భూపరిమితి చట్టాలకు తొర్ర పెట్టుతున్నారు
చెల్లనిదీ భూస్వామ్యం - భళ్ళున కూల్చాలిరా
పల్లెలపై వారి పట్టు బద్దలుగొట్టాలిరా॥

మల్లిక
ఉప్పెన

# దళితమాత

చుక్కల్లొ గలిసిరేమొ చక్కనయ్యలూ....
చుక్కలై పోయిరేమో చక్కనమ్మలు!
నా కంటిపాపలూ.... నా కన్న పేగులూ....
నా కన్నకొడుకులూ....నే కన్నకూతుళ్ళు
నా కన్నబిడ్డలూ....నే కన్నబిడ్డలూ ॥చుక్క॥

ఏసమ్మ ఏలేసమ్మ ఆశమ్మ ఓ పోశమ్మ
ఏరమ్మ ఏమైరమ్మ యాడికెల్లి పొయినారమ్మ
నువు గన్నకొడుకులూ....నే గన్నకూతుళ్ళు
కంటికి కానరాదు కళ్ళల్లొ కదులుతారు
ఇంటికి రానెరారు ఈడీడె మెదులుతారు
నువు గన్నకొడుకులూ....నే గన్నకూతుళ్ళు ॥చుక్క॥

నా ఊరు చుండూరు నా కొడుకు అనిల్‌బాబు
నా ఊరు టంగుటూరు నా బిడ్డ ఇందిరమ్మ
నా ఊరు చీమకుర్తి నా కూతురేసమ్మ
నా ఊరు కారంచేడు నా కొడుకు దుడ్డు రమేష
నా ఊరు కంచికచర్ల నా కొడుకు కోటేసు
నే దళిత తల్లినే....నే దళిత పల్లెనే
నా పేరు దళిత తల్లి నా ఊరు దళిత పల్లె
పల్లెలకు పల్లెనేను తల్లులకు తల్లినేను
నేదళిత తల్లినే....నేదళిత పల్లెనే ॥చుక్క॥

చేతికి అందొచ్చిన చెట్టంత నా కొడుకుని
పెళ్ళీడుకెదిగొచ్చిన చక్కనమ్మ నా బిడ్డని
చక్కంగ చదువుకొని పైకొచ్చె నా బిడ్డల
నూనూగుమీసాలా రోషమున్న నా కొడుకుని
పౌరుషంగ బతకాలని కోరుకొన్న నా కొడుకువి

కంటబడ్డ నా బిడ్డని ఎంటబడి చెరబడితె
ఆత్మాభిమానంతో కాదు పొమ్మన్నందుకు
ఘోరంగ చెరిచారూ....క్రూరంగ నరికారు!
ఏమిటీ ఈ ఘోరం! ఏమిటీ మానేరం!
గౌరవంగా బతకాలని కోరటమె నేరమనీ....
క్రూరంగ చంపారూ....ఘోరంగ చెరిచారు ॥చుక్క॥

గద్దెమీది మంత్రులార అగ్రకులం గెద్దలార
నా కడుపు శోకాన్ని డబ్బుల్తో తీర్చగలర?
నా బిడ్డ శీలాన్ని వెలగట్టి కొలవగలర!
మళ్ళి నా కడుపుపండి బిడ్డల్ని కంటేను
చంపకుండ వుంటామని హామీని ఇవ్వగలర?
చెరచకుండ వుంటామని బాసచేసి చెప్పగలర?
బిడ్డల్నె కనకుండా మానుకోమంటారా?
చచ్చినా మానుకోను చావటం కోరుకోను
కనకుండ మానుకోను చెరిస్తే ఊరుకోను
కొడుకుల్తొపాటు నేను కత్తుల్ని కంటాను
కూతుళ్ళతోటి నేను కొడవళ్ళకంటాను
పౌరుషం పాలిచ్చి వీరుల్ని చేస్తాను
మీపాలబడకుండా కాపాడుకొంటాను
వీరుల్నిగన్నతల్లి వీరమాత నౌతాను
నే వీరమాతనూ....నే దళితమాతను!
నే దళితమాతనొహో! నే వీరమాతనొహో!

ఉ. సాంబశివరావు
ఎదురీత
డిసెంబర్ 91

# దళిత పులులు

దళిత పులులమ్మ
కారంచేడు భూస్వాములతోనే
కలబడి నిలబడి పోరుచేసినా ॥ద॥

కారంచేడులో కలదొక పల్లె
పల్లె పేరురా మాదిగ పల్లె
మాలాసాయిబు వడ్డెరజాతికి
మాదిగపల్లె తల్లిలాంటిది
శరణుకోరినా శత్రువునైనా
ప్రేమతో చూసే పేదలపల్లె
మాదిగపల్లె పేరు వింటెరా
కమ్మదొరలకే కాళ్ళు వణుకురా
బరిశె నెత్తుకుని పందెమాడితే
ఊరి దొరలకు ఉచ్చబడతది ॥ద॥

కోటిబాధలతో మునిగి తేలినా
ఆడిన మాటకు అటుఇటుగారు
వడ్డీలమీద వడ్డీలు గట్టి
నడ్డివిరిగినా బుద్ధిమంతులు
మట్టిలో మట్టై మన్నులో మన్నై
పండించిన ప్రతి వడ్లగింజను
బలిసిన దొరల గరిసెలు నింపి
పస్తులు పండే కష్టజీవులు ॥ద॥

తరాల నుండి యుగాలనుండి
భూమిని నమ్మి బతికినోళ్ళురా
చెమట ఇంకని చేనులేదురా

నెత్తురింకని ఇత్తులేదురా
పత్తిచేలకు ప్రాణం వాళ్ళే
మొలిచే మొక్కకు ఎరువులు వాళ్ళే
కామందుకుల కమ్మదొరలకు
కడుపులో మొలిసిన కత్తులు వాళ్ళు ॥ద॥

పూరిగుడిశెలో పుట్టి పెరిగినా
మట్టిజీవులు ఎట్టిజీవులు
తన్నిన గుద్దిన తిట్టిన కొట్టిన
ఎదురు చెప్పనీ ఎడ్డిజీవులు
చెల్లిని తల్లిని అక్కను లాగిన
నోరువిప్పని మూగజీవులు
కర్మారాత క్రైస్తవ మతమని
కృంగిపోయినా కష్టజీవులు
కాలిన మనసుతో మండేగుండెతో
నివురు గప్పినా నిప్పురవ్వలు
భూకామందుల మదమణచుటకు
అంటుకున్న పెనుమంటలు వాళ్ళే ॥ద॥

కోడెలాంటి కుర్రవాళ్ళురా
సామునేర్చినరు చదువునేర్చినరు
అరే ఒరే అని ఎవడన్నంటె
మాటచక్కగా రానియ్యంటరు
ఉన్న గుడ్డలు తెల్లగా ఉతికి
మల్లె పువులా పిల్లలుంటారు
అస్తులు పాస్తులు లేకున్నా మాకు
ఆత్మ గౌరవం ఉన్న దంటరు
కుర్చిలో కూర్చుని కాఫీ తాగితె
ఉన్న దొరలకే కడుపులో మంట

ఎవడబ్బసొత్తు మేం తింటలేమురా
మా సొత్తే మా ఇష్టమంటారు ॥ద॥

కాలువ కింద వేల ఎకరములు
కమ్మదొరతనం కాళ్ళకిందరా
మంత్రుల కంత్రుల సీలింగొచ్చిన
సెంటు భూమి చెయి జారలేదురా
పొగాకు రెమ్మలు పొగరు పెంచినయ్
పత్తిచేలు మరి నెత్తికెక్కినయ్
వడ్డికి వడ్డి సినిమారంగం
వరాల వర్షం నరాల కెక్కె
కమ్మ దొరతనం కాదని అంటె
కాలువలోనా శవం తేలురా
అట్టి దొరలకు పక్కలో బల్లెం
మాదిగ పల్లె దళిత పులులురా ॥ద॥

మాదిగ పల్లెకు గుండెకాయరా
పేదలబిడ్డ దుడ్డు వందనం
కాశెబోసుకుని కట్టెపట్టితే
కత్తుల వర్షం నేలరాలురా
చెంగున దూకి సాముచేసితే
భూతల్లె మరి దద్దరిల్లురా
చేతికర్రనే చేతికందితే
వేయిమందినే ఎదురుకొంటడు
ధర్మయుద్ధము తప్ప ఎన్నడు
దుడ్డుపట్టడు దుంకులాడడు
దుడ్డువందనం పేరు వింటెరా
దోపిడి దొరలకు వణకు పుట్టురా
మోసకారులు కత్తులు దించితే
నెత్తురు మడుగులో పిడికిలెత్తెనురా

ఎరుపురంగులో మెరుపురంగురా
పల్లె వీరుడు దుడ్డు రమేషు
మాదిగ పల్లెకు మంట తగిలెనని
పొలాల నుండి పల్లెకు చేరి
ఆయుధమెత్తి రండిర కొడక
అంతుచూపుతా ఆట ఆడిస్తని
పిరికి పందలు నరుకుతు ఉంటె
నెత్తురు వరదలో కలబడి పోరిన ॥ద॥

74 ఏండ్లు నిండినా
పండు ముసిలిరా తెళ్ళమోసెరా
మాదిగ పల్లెకు ముత్యం లాంటి
తేళ్ళముత్తయ్య తెగించి నిలిచె
నెత్తినెరిసినా వయసు పండినా
రోషం కల్లా రైతుబిడ్డలు
దోపిడి దొంగలు బరిశెలు దించితే
కన్నీరెట్టలే కాల్లు పట్టలె
పంట పొలాలకు నెత్తురు చల్లి
దోపిడి దొరలకు మంటలై నరు ॥ద॥

మాదిగ పల్లెకు అండదండరా
బల్లెంలాంటి ఏవాసన్న
అడుగులో అడుగు ఆరడుగులురా
కండపుష్టిరా గుండెపుష్టిరా
ఎన్నికలప్పుడు యేవాసన్న
కమ్మదొరలనే కాలరుబట్టె
గడ్డపారలు గొంతులు దించితే
గంతులేసి దొర గుండెలో తన్నెను ॥ద॥

వీరవనితలకు వీర వనితలు
పల్లెలో పుట్టిన దళిత తల్లులు
పండ్లు ఫలాలతో ఎంటోడొస్తె
వలవేసింద్రు నిలదీసింద్రు
నీవాల్లు నీ దగ్గరి వాల్లు
పండ్లు ఫలాలు తినేటిదొరలు
పండులు ఫలాలు నెయ్యిని తాగి
పడుచు పిల్లలను చూచె దొరలు
గంజిలో ఉప్పుకు పిడికెడు నెత్తురు
అమ్ముకునే మా కెందుకు పండులు
రామారావ్‌గాడి బత్తాయి పండ్లను
ఎగరదన్నినా వీరవనితలు ॥ద॥

అన్నలార ఓ అక్కల్లారా
తల్లురార ఓ తండ్రుల్లారా
కాంగ్రెసోడి నల్లడబ్బును
కాలదన్నినా వీరులు మీరు
రామారావ్‌గాడి నెత్తురు కూడును
చెత్తబుట్టలో విసిరేసింద్రు
ముష్టి డబ్బులు మాకు వద్దని
మరో చరిత్రను రాసి పెట్టినరు ॥ద॥

అన్నలార దళితన్నల్లార
మాయన్నా పోరన్నల్లారా
అదిగోచూడ ఆదిలాబాదు
కరీంనగరులో కష్టజీవులు
భూమికోసము భుక్తికోసము
బరిసెలెత్తినరు బాకులెత్తినరు
దళిత జీవుల విముక్తిపోరు
భూమి పోరుతో ముడిపడి ఉంది ॥ద॥

గద్దర్

## మాయమ్మ ఆలీసమ్మ!

అమ్మ నీకు వందనం ॥మాయమ్మ ఆలీసమ్మ॥
తల్లీ నీకు వందనం ॥మాయమ్మ ఆలీసమ్మ॥

కారంచెడు భూస్వాముల
గుండెల్లో గునపమైన ॥అమ్మా॥

పొద్దంత కూలి చేసిన
పస్తుల బత్కే నీది
ఎద్దోలె పని చేసిన
ఎండిన పేగులె నీవి
చినిగిన చింపులల్లో
చింపుల బత్కు నీదమ్మో
నీ బత్కు దోసుకొని
బలసీన దొంగ దొరలు
నీ గుడిసెకు నిప్పెట్టిరా ॥మాయమ్మ ఆలీసమ్మ॥
నీ గుండెకు నిప్పెట్టిరా ॥మాయమ్మ ఆలీసమ్మ॥ ॥అమ్మా॥

మనుష్యులయ్యేనందుకు
మనిషిలా చూడుమన్నవ్
పల్లెమీద దొరల
జులుం సెల్లదన్నావ్
దొరల చూపులన్ని
విషం చూపులన్నావ్
తల తెగిపడిపోయిన
తలవంచి బత్కనన్నవ్
దొరలు పగపట్టిరా ॥మాయమ్మ ఆలీసమ్మ॥
నిన్ను పిస్కి ప్రాణం తీసిరా
॥మాయమ్మ ఆలీసమ్మ॥ ॥అమ్మా॥

ఇండ్లదీపం పెట్టేటోన్ని
సస్తె అగ్గి పట్టెటోన్ని
కాల్లు సెతులు ఆడనప్పుడు
కలో గంజో బోసేటోన్ని
దయలుగల్ల సెమలుగల్ల
నీ కొడుకు వందనాన్ని
దొరతనాని కెదురీదిన
నీ దుడ్డు వందనాన్ని
నీ కండ్లముందె నరికిరా ॥మాయమ్మ ఆలీసమ్మ
నీ కడుపు అగ్గిబెట్టిరా ॥మాయమ్మ ఆలీసమ్మ॥ ॥అమ్మా॥

నీ నెత్తురు గుడ్డునేమొ
కత్తులతో పొడ్చినారు
చెట్టంత నీ కొడుకు
కుప్ప కూలిపోయినాడు
ఆఖరి చూపులు చూసి
అమ్మా అని నినుపిల్సితే
కడసారి కొడ్కును చూసి
కండ్ల కద్దుకున్నావూ
పగ దీర్చుకొంటానాని
ప్రతిజ్ఞలు చేసినవ్
నివ్ సిగముడి ఇప్పావమ్మొ ॥మాయమ్మ ఆలీసమ్మా॥
నివ్ సింహమయ్యి నావమ్మొ
॥మాయమ్మ ఆలీసమ్మా॥ ॥అమ్మా॥

పూలు పండ్లు తీసుకొని
పేరంటం కొచ్చినట్లు
ఎంటోడు, వెంగళరావు
ఎలా, కథా అడుగొచ్చిరి
పైసలొద్దు, ఫలం వద్దు

స్థలం వొద్దు, సంపదొద్దు
కన్న కొడుక్కు నిమ్మన్నవ్
నా కొడుక్కు నివ్వకుంటరో ||మాయమ్మ ఆలీసమ్మా||
నేను కాళినౌతానన్నవో ||మాయమ్మ ఆలీసమ్మా|| ||అమ్మా

దగ్గుపాటి దొరల జులుం
దగ్గర పడ్డది అన్నవ్
ఎంటోడి సద్దకునికి
ఎయ్యాలి ఉరి అన్నవ్
నరహంతకు లీలని
సాక్ష్యం చెప్పుతునన్నవ్
గొంతెత్తి ఈ సత్యం
గోవులాగ అర్సినావు
నీ గొంతు పిస్కి సంపిరో ||మాయమ్మ ఆలీసమ్మా||
నీ పంతెం తుడ్సేసిరా ||మాయమ్మ ఆలీసమ్మా|| ||అమ్మా||

కారంచెడు చచ్చిపోదు
కథగా దిది కసి అన్నవ్
చెరచ బడ్డ చెల్లి తల్లి
చేస్తరు యుద్ధం అన్నవ్
కుములుతున్న కూలితల్లి
కుంప బైతదన్నావ్
కడ్పు కాలిన తల్లులు
కొడవండ్లెత్తుత రన్నవ్
నేను దొరల నీడనంటివా ||మా యమ్మ ఆలీసమ్మా||
వాళ్ల పాడెనైతనంటివా ||మా యమ్మ ఆలీసమ్మా|| ||అమ్మా||

కారంచెడు దుడ్డు ఆలీసమ్మకు జోహార్లు!
దొరల జులుంకు గోరి కడ్తాం!

గద్దర్

## శంబుకుని తల నరికి వేసి

శంబుకుని తల నరికివేసి
జ్ఞానతృష్ణను హత్యచేసి
ఏకలవ్యుడి వేలుకోసి
ప్రతిభ ప్రాణం తీసినోళ్ళే
మన పాలకులుగా నేటికున్నారా - నా దళితులారా....
మన పాలి టెములై పొంచి ఉన్నారా - నా దళితులారా....

తాత తండ్రుల నాటినుండి
కర్మబాధలు తప్పనోళ్ళు
కడతేరని కష్టాలకు వాళ్ళు
కారణాలు అడగబోతే
పోయిన జన్మలో మీరు జేసిన
పాపమే ఈ బాదలంటూ
ఈ జన్మలో మా సేవ జేపితే
ఆ పాపం చెల్లిపోవునంటూ
బ్రాహ్మణత్వపు వాదులు
బహు జ్ఞానబోధలు జేసుకొస్తూ
కర్మనే మన చేత బెట్టారా - నా దళితులారా....
మన సర్వమెల్ల దోచుకున్నారా - నా దళితులారా ...

యజ్ఞయాగం పేరమనలను
అగ్నికాహుతి చేసినోళ్ళే
వేదవిద్యలు నేర్వబోతే
నాల్కలను తెగగోసినోళ్ళే
ఉపనిషత్తులు విన్నవంటు
చెవ్ల సీసం పోసినోళ్ళే
మన హక్కులన్నీ కాలరాసారా - నా దళితులారా....
కుక్కలాంటి బత్కుజేసారా - నా దళితులారా ...

దుష్టులు దుర్మార్గులు
ఈ దేశపు భూస్వాములు
తిండి బలిసి కండ బలిసి
అండనున్న ధనం బలిసి
కండ్లకెక్కిన కామ దాహపు
కోర్కెలెల్లా తీర్చుకోను
కన్యలగు మన దళిత స్త్రీలను
కత్తికే పెళ్ళంటు జేసి
బసవి అంటూ జోగి అంటూ
ఊరికే ఇది భార్య అంటూ
భారతములో కుంతిదేవోలే - నా దళితులారా....
ఇంటింటికొక కుంతుల్ని జేసారా - నా దళితులారా....

వద్దురా ఈ బాదలొద్దు
విలువలేని బతుకులొద్దు
నీచమైన బతుకు పెట్టిన
మ్లేచ్ఛుల ఆచారమొద్దు
కులంపేర ఇజ్జతిచ్చే
ధర్మమే మనకసలు వద్దు
రాజ్యమేలిన జాతికె
ఈ లోకమందు ఇజ్జతుంది
రాజ్యమేలే రోజుకొరకన్నా - నా దళితులారా....
రోజుపోరు నువ్వు జేయన్నా - నా దళితులారా....

మాష్టార్జీ
దళిత కళామండలి పాటలు
1992

## చుండూరు పాట

గండర గండర గండ
దళితబిడ్డ లేవరో
కత్తులు గొడ్డల్లు బట్టి
కక్ష తీర్చుకోవరో
సుండూరు హత్యలూ
మండించి గుండెలో
నరికినోడ్ని పట్టుకొని
నరుకుదాము రండిరో ॥గండర॥

నీరుకొండ హత్యలకే
నీతులెన్నొ - సెప్పెనూ
కారంసెడు - పావులుకీ
కథలెన్నో - జెప్పెను
మాలోలు - సావులుకే
మోలాలు గొట్టినా
ఎములోల్ల - రాజ్యమిదే
ఎదిరించా రండిరా ॥గండర॥

ఆంధ్రాలో - అగ్రకులం
కేంద్రంలో - అగ్రకులం
పదవుల్ని పట్టుకొని
పాలించు - తుందిరో
ఆమద్దిన - దళితకులం
దిక్కులేక వుందిరో
యుద్ధాన్ని - జెయ్యరో
గద్దెమీదకెక్కరో ॥గండర॥

పట్నంలో - వేపారికి
పల్లెలోను - భూసామికి
సి. ఐ. లు - యస్. ఐ. లు
రక్షణ - ఇస్తుండ్రురో

నీ ప్రాణం - తీసినా
కేసురాయరాడురో
నీ ప్రాణానికి - ప్రాణమే
సమాధానమియ్యరో ॥గండర॥

ఆదినుండి అగ్రకులం
అధికారం నూడరో
రాజుకామ - కర్ణుడనీ
సభనుండి - గెంటెరో
ఏకలవ్యుని - పని ఏకం
నరికించెరో
కాటికెల్లెదాక - అల
కటిక బుద్ధి పోదురో ॥గండర॥

రామారావు - పాలనలో
కారంచెడు హత్యలు
నేదురుమల్లి - పాలనలో
సుండూరు - హత్యలు
ఆ పాలన - ఈ పాలన
ఏ పాలన - వచ్చినా
నీ పాలన రానిదే - నీకు దారి లేదురో ॥గండర॥

ఓటు నువ్వు - ఎయ్యకుండ
సీటురాదు - నాయాలుకి
పాటునువ్వు - పడకుండా
బువ్వలేదు - పెద్దలకీ
దళితన్నల - రాజ్యంకై
దండు నడుపు - తున్నట్టి
దండధరుల - గిరిజనులా
దండుతో కలవండిరో ॥గండర॥

వంగపండు ప్రసాదరావు

# చుండూరు గ్రామాన

చుండూరు గ్రామాన జరిగెను ఘోరం ॥ఓయమ్మలారా, ఓయమ్మలారా॥
కన్నీటి కథ ఇది మరచిపోలేము ,,
పోలీసు అండతో అగ్రకులాలు ,,
ప్లాను లేసినారు పండ్లు గొరికిండ్రే ,,
ధన మదముతో కుల కావరముతో ,, ॥చుం॥

గొడ్డండ్లు బరిసేలు కత్తులతోని ,,
వెంటాడి వేటాడి నరికేసినారే ,,
సంచుల్లో నింపిరి శవాలనమ్మో ,,
మాయము జేసిరి కాల్వల్లో విసిరి ,,
దొరల రాజ్యములోన దిక్కెవ్వరమ్మో ,, ॥చుం॥

దళితులు గోడున విలపిస్తున్నారే ,,
అన్నలా తమ్ముండ్ల కోల్పోయినారే ,,
ఓట్లడిగె నాయకుల జాడ లేదాయే ,,
జడ్జీలు లాయర్లు పోలీసులంతా ,,
బలిసినోళ్ళకు బంధువులయ్యెనరనీ ,,
కుమిలి కుమిలి పడి దిగులు జెందేరే ,,
రామన్న 'సి.యం.' చుండూరు కొస్తే ,,
కపటవేషగాళ్ళ ప్రేమలొద్దండ్రే ,,
నష్టపరిహారము వద్దన్నరమ్మో ,,
న్యాయంగావాలంటు నిలదీసినారే ,,
దోషుల శిక్షించి కాపాడుమనిరే ,,
కారంచేడులోన మాదిగలనూ ,,
చంపినోళ్ళకు శిక్షవేయనే లేదే ,,
నీరుకొండలోన మాలోల్లనమ్మో ,,
చంపేసి పార్టీల గొడవలన్నారే ,,
మనసులో గాయాలు మాననే లేదే ,, ॥చుం॥

ఉత్తరప్రదేశులో బీహారులోన ,,
హరిజనుల నరుకుట ఆగనే లేదే ,,
చుండూరు ఘోరంతో కథ ముగిసిపోదే ,,
కండ్లు మూసుకుంటే ఆగిపోవమ్మో ,,
దేశాన్ని నడిపేది కష్టించేటోళ్ళే ,,
కష్టించే ప్రజలాను కలువనియ్యారే ,, ॥చుం॥

నరరూప రాక్షసులు బ్రతుకనియ్యారే ,,
మాలమాదిగలు ఒకటయ్యి లేచి ,,
పులులయ్యి లోకాన బ్రతుక నేర్వాలే ,,
పోరాడె ప్రజలాకు అండగుండాలే ,,
వర్గపోరులోన ముందుండాలమ్మో ,,
దోషులైన దొరల వదిలిపెట్టొద్దే ,,

యన్నార్
దళిత కళా మండలి పాటలు
1992

## 'హరి'జనులం కాదు

హరికి పుట్టినోడ్ని గాదు - అమ్మయ్యకి పుట్టినోడ్ని
హరిజనుడ్ని గాదు నేను - అంటరాని కులపోడ్ని
అవునంటావా? గాంధి కాదంటావా? ఏంది
ఏమంటావూ? గాంధి అవునంటావా? ॥అవు॥

మాదిగోడ్ని మానవుడిగ - గౌరవించ మనకుండా
హరిగానీ పేరుబెట్టి - గౌరవించమంటావా?
మాయజేసినవునీవని - మాయలోడు గాంధీయని
ఆనాడె జెప్పినాడు - మా డాక్టర్ అంబేడ్కర్ ॥అవు॥

హరిజనుడంటర్థమేంది? హరికి పుట్టినోడుగదా
హరినుండీ జనిమించిన - జనుడే హరిజనుడు గదా
అయినా నే నడుగుతున్న - హరికి నేను పుట్టానా?
బాపనోడు హరిగానీ - మొకం నుండి పుట్టిండట
క్షత్రియుడూ హరిగానీ - చాతినుండి పుట్టిండట
కోమిటోడు హరిగానీ - తొడల్నుండి పుట్టిండట
శూద్రులంతా హరిగానీ - కాళ్ళనుండి పుట్టిరనట
ఈ పుటకల జాబితాలో - నా పుటకకు జాగలేదు
నన్నుగంటె మైలబడత - నని జెప్పి హరిగాడూ
కనను పోర కడజాతీ - మాలోడని కసిరికొడితె
మా అమ్మే కందిగదా - 'మహాత్ముడా' అవునుగదా?
అబద్దాలు ఆడమాకు - సత్తెహరిశ్చంద్రమూర్తి ॥అవు॥

నన్ను గనని వాని పేరు - నాకెందుకు పెట్టినావు
కడజాతని విడగొట్టిన - కుటిలుడె హరిగాడుగదా
చతుర్వర్ణ వ్యవస్థకీ - కన్నతండ్రి వాడేగదా
నన్నెందుకు కనలేదని - నిలదీసీ అడగకుండ
ఆడిపేరె నాకు బెట్టి - నాకు కన్నతండ్రిడిజేసి

అమ్మో ఓ మహాత్ముడా! అమ్మకాళాంతకుడా!
హరిజనోద్యమం పేరిట - మమ్ముల విడగొట్టావా?
నా జన్మరహస్యాన్ని నాకు ఇప్పి చెప్పినోడు
నన్ను నన్నుగా జూసీ - గౌరవించమన్నవాడు
మా జాతికి దారి జూపి - మీకు బుద్ధిచెప్పినోడు
పేరుతోనె మారదు - మన బతుకు అనీ చెప్పినోడు
పోరుజేసి గౌరవాన్ని - పొందుమనీ చెప్పినోడు
మా జాతికి అంబేద్కర్ - కొత్తజన్మ నిచ్చినాడు
అందుకే....
హరిజనులం గాదుమేము - అంబేద్కర్ జనులం!

ఉ. సాంబశివరావు
14 అక్టోబర్ 1991

# ఎన్నిసార్లు ఈ ఘోరాలు?

ఎన్నిసార్లు ఈ ఘోరాలు
ఎంతమందిమి వోరుగుదాము
దళితన్నా దండు గట్టాకుంటె నిలువలేము
దళితన్నా బడితెత్తాకుంటె బ్రతుకలేము ॥ఎన్ని॥
కట్టే బట్ట తెల్లగుంటె వాని కండ్లు మండబట్టె
కాళ్ళజోడు మెరుపు ఉంటె వాని కడుపు మండిపోయె
వాని కాళ్ళకాడ అనగమని హద్దులెన్నో గీసినాడు
దళితన్నా వాని అబ్బా సొత్తు దింటున్నామా
దళితన్నా వాని కదిరి బెదిరి బ్రతుకుతేంది ॥ఎన్ని॥
గద్దరెక్కల కోళ్ళపెంచి గాంద్రు మేకపోతులిచ్చి
కారిన నీ చెమట చుక్కలు గాదెలలో గింజలు జేసి
దళితన్నా మన కష్టఫలం మెక్కినోడే
దళితన్నా మనల కక్షగట్టి నరుకుతుండు ॥ఎన్ని॥
చెంబులకొద్ది పాలు తాగి చెయ్యి ఆరని నెయిజుర్రి
కమ్మనైన పండ్లు ఫలం దున్నలోతె మెక్కి బలిసి
దళితన్నా వాళ్ళ కండ కావరము దించుదాము
దళితన్నా మనం కత్తులయ్యి కదులుదాము ॥ఎన్ని॥
కలిగినోని అగ్రకులం కావలికుక్క పోలీసోడు
ఎంటబడి తరుముకుంటు ఎగదోసే గూండాగాళ్ళ
దళితన్నా వాడు సత్తెనాశనమయిపోని
దళితన్నా మన ఉసురు తగిలి సావకపోడు ॥ఎన్ని॥
పురుడుబోసుకున్న తల్లి తల్లడిల్లి మండబట్టె
పొత్తిళ్ళున్న పసికూనలు పొలికేకలు పెడుతున్నారు
దళితన్నా నువు పిడికిలెత్తి బాసచేయి
దళితన్నా నువు పగబట్టి పోరుజేయి ॥ఎన్ని॥
తోలుదీసె ఆరెతోని వాళ్ళ తిత్తి దీద్దామ
తీసిన ఆ తోలుతోని జెమిడికేమో జేద్దాము
జెమిడికెంపి వీరులకు దండాలంటు పాడుదాము
దళితన్నా నువు చస్తే పులి చావు సావు
దళితన్నా తిరుగొస్తే వీరుడు నువ్వౌవుతావు ॥దళితన్నా॥

అరుణోదయ వెంకన్న: దళిత కళా మండలి పాటలు 1992

# మాల మాదిగ బతుకులొద్దు

మాలోడి బతుకొద్దు - మాదిగ బతుకొద్దు
ఊరికి దూరంగా ఎట్టి బతుకులు వద్దు
కత్తిలా నీవు మెరవరన్న మాయన్న
దొరల తోలును వలవరన్న ఓరన్న ॥మాలోడ॥

సచ్చిన పశువును బైట గుంజేశావు
చర్మాన్ని తీసావు చెప్పులే కుట్టావు
రోతసాపుచేసి మ్యాతరివైనావు
కండల్ని కరిగించి పంటల్ని తీసావు
మన రక్తమే తాగెటోడు మాయన్న
మన మీదికే కత్తి నూరె ఓ రన్న ॥మాలోడ॥

కారంచేడులో కమ్మ భూస్వాములు
మాల మాదిగోల్ల నరిగోస పెట్టిరి
అంటరానోడని గెంటి పారేసిరి
తల్లుల ఎదుటనే పిల్లల చెరిచిరి
సచ్చిన బతికిన సాక్ష్యాన్ని చెపుతనని
అలిశమ్మ కదిలితే నలిచి పారేసిరి
కాలుకింది చెప్పుకంటె ఓరన్న
మన బతుకులే హీనమాయే ఓరన్న ॥మాలోడి॥

తాతల కానుండి తన్ని సంపుతుంండ్రు
ఎట్టి శాకిరి తోటి తొక్కి పారేసింండ్రు
చుండూరు మాలోల్ల గుండెల్లో పొడిచిరి
నీరుకొండపైన నిప్పులే పోసిరి
పదిరి కుప్పాన్ని తగుల పెట్టేసిరి
ఎదురు తిరిగేటోల్ల ఎగిరేసి నరికిరి
రాబందుల రాజ్యమాయె ఓరన్న
రామచిలుక మూగబోయె మాయన్న ॥మాలోడి॥

హరిజన్ల చంపిన చెంచురామయ్యకు
అన్న రామారావు చేతులందించాడు
పదిరికుప్పాన్ని కూల్చినవాళ్లకు
కన్నుగీటినాడు చెన్నరెడ్డిగాడు

చుండూరు దొరలకు అండవున్నానని
నెదురుమల్లిగాడు పిల్లిలా ఎగిరిండు
మనవోట్లతో గెలిసినోడే మాయన్న
మనమీదికే కాలుదువ్వే ఓరన్న ||మాలోడి||

కమ్మనాడు ఒకడు కాపునాడు ఒకడు
రెడ్డిరాజులమాని తెడ్డు చూపెనొకడు
రక్తాన్ని తాగేటి దొరల మా యన్న
రంగంత ఒక్కటేరన్న ఓరన్న ||మాలోడి||

దళితులు ఏకమై దండోర కొట్టాలి
కూలీలు ఏకమై కన్నెర్రచేయాలి
ఊరిలో దొరగాన్ని ఉరిపెట్టి చంపాలి
వాడవాడకు ఎర్రజెండలే ఎగరాలి
డప్పుపై దండోరా కొడితే మాయన్న
ఢిల్లీలో గుండెలదరాలి ఓరన్న ||మాలోడి||

విముక్తి
నలుపు
సెప్టె-16 - అక్టో-15, 1991

## కాము మేము హిందువులం

నమ్మొద్దుబాబో.... నయవంచకుల్ని
నమ్మొద్దుబాబో.... నరహంతకుల్ని
నమ్మినమంటే నయవంచకులను
నమ్మినమంటే నరహంతకులను
తిమ్మిని బొమ్మిని జేస్తరువాళ్లూ
నమ్మిన వాళ్ళనె దోస్తరువాళ్లూ ॥నమ్మొ॥

కార్ సేవజేస్తమనీ మార్ సేవజేసినారు
మందిరాన్ని కడతమనీ మసీదె కూల్చినారు
భజనపూజజేస్తమనీ బడితెపూజ జేసినారు
పథకాలే ఏసుకోని పొరపాటని బొంకినారు
రాముడనీ దేముడనీ భక్తి జపం చేసినారు
రామరామ అంటూనే రక్తం పారించారు
చెప్పేదీ ఒకటిరో చేసేదింకొకటిరో
చెవులో పువ్వెట్టెరో పువ్వుగుర్తు అద్వానీ ॥నమ్మొ॥

కసాయి బరిసెలకు త్రిశూలం తొడుక్కోని
మసీదుకూలగొట్టి మతకలహం రెచ్చగొట్టి
వేలమంది ప్రాణాల్ని మంటల్లోమాడ్చినట్టి
కసాయికాషాయ హిందూఫాసిస్టుమూక
కల్లబొల్లికబుర్లన్ని కట్టుకథలేరన్న
గుట్టువిప్పి చూశామా కుట్రబయటపడునన్న
వేషానికి మోసపోయి రోషానికి రెచ్చిపోయి
ఉచ్చులో పడకండీ ఉన్మాదులుకాకండీ ॥నమ్మొ॥

రాంభజనచేసేదీ రామభక్తితోటికాదు
మసీదుగూల్చేదీ మందిరాలకొరకుగాదు
ముస్లింలచంపేదీ హిందువులాకొరకుగాదు
మైనార్టీవాళ్ళమీద హిందువులను రెచ్చగొట్టి
మెజార్టీహిందువులా ఓట్లన్నీరాబట్టే
రాజకీయలబ్ధికొరకు ఆడుతున్న ఆటఇదీ
అధికారంకొరకు వాళ్ళు పన్నుతున్న కుట్రఇదీ
గుట్టువిప్పిచూడరో కుట్రను పసిగట్టరో
కుట్రదార్ల కుట్రలో కొట్టుకుపోవద్దురో ॥నమ్మొ॥

మనమంతా హిందువులట - మనమంతా బంధువులట
గంగసింధుబిందువుల - రక్తసంబంధువులట
దొంగకొంగజపంచేసి - చేపలు నాబంధువులని
దరిచేరిన చేపల్ని - దర్జాగా భోంచేసిన
దొంగకొంగ అగ్రకులం - బాపనోళ్ళుబనియాలు
పథకమొకటి ఏసి వాళ్ళు - హిందువులని అంటున్నరు
బంధుత్వమె చేద్దామా - బండారం చూద్దామా
మనం మనం బంధువులం - హిందువులం అయితేను
మాదిగలను పూజార్లుగ - మందిరాల్లో పెడతారా ?
అగ్రకులం ఆడోళ్ళను - బీసీవాళ్ళకిస్తారా ?
మంచంపొత్తు కలుపుతార - కంచంపొత్తు కలుపుతారా ?
మా ఆరెలు పంచుతాము - మీ ఆస్తులు పంచుతార ?
ముఖ్యమైన పదవులన్ని - ముఖ్యమంత్రిపదవులన్ని
మాలోళ్ళకి ఇస్తారా ? మాదిగోళ్ళ కిస్తారా ?
అవునంటేనె హిందువులం - అపుడేరా బంధువులం
కాదంటే బహుజనులం - కాము మేము హిందువులం ॥నమ్మొ॥

ఎస్సీలం, ఎస్టీలం, బీసీలం, బహుజనులం
అణగారినవర్గాలం, అణగారినకులాలం
ముస్లింలు, క్రిస్టియన్లు, బౌద్ధజైన, శిక్కులంత
మైనార్టీవాళ్లంతా మాతోటిచేరితేను
భరతఖండజాతులన్ని మాతోటికలిస్తేను
మేమేరా మెజారిటీ ! మాదేరా మెజారిటీ !
మైనార్టీ అగ్రకులం, బాపనోళ్ళు బనియాలు
భూస్వాములు, బూర్జువాలు, దగుల్బాజీ దళారీలు
సాగించే పెత్తనాన్ని సాగదు అంటున్నందుకు
పెత్తనాలు కూలిపోయె రోజే వస్తున్నందుకు
కొత్తకుట్రపన్నారా! 'మనమంతా హిందువుల'ని
'తురకోళ్ళని నరకండని' హిందువులను రెచ్చగొట్టి
హిందూ ఐక్యత పేరిట మీతోటికలుపుకోని
మళ్ళీ మీ పెత్తనాన్ని సాగిద్దామనుకొనేటి
నయవంచనసాగదింక, నమ్మి మోసపోమింక ॥నమ్మొ॥

ఊ. సాంబశివరావు
ఎదురీత, జనవరి 1993

## దళిత్ ముస్లిం - భాయీ భాయీ !

బోలోరే బోలో! బోలో
దళిత్ - ముస్లిం భాయీ భాయీ!
దూలారే దూలా! దూలా
దళిత్ - ముస్లిం భాయీ భాయీ!
యా హూస్సేన్ - దూలా
యా హుస్సేన్ - దూలా
దూలా దూలాడదాము -
దూలాటా ఆడదాము
చేయి చేయి పట్టుకొని -
చుట్టు కాముడాడుదాము ॥బోలో॥

బెమ్మయ గురువు - సిద్దయ శిష్యుడు
బెమ్మయ సిద్దయ - గురువూ శిష్యులు
బ్రాహ్మడు కాదూ - బెమ్మయ గురువు
సూద్రుడు బెమ్మయ - శిష్యుడు సిద్దయ
అశన్న అన్నా - కాశిం తమ్మి
అశన్న కాశన్న - అన్నాదమ్ములు
కలతలు తెలియని - కలివిడిమాది
కలహం ఎరుగని - స్నేహం మాది
హస్సేన్ హుస్సేన్ - అశన్న పోశన్న
దళిత్ ముస్లిం - భాయీ భాయీ
కలతలు లేవని - తెలపర భాయీ ॥బోలో॥

ఇద్దరి చేతులు - కలపర భాయీ
హిందూ హిందూ - భాయీ భాయని
హిందూ ముస్లిం - స్నేహం లేదని
హిందూ ముస్లిం - కలహం రేపి
ముస్లింలంతా - శత్రువులేనని

పరదేశాలా - పాదుషాలనీ
పాకిస్తానుకి - పారగొడతమని
పాకిస్తానుకి - పారెల్లకుంటే
ఖబరస్తానుకి - పంపిస్తామని
కత్తులు దూసీ - హత్యలుజేసే
ఉన్మాదాన్నే - ఎక్కిస్తారా?
పెత్తందారీ - పరాయిజాతీ
ఆర్యపుత్రులూ - బ్రాహ్మల ఆటలు
సాగవురా ఇక - సాగనియ్యమూ
సాయిబులకండగ - నిలబడతామూ ॥బోలో॥

మతం పేరుతో - సాయిబుల చంపే
బ్రాహ్మణ మతమే - వారికి శత్రువు
కులం పేరుతో - దళితుల చంపే
బ్రాహ్మణ మతమే - మాకు శత్రువూ
మాకూ వారికీ - ఉమ్మడి శత్రువు
కుటిల కౌటిల్య - హిందూయిజమే ॥బోలో॥

ఉ. సాంబశివరావు
పాతపాట సాక్షిగా
కొత్తపాట పాడతా
1993

## అగ్రవర్ణాలపని అయ్యిందయో!

అయ్యిందయ్యో - అయ్యిందయ్యో
అగ్రావర్నాల పనీ - అయ్యిందయో
దళితులు పుట్టీ
డప్పును - కొట్టీ
జాతిపితా గాంధీని
గోతిలోకి నెట్టేరు
బాబాసాహబుగార్ని
గుడిలో బెట్టేరూ ॥అయింద॥

చెండాలమని జెప్పి-
ముక్కు- మూసుకున్నోలు
అసింట - అసింటనీ-
అంటరాదవ్నోలు
మలోలు - సదువులు జూసే
సదువుల - సోకులు జూసీ-
బాపనోలు - అమ్మాయిలూ-
కన్నుగొడతన్నారయ్యో ॥అయింద॥

బీర్లు, బారు షాపులలోను
గెస్టుహౌస్ - గదులలోను
మిలటరీ - వంటగాడు
రెల్లీది - పిల్లవాడు
గొడ్డు, దుమ్ము మాంసాలొండి
వడ్డించి - పెడతావుంటే
తాసిల్దారు - శెర్మగారు
తాగి - 'నాకి' తింటన్నాడు ॥అయింద॥

చీపురొట్టి తుడిసినోడు
పాకి వీధి పకీరోడు
ఇంగ్లీషు - మాటలాడి
సూపరెంటవగానే
ఊరుపెద్ద - బుగతగాడు

పంతులయ్య - కర్నపోడు
మాలోడుకి - మంచమేసి
నేల కూకుంటున్నారూ ॥అయింద॥

సర్టిఫికెటు - సదువేకాదు
శాస్త్రాల జ్ఞానంతోను
మాలన్న - మాదిగన్నలు
ఢిల్లీకి - పేరెల్లగానె
ప్రధాని - ముఖ్యమంత్రులు
ఎశెంబ్లి - ఎమ్.ఎల్.ఏలు
గుడిశెలో - దూరుతున్నారూ
కుడితిగెంజి తాగుతున్నారూ ॥అయింద॥

వంక దండ మెట్టినోడుకి
వంగకురా - దళితన్నా
ఆస్తిలో - హక్కుండాలి
అధికారం - మనకుండాలి
అందుకే - పోరాడాలి
అందరం - ఏకమవ్వాలి
భూసోములు - గడ గడ వడికీ
భూములే - మనవవ్వాలె ॥అయింద॥

పండ్లు తెంపి పెడుతున్నోళ్ళము
దొడ్డి బుగ్గి తుడిసినోళ్ళము
ఆరోగ్యం - ఆహారానికి
పరిశుభ్రం - పాకీవాళ్ళం
మా కష్టం - పనుల ఫలం
మీరంతా - అనుభవించి
గోసిపాత - మాకుంచెరా
దేశమేతె నేతల్లారా
దెబ్బతిన్న - మనసులు మాపి
దెబ్బలాడి - సాధిస్తాము "అయింద"

వంగపండు ప్రసాదరావు

## కూసుంటె కుదరదు - తల్లో

కూసుంటె కుదరదు - తల్లో
కొంగు నడుముకు సుట్టు - శెల్లో
చుండూరు సుట్టూర - తల్లో
దండోర వేయమ్మ - శెల్లో ॥కూసుంటె॥

నొసట కుంకుమ శెదిరె - తల్లో
చేతిగాజులు శిట్లె - శెల్లో
ఆలుపిల్లల బాసి - తల్లో
నీ ఇంటోడు బోయిండె - శెల్లో ॥కూసుంటె॥

మంగళ సూత్రాలు - తల్లో
మట్టిలో కలిసెనే - శెల్లో
సంఘమున్నది మనకు - తల్లో
గుండె చెదురబోకు - సెల్లో ॥కూసుంటె॥

కారేటి కన్నీరు - తల్లో
కొంగుతో తుడుసుకో - శెల్లో
పల్లె పల్లె నీకు - తల్లో
మాలపల్లె అండగుండే - శెల్లో ॥కూసుంటె॥

పొంగొచ్చే దుఃఖాన్ని - తల్లో
దిగమింగుకోవాలి - శెల్లో
అడవి అండగుంటే - తల్లో
కలిసి కట్టుగ నడువు - శెల్లో ॥కూసుంటె॥

దేశమంతా జూడు - తల్లో
పల్లె పల్లెలో ఏటు జూడు - శెల్లో
గూడాలనె కాల్చి - తల్లో
మానభంగాలు చేసిండ్రు - శెల్లో ॥కూసుంటె॥

ప్రాణాలతో పట్టి - తల్లో
మంటల్లో తోసిరే - శెల్లో
కామాందులు కలిసి తల్లో
కాముడాడినారే - శెల్లో ॥కూసుంటె॥

ఆకురాయి కొడవలి - తల్లో
మెత్తంగా నూరుకో - శెల్లో
నీ బతుకులో మొలిసినా - తల్లో
బ్రహ్మజెముడును తెగనరుకే - శెల్లో ॥కూసుంటె॥

కలకత్తా కాళివై - తల్లో
బెజవాడ కనకదుర్గమ్మవై - శెల్లో
చుండూరు దుండగుల - తల్లో
పట్టి దండించమ్మ - శెల్లో ॥కూసుంటే॥

జి. అంజయ్య
''నలుపు''
సెప్టెంబరు 16-అక్టోబరు 15, 1991

## జనం

జ్ఞానమొక్కడి సొత్తుకాదన్నా
అది సర్వజాతుల - సంపదోరన్న
లేని దేవుడు - బొమ్మలోపల
వున్నడన్నరు ॥నరుడో ఇన్నావ నరుడా॥

కాలునుండీ మాలవాడు
పుట్టెనన్నరు ,, ,,
సదువురాదని - వూరుబైటా
వుండమన్నరు ,, ,,
మాల అయినా - జాషువా కవి
మహాకావ్యం రాయలేదా ॥జ్ఞానమొక్కడి॥

రాజులేమొ - భుజం నుండి
పుట్టెనన్నరు ॥నరుడో ఇన్నావ నరుడా॥
సూదరాదు - రాజువిద్యలు
శూద్రులన్నరు ,, ,,
కోటలోపల - కోల విద్యలు
నేర్చుకున్నరు ,, ,,
ఎన్ని నేర్చిన - ఏకలవ్యుడు
అర్జునుడ్నే తన్నలేదా ॥జ్ఞానమొక్కడి॥
రాజనీతి కులం హీనులు
రాయరాదని ॥నరుడో ఇన్నావ నరుడా॥

బ్రహ్మ బుర్రలో - పంతులేమో
పుట్టెనన్నరు ,, ,,
రాజ్యనీతులు - రాయడానికి
పెంచుకున్నారు ,, ,,
చెప్పుదీసి - కొట్టినట్టూ -
తప్పు దిద్ది - ,, ,,
కులంలేని - అంబేద్కర్
రాజ్యాంగం రాయలేదా ॥జ్ఞానమొక్కడి॥

చేతితోను విష్ణు - చెక్రం తిప్పినోడు
కాళిందుని కాలుకింద తొక్కినోడు
అవతారాలెత్తుకొని - బతికినోడు
బోయవాని అమ్ము దెబ్బకు -
బోర్లాపడి సచ్చలేదా ॥జ్ఞానమొక్కడి॥

వంగపండు ప్రసాదరావు

# సమరం చేద్దాం రావే

| | |
|---|---|
| రెక్కలు ముక్కలు చేసినా | ॥అక్కా వో అక్కా॥ |
| నీకేమి దిక్కున్నదే | ,, ,, |
| బీడీలు మన్నువడ | ,, ,, |
| బాగుపడ్డ దేమి లేదే | ,, ,, |
| నీ తల్లి నీ ఆయి | ,, ,, |
| నీ చెల్లెలు నీ పిల్లలు | ,, ,, |
| ఎందరెన్ని బీడీలు చేసినా | ,, ,, |
| వోదిచ్చిందేమి లేదే | ॥రెక్కలు ముక్కలు॥ |
| బంగ్లాలు కట్ట లేదే | ॥అక్కా వో అక్కా॥ |
| బంగారోదియ్యలేదే | ,, ,, |
| కడుపునిండ తిండిలేదే | ,, ,, |
| కంటినిండ నిదురలేదే | ,, ,, |
| పడి పడి బీడీలు చేసి | ,, ,, |
| నువ్వో మూలబడి పోతిపే | ॥రెక్కలు ముక్కలు॥ |
| దగ్గు నీకు వచ్చెననీ | ॥అక్కా వో అక్కా॥ |
| దవాఖాణకు నువ్వుపోతే | ,, ,, |
| తంబాకాసన పడదని | ,, ,, |
| నిన్ను బీడీలు మానెయ్యమనె | ,, ,, |
| బీడీలు నువు చెయ్యకుంటె | ,, ,, |
| పూట ఎట్ల గడిచేదే | ,, ,, |
| పొట్ట కూటికోసము | ,, ,, |
| నువు పని మానెయ్యలేదే | ,, ,, |
| రోజులేమో గడవబట్టె | ,, ,, |
| రోగమేమో ముదరబట్టె | ,, ,, |
| దగ్గు ఎక్కువాయెనని | ,, ,, |
| దవఖానకు మళ్ళాపోతే | ,, ,, |
| రెండు వందల రూపాయల | ,, , |

మందులు రాసి ఇచ్చినాడే ,, ,,
కోడి గుడ్డు కోడి కూర ,, ,,
ఎక్కువ నిను తినుమన్న డే ,, ,,
మందులన్ని కొనుమన్న డే ,, ,,
లేకుంటే టీబి అస్తదనెనే ॥రెక్కలు ముక్కలు॥
మెల్లగ నువు ఇల్లుచేరి ॥అక్కా వో అక్కా॥
ఇంట్లో నువు కూసోని ,, ,,
పిల్లలను పిల్చుకొని ,, ,,
దగ్గరకు చేర్చుకొని ,, ,,
డాకుటారు మాటలను ,, ,,
పదే పదే తలుచుకొని ,, ,,
నీకు టీబి రోగమొస్తై ,, ,,
నీ పిల్లలగతి ఏమౌనని ,, ,,
గుండెనిండ దుఃఖముగమ్మె ,, ,,
కండ్ల నిండ నీళ్ళుకమ్మె ,, ,,
కొంగుచాటుముఖం పెట్టి ,, ,,
గోడు గోడు నేడ్చినావే ॥రెక్కలు ముక్కలు॥
నీ ఘోరాలకు కారణం ॥అక్కా వో అక్కా॥
కర్మకానే కాదే ,, ,
నీ కష్టాలకు కారణం ,, ,,
నీ నొష్టిరాత అసలుకాదే ,, ,,
ఒక్కసారి సేట్లదిక్కు చూడె వో అక్కా ,, ,,
దుక్కిమెరం మెక్కిబలిసి ఉన్నరే ,, ,,
ఆడి తల్లి ఆడి ఆలి ॥అక్కా వో అక్కా॥
ఆడి పిల్లాజల్లలు ,, ,,
ఇటు ఉన్న పుల్లదీసి ,, ,,
అటుదీసి పెట్టకుండ ,, ,,
కడుపులోన ఉన్న సల్ల ,, ,,
కదులకుండ కూసోని ,, ,,

| | | |
|---|---|---|
| కాలుమీద కాలేస్కొని | ,, | ,, |
| కాలమెల్ల దీస్తున్నరే | ॥కాలు॥ | ॥రెక్కలు॥ |
| నీ రెక్కల కష్టముతో | ॥అక్కా | వొ అక్కా॥ |
| వచ్చిన లాభాలతోని | ,, | ,, |
| ఖార్కాన్లు పెంచినాడే | ,, | ,, |
| నిన్ను కష్టాల్లో ముంచినాడే | ,, | ,, |
| దుఃఖము నీపాలాయె | ,, | ,, |
| సుఖము ఆల్ల పరమాయె | ,, | ,, |
| కొంగు నడుముకు కట్టి | ,, | ,, |
| తోటోళ్ళను కూడదియ్యే | ,, | ,, |
| ధనస్వాములు భూస్వాములు | ,, | ,, |
| లేని రాజ్యం కోసం | ,, | ,, |
| అందరూ సమానముగా | ,, | ,, |
| బతికే రాజ్యము కోసం | ,, | ,, |
| సంఘమొల్ల అందతోని | ,, | ,, |
| సంగతులెన్నో తెల్సుకొని | ,, | ,, |
| సమ సమాజం కోసం | ,, | ,, |
| సమరం చేద్దాం రావే ॥సావ॥ | | |

సుంకం ఒడ్డయ్య
అదిరిపడుతున్న సంకలనం
తేది. 3-10-81

# మాలోల్ల వేదన్న

తాటాకు గుడిసె కింద
తలరాత తిట్టుకుంటూ
బుగ్గయ్యేనని బతుకు
నువు బాధపడకురన్నా
అగ్గయితే నువ్వే నేడురో - మాలోల్ల వేదన్న
బుగ్గవ్వ దొరలు చూడురో - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

నీ అయ్య చేసినప్పు - నీకయినాదిరా ముప్పు
సైతాను దొరలకాడ - జీతానికున్నగాని
ఆ మిత్తి చెల్లుగాని - అసలప్పు తీరదన్న
నువు కాటికెల్లినాను - నీ కొడుకునొదలదన్న
అప్పుల పేరిటాడు - నిను దోచుక తింటుండు
అయాల తిన్నదంతరా - మాలోల్ల వేదన్న
ఈయాలనే కక్కించరా - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

ఇటుక ఇటుక పేర్చి - వాడిల్లు గట్టిపెడితే
తీరొక్క రంగులేసి - పేరైన బంగ్లగడితే
వాడిగొంతు తడపనీకి - లోతైన బాయితీస్తె
ఆ లుచ్చ దొరగాడు - పచ్చనీల్లు జల్లుకుండు
నిన్నంటనన్న కొడుకును - మాలోల్ల వేదన్న
ఎవడంటకుండ చెయ్యరో - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

నీ కన్న తల్లి పానం - నీ కండ్లముందె తీసె
నీ చిన్న చెల్లి మానం - నీ కండ్లముందె దోచె
నీకున్న పూరిగుడిసె - అగ్గెట్టి బుగ్గిచేసె
ఓపికతో నీవుచూస్తె - ఊపిరితో బతకవన్న
నువ్వు మర్లబడితివంటిరో - మాలోల్ల వేదన్న
ఈ దొర్ల బతుకు సున్నరో - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

చిననాడు నీది బతుకు - చింతలతోనె గడిచె
పెదనాడు నీది బతుకు - బాధలతోనె గడిచె

దొరోని కాలికింద - అరిగిన చెప్పులాగ
తాతల నాటినుండి - నీ రాత మారలేదు
నీ చర్మమొలిచి దొరల - చెప్పులను కుట్టినోడ
ఈయాల మనదివంతు - చూడాల దొరల అంతు
ఈ దొరల తోలువల్చిరో - మాలోల్ల వేదన్న
నువ్వు జోడుకట్టి తొడగరో - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

కులాల పేరు చెప్పి - కూలోల్ల వేరుచేసి
చీలికలు పెట్టి మనకు - ఏలికగా మారినాడు
కూటికి లేనివాల్ల - కులమంతా ఒక్కటేరా
కూలోల్లు ఏకమయ్యి - కూడాలి ఒక్కచోట
ఈ దొరల కోట కూల్చరో - మాలోల్ల వేదన్న
నువు కత్తిగట్టి కదలరో - మాదిగోల్ల మైసన్న ॥తాటాకు॥

శక్తి
"దళిత కవిత" 1992

## గర్జించుడి ! గర్జించుడి !

గర్జించుడి, గర్జించుడి
దళితజాతి చిరుతలార
పంజవిప్పి కండ్లలోన
చంద్ర నిప్పులను చెరుగుడి ॥గర్జిం॥

కుల, మతల కూల్రదోసి
వర్గాలను రూపు మాపి
సమ సమాజ స్థాపనకై
నడుం కట్టి నడవండి ॥గర్జిం॥

ద్రష్టులార, భ్రష్టులార
దగాపడిన హీనులార
రక్తతర్పణ చేయండి
హక్కులను పొందండి ॥గర్జిం॥

తరతరాల దోపిడిలో
దగా పడిన దీనులార
ఎదురుబడి నిలువండి
కడ విజయం మనదండి ॥గర్జి॥

అదిగో అటు చూడు
నగ్సల్ బరి సూర్యుడు
యిదిగో యిటు చూడు
శ్రీకాకుళ గిరిజనుడు
భూమి భుక్తి ముక్తి కొరకు
విప్లవించినాడు చూడు ॥గర్జి॥

బందనాలు తెంచుకోని
బందూకుల నెత్తుకుని
కడ విజయం నాదేనని
సాగి సాగి పోతుండు ॥గర్జి॥

వడ్డి మీద వడ్డిలాగి
మిద్దె మేడ గట్టినోన్ని
దగాకోరు దుండగులను
తరిమి తరిమి కొట్టండి ॥గర్జి॥

మేకల వలె బ్రతుక వద్దు
మేదుగు తన మద్దు
మేకలనే బలిస్తారు
పులులై నెవ్వడివ్వడు ॥గర్జి॥

జి. అంజయ్య
"ఉద్యమం" (పాటలు)

# శూద్రుల సవాల్

ఎందగ జూద్దాముర్రో - సదువుల దళితన్నలార
ఇక ఎగబడదాముర్రో - సేపల కూలన్నలార ॥ఎండగ॥

బి.సి. కుల పోలు మంటె
బిందెల లోని త్తంద్రు
బలిజీ - కాపోలు మంటె
బండి లోను ఇత్తంద్రు
కేంద్రంలో పదవుల్ని
ఆంధ్రాలో ఆస్తుల్ని
కమ్మ దొరలు - రెడ్డి దొరలు ఆల - అమ్మ
సొమ్ము అంటుంద్రు ॥ఎందగ॥

సిన్న - సిన్న కులముల్ని
గుడిసెల్లో పెంచుతుంద్రు
సన్నకారు రైతుల్ని
సంకనాక బెడుతుంద్రు
రాజరికం రద్దన్నరు
రైతే రాజని అన్నరు
విజయనగరం - రాజుగారు
ఇంకా సిన్నొదల కున్నరు ॥ఎందగ॥

ఏ.సి. రూముల్లోన
ఎఫ్.సి. కులపోలుంటే
తాటికమ్మ పాకల్లో
బి.సి. కులపోలున్నరు
కులంలేని మతంలేని
రాజ్యం మనదన్నరు
హైదరాబాదులో కులంలోని
అగ్గి పెట్టుకున్నారు ॥ఎందగ॥

ఆఫీసులో పనికెత్తే
అంటరాదు అంటాడు
పోలీసుల కేసు కెత్తె
పేదోడువు అంటాడు
నువు కుమ్మిన బురద పంట
బుక్కి బుక్కి తింటాడు
ఊలంతా నీ ముందల
ఊక ముక్కకి పనికిరారు ॥ఎందగ॥

ప్రజల రాజ్యమని జెప్పి
ప్రణాళికలు రాసినారు
రాజులుకీ - బామనోలుకి
రాజరికం - ఇచ్చినారు
ఎట్టి పనులు - మట్టి పనులు
శూద్రులకీ జూపినారు
పల్లకుంటె శూద్రులింక,
మన పెళ్లాల్నే అడుగుతారు ॥ఎందగ॥

మంత్రులు - ఎమ్.ఎల్.ఏలు
మన కోసం అన్నారు
భూములు పంచిత్తామని
హామీలు ఇచ్చారు
కరీంనగరు పేదోలు
ఖాలీ భూములు అడిగితె
ప్రధాన మంత్రి భూములనీ
పెండింగులో వుంచేరు ॥ఎందగ॥

భూమి హక్కు నీదానీ
భూమంతా దోచెంద్రూ
ఓటు హక్కు నీదానీ
రిగ్గింగులు బెట్టెంద్రు

తుపాకీని - చూపించి
ఓటు విలువ దోసు కుంద్రు
తుపాకీని - తుపాకితో
తుల్ల గొట్టి నడవరో ॥ఎందగ॥

సీతమ్మను - అగ్గిలెట్టి
శంభుకున్ని నరికినట్టి
శ్రీరాముడు వారసులే
అగ్రజాతి పాలకులు
శూద్రుడు - కర్ణుడు పాలన
శూద్ర జాతి - దని జెప్పే
శూద్ర దళిత - వీరులారా
శూలాలు - పట్టుకోండి ॥ఎందగ॥

వంగపండు ప్రసాదరావు

# ప్రతిఘటని సాగరా

గిరిజనుడా - ఓ
హరిజనుడా
గిరులు తరులు నీవిరా యా
దొరల సొత్తు కావురా
నీ భూమికై నీవు కదలి కదలి కదలరా
కదలి కదలీ కదలరా!
రాళ్ళ భూమిని పదునుచేసి
ముళ్ళ పొదలను పొతము చేసి
మోడు భూమిని బాగుజేసి
పోడు భూమిగ సాగుజేసి
రక్తమిచ్చి పండించిన
పంట భూములు నీవిరా ॥నీ భూమికై నీవు॥

తాత జేసిన అప్పు తీరక
అయ్యజేసేను ఎట్టిశాకిరి
అయ్యజేసిన తీరలేదు
కొడుకు జేసెను అదే శాకిరి-
తీసుకున్నది మూడు పదులు
చేసినది మరి మూడు తరములు
ఇదే దోపిడి - దొరల దోపిడి
ఇదే దోపిడి - దొంగ దోపిడి
సాగదింక సాగదంటూ లేవరా ॥నీ భూమి .... గిరిజనుడా॥

ఎన్నాళ్ళూ ఎన్నేళ్లో
ఎదురు తెన్ను లెన్నాళ్లూ
ఉన్నోళ్ళూ లేనోళ్ళను
దోచుకునే దెన్నాళ్లూ
తర తరాల శ్రమ జీవుల

నోళ్ళగొట్టు బెన్నాళ్ళూ
ఊరువాడ కూడగట్టి
ఊరి దొంగల తరిమికొట్టగ
ఉగ్రుడవై లేవరా - నువ్
ఉగ్రుడవై లేవరా ........ ॥నీ భూమి .... గిరిజనుడా॥

మాయజేసి మోసగించి
అప్పులిచ్చి వడ్డిబెంచి
భూస్వాములు దళారీలు
భూములు కాజేసిరిరా
కాజేసిన మన భూములు
మనవేనని చాటరా!
కాడిగట్టి మేడుబట్టి
భూమిదున్న కదలరా
దున్నె వాడిదౌ కాదౌ - భూమీ
భూమికాడే తేల్చరా ....
ఎదురడ్డం ఎవరొచ్చిన
ఎదురుదెబ్బ దీయరా
ప్రతిఘటించి నిలవరా
ప్రతిన బూని సాగరా .... ॥నీ భూమికై నీవు॥

ఉ. సాంబశివరావు
దళిత కవిత
1992

# సఫాయన్న

సఫాయి పనిచేసెటన్నా - నీ హక్కుకై పోరాడరన్నా
అన్ననొన్నిమాయన్న - సఫాయి కార్మికుడ
ఎన్నాళ్ళు ఈ బతుకు - పోరాడి సాధించు ॥సఫాయి॥

సఫాయన్న అంటరానోడా
సదువురాని ఓ జీతగాడా
సుక్కపొద్దున్నె రోజు లెస్తావూ
కాకిబట్టల్తో పనికిరాంగా
పాసినోటితో డ్యూటికని రాంగా
చిమ్మచీకట్లో భయపడ్తూరాంగా
గాలివానల్లో నీవు నడిచి రాంగా
హాజరువద్దకు వస్తె లేటని పొమ్మండు
మస్కకొట్టినోనిక్కి మచ్చలేసిండు ॥స॥

మంత్రూలు వస్తున్నారంటే
రాత్రి పగలనక పని మీరు చేస్తె
అద్ద మోలె రోడ్లన్ని ఊడ్చి
మురుగు వాసన లేకుండా చేస్తె
బ్లీచింగ్ పౌడర్ చల్లి
కొబ్బరాకుల్తొ ద్వారాలు కడ్తె
జనం గిట్లా రాకపోతే అక్కడా
జైజైలు కొట్టించినారు మీతో
చెయ్యికూడని పనులు ఎన్నో చేపిస్తరు
మీనోరు జారితే శిక్షలు వేస్తారు.... ॥స॥

ఆకలేసి చాయదాగపోతె
అవులవుతలకని నువుబోతె
జెరమచ్చి జ్రెరాగూసుంటే
గావరొచ్చి గోడ కొరిగితే
ఆ టైంలోనే దొర లొచ్చినారు

గల్లిలల్లతిర్గి పోయినారు
ఊరున్న చెత్తున్నదంటూ మీపై
ఉరుములె ఉరిమింౢడు సూడు
పనిజేత్త లేరంటు గేరాజరేసింౢడు
నెలమీద జీతాలు కోతలే కోసింౢడూ ॥స॥

ఇంౠకిమెంటు, డి.ఏలు మీకు
రానిపెట్టి డబ్బు లియ్యాలంటే
పండుగాల అడ్వాన్సులన్నీ
పెళ్ళి చేసేందుకు లోనులన్నీ
పిల్లల చదువుకొరకు లోనులన్నీ
ఆఫీసు అధికారులేరా
అన్ని లోనులు ఎత్తుతున్నారు
ఆఫీసు పనివాళ్ళు హక్కులని పొంది
సఫాయోని హక్కు చెత్తలో పెట్టింౢడు ॥స॥

సఫాయోళ్ళం అందరొక్కటయ్యి
సంఘటితంగా ముందుకు వస్తె
రాష్ట్ర సంఘం మన వెనుక వుంది
సంఘ బలమే మనకండగుందీ
సర్కారు మనకిచ్చిన కూలీ
సక్రమంగా మన కివ్వకుంటే
హద్దులుంటె వాల్నా దరిద్దాం
హద్దుమీరితె వాళ్ళంతు చూద్దాం
సఫాయోల హక్కుల కెవడన్న అడ్డత్తె
అడ్డమొచ్చినోన్ని అంతమే చేద్దాము

కె. రాంలక్ష్మణ్
కరీంనగర్ దళిత పాటలు
1993

# రాజ్యాధికారానికి మాలన్నా

బాంచెన్ బాంచేనంటు
గులాపోన్ని దొర అంటు
ఎన్నాళ్ళు బతుకుతావు - మాలన్నా
నువ్ ఎదురు తిరుగవేమిరో - మాదిగన్నా ॥బాంచెన్॥

నీ సెల్లెను నీ తల్లిని
అసే తుసే అంటుంటే
చిన్న బోయి కూసున్నవ్ - మాదిగన్నా
నువ్ సింహమోలె లేవరో మాలన్నా ॥బాంచెన్॥

పట్టపగలే నీ వోల్లను -
పిట్టల గాల్చినట్టు
పిట్టల గాల్చినట్టు -
కాల్చి పేల్చి తింటుంటే
కన్నీరు బెడతవేల - మాలన్నా
నువ్ కత్తోలె లేవరో - మాదిగన్నా ॥బాంచెన్॥

గుడిసేల సుట్టుముట్టి
గుండెల్లో గుండ్లు దించి
పసిపిల్లల ముసలోల్లను
కసాపిసా తొక్కి తొక్కి
గొరగొర గొర బయటకీడ్చి
కరకరకర కోసేస్తే
గొల్లున ఏడుస్తవేమి - మాదిగన్నా
నువ్ గొడ్డలోలె లేవరో - మాలన్నా ॥బాంచెన్॥

వోట్ల కోసమొచ్చినోడు
ఒగల మాటలెన్నో చెప్పి
అరుగుమీద గూసోని
అన్నా తమ్మీ అనే
మంచినీళ్ళు తెప్పిచ్చి

పుక్కలిచ్చి ఉంచేసే
వోట్లల్ల గెలిసినోడు - మాలన్నా
నీకు వొట్టలు జూపిచ్చెగదా - మాదిగన్నా ॥బాంచెన్॥

మదరాసు రాష్టంలో
మాలోల్లు మాదిగోల్లు
భూస్వాముల బాదపడక
ముస్లిం మతములో జేరితె
శంకాచారిగాడు
వంకర టింకారాయె
హిందూ సమాజ సంఘం
ఎల్లంకల బడిపోయే
ఢిల్లీలో ఇందిరమ్మ
అగమాగమయిపోయే
ఉత్తర ప్రదేశాలో
ఊర్లన్నీ సుట్టుముట్టి
మాలమాదిగల రక్తం
బ్రాందీవిస్కీల తాగి
సంపుమని ఆర్డరిచ్చి మాదిగన్నా
సావు ఖర్చు ఇస్తననే - మాలన్నా ॥బాంచెన్॥

నువ్ మతం మార్చుకున్నా
నీ బతుకు మారదన్నా
నువ్ కులం మార్చుకున్నా
నీకు కూడు దొరకదన్నా
నువ్ రాజ్యమేలకుండ
నీరాత మారదన్నా
రాజ్యాధికారానికి మాలన్నా
నువ్ రైపోలందుకోవర్లో - మాదిగన్నా ॥బాంచెన్॥

గద్దర్



# అనుబంధం – I

## (అకారాది క్రమంలో కవుల పట్టిక)

| కవి పేరు | గీతం పేరు | పేజి | కాలం |
|---|---|---|---|
| ?? | మాలవాంధ్ర పాట | 3 | 1910 |
| ?? | అంటరానితనము | 17 | ?? |
| అంజయ్య. జి. | దళితులనగా ఎవరురా | 87 | 1992 |
| ,, | కూసుంటె కుదరదు తల్లో | 186 | 1991 |
| ,, | గర్జించండి! గర్జించండి | 193 | ?? |
| అనిల్‌కుమార్, పి.ఆర్. | బహుజనులు రాజ్యమేలాలి | 125 | 1992 |
| అప్పలస్వామి, పురిపండా | గుడిలోని దైవమా | 16 | 1933 |
| అప్పారావు, గురజాడ | మాలలు | 4 | 1911 |
| అప్పారావు, బసవరాజు | మాలమాదిగల మొఱ | 15 | ?? |
| ఆంథోని, కొరబండి | లేవరా! దళితుడా | 131 | 1992 |
| ఒడ్డయ్య, సుంకం | మేకమెరం భలిగాకన్నో | 98 | 1983 |
| ,, | పోరు సల్పుమన్నారు | 104 | 1985 |
| ,, | పోరుచేయ ఇకలెవ్వన్నో | 110 | 1985 |
| ,, | సమరం చేద్దాం రావే | 189 | 1985 |
| కె. సి. | ఒరే ఒరే ఒరే దళితన్నా | 83 | 1992 |
| ,, | డప్పుగొట్టి దరువెయ్యనా | 96 | 1992 |
| గద్దర్ | యాలరో ఈ మాదిగ బతుకు | 145 | ?? |
| ,, | మేం బాంచొల్లం | 151 | ?? |
| ,, | దళిత పులులు | 161 | ?? |

| | | | |
|---|---|---|---|
| గద్దర్ | మాయమ్మ ఆలీసమ్మా | 166 | ?? |
| ,, | రాజ్యాధికారానికి మాలన్నా | 202 | ?? |
| నవెంకయ్య, నక్కా | హరిజన కీర్తనలు | 57 | 1935 |
| ,, | మమ్మూ్మ కరుణించి | 59 | 1935 |
| ,, | అంటుమానుడయ్యా | 60 | 1935 |
| ,, | మునిసిపాల్టివారు | 61 | 1935 |
| ,, | హరిజన సంఘాలు | 62 | 1935 |
| ,, | హరిజన స్త్రీల అలరింపు | 64 | 1935 |
| ,, | ఆదిమాంధ్రులంతా | 65 | 1935 |
| ,, | అంటుదోషం | 66 | 1935 |
| ,, | జీవహింస | 67 | 1935 |
| ిరబండ రాజు | నిన్న మనం | 153 | ?? |
| ఃగన్నాథరావు, కొండపల్లి | మేలుకొలుపు | 7 | 1921 |
| ్యాగరాజు, కె. | దళిత జనగణమన | 142 | 1992 |
| ర.క.మ. మిత్రులు | చుండూరు గ్రామంలో.... | 134 | 1992 |
| దేశబంధు, యం.ఎన్.ఆర్. | మాలయెవడా-మాదిగయెవడా | 74 | 1995 |
| ధర్మన్న, కుసుమ | హరిజన శతకము | 54 | 1933 |
| ,, | నల్లదొరతనము | 55 | 1933 |
| ,, | అంటరానితనానికి మంట | 68 | 1935 |
| నవోదయ | అయ్యాల్ల - ఇయ్యాల్ల | 149 | 1992 |
| ప్రసాద్, ఏటుకూరి | తుదిసమరం | 90 | 1977 |
| ప్రసాద్ | కదం కలిపి | 107 | 1992 |
| ,, | జాగర్త జాగర్త | 115 | 1992 |
| ,, | సమరశంఖం | 123 | 1992 |
| | నెత్తుటి ప్రతిజ్ఞ | 128 | 1992 |
| ప్రసాదరావు, వంగపండు | మాలపేట | 72 | 1990 |

| | | | |
|---|---|---|---|
| రఘుపతి, వేదాటి | సాంఘిక వేదమా! వందనం | 79 | 1992 |
| రంగాచార్యులు, కోడేటి | దరిద్ర నారాయణీయము | 25 | ?? |
| రాంలక్ష్మణ్, కె. | సఫాయన్న | 200 | 1993 |
| రామయ్య (కర్ణాటక) | నువ్పోయిన మరునాడు | 119 | 1992 |
| రామారావు, దొండపాటి | చెయ్యరాని ఘోరం | 117 | 1985 |
| ,, | కన్నీటికుండ | 127 | 1987 |
| ,, | ఇదేదారి | 141 | 1985 |
| లక్ష్మీనరసింహ సోమయాజులు, కంభంపాటి | అంబా భారత మాత | 10 | 1923 |
| ,, | మాలలెవరు | 11 | 1923 |
| ,, | హిందూ సోదరులారా | 12 | 1923 |
| ,, | తండ్రి రామానుజా | 12 | 1923 |
| విక్టర్ ప్రసాద్, మారుముడి | రావన్నా చందనాలో.... | 112 | 1991 |
| విజయలక్ష్మి | ఇదీ కథ | 95 | 1977 |
| విముక్తి | మాలమాదిగ బతుకులొద్దు | 178 | 1991 |
| వెంకటరామయ్య, చెఱుకువాడ<br>వెంకటనరసింహారావు, దామోజీపురపు | పంచములని వంచన.... | 7 | 1921 |
| వెంకటరామానాయుడు, నెల్లూరి | హరిజనులు | 14 | 1926 |
| వెంకటసూరి, తిరునగరి | మమువిడిచి స్వరాజ్యమందుట | 9 | 1922 |
| వెంకన్న | మడిధర్మం మనదికాదు.... | 138 | 1992 |
| ,, | ఎన్నిసార్లు ఈ ఘోరాలు | 177 | 1992 |
| శక్తి | మాలోల్లవేదన్న | 192 | 1992 |
| శతార్ | ఆలోచించం డాలోచించండి | 137 | 1992 |
| శంబూక | కదిలినాముర | 80 | 1992 |
| ,, | మనిషికి మతమేమిచ్చింది | 85 | 1992 |
| సవేర | పిలుపు | 76 | 1992 |

| | | | |
|---|---|---|---|
| సత్యనారాయణ, గరిమెళ్ళ | పంచములు | 6 | 1919 |
| ,, | హరిజనులము | 18 | 1933 |
| ,, | జ్ఞానోదయం | 19 | 1933 |
| ,, | నూతనతేజము | 20 | 1933 |
| ,, | హిందూ సంఘీయులము | 21 | 1933 |
| ,, | అస్పృశ్యతా సిద్ధాంత.... | 22 | 1933 |
| ,, | ఎటువంటి మాలలము | 23 | 1933 |
| సత్యనారాయణరావు, ఊటుకూరు | సవర్ణ గర్విష్టి | 28 | ?? |
| సాంబశివరావు, ఉ. | ఎటో తేల్చుకో | 154 | 1993 |
| ,, | దళితనాట్యం | 155 | 1993 |
| ,, | దళిత మాత | 159 | 1991 |
| ,, | హరిజనులం కాదు | 175 | 1991 |
| ,, | కాము మేము హిందువులం | 180 | 1993 |
| ,, | దళిత్ ముస్లిం - భాయీ.... | 182 | 1993 |
| ,, | ప్రతినబూని సాగరా | 198 | 1992 |
| సుబ్బారావు | అందరము మేలుకోవాలి | 77 | 1955 |

—: o :—